# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## డైమండ్ రింగ్
రచన : టెంపోరావ్

## కత్తి విసిరిన కన్య
రచన : సికిందర్

## దివాణంలో దొంగలు
రచన: వసుంధర

## అమృతంలో విషం
రచన: వాణిశ్రీ

పొగమంచు—పదిహేనవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—87
మార్చి, 1981

వెల: రు. 4-50

ఏడాది చందా 55 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:

శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:

టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. ఏ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:

అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:

క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# డైమండ్ రింగు

టెంపోరావ్

కప్పుకున్న దుప్పటిని పక్కకు తోసి మనోరమ కళ్ళు తెరిచి చూసింది. మోహన్ తన పరుపుమీద లేడు. ఆమె టైమ్ చూసింది. ఎనిమిది కావస్తోంది. ఆమె లేచి కూర్చుంది.

సోఫాలో పడుకుని మోహన్ యింగ్లీషు నవల చదువు కుంటున్నాడు. సంతోషంగా ఆమె అతడివంక చూసింది. అతడామెను గుర్తించలేదు. నవల చదవడంలో నిమగ్నుడై పోయాడు.

ఆమె అతడి దగ్గరగా వెళ్ళింది. అతడివైపు ఆప్యాయంగా చూసింది. "మోహన్, నేను పళ్ళు తోముకుని వస్తాను. తర్వాత యిద్దరం కాఫీ తాగుదాం" అందామె.

అతడామె వైపు సీరియస్‌గా చూశాడు. ఆమె చెప్పింది విని వూరుకున్నాడు. ఆమె టేబుల్ వైపు వెళ్ళింది. బ్రష్‌కి టూత్ పేస్టు పులిమి యటాచ్‌డు బాత్ రూమ్‌లోకి నడిచింది. కాస్సేపట్లో ఆమె తిరిగొచ్చింది.

మోహన్ పుస్తకాన్ని పక్క పడేసి పైకి చూస్తూ సోఫాలో పడుకుని వున్నాడు. రిసీవర్ ఎత్తి హోటల్ గుమాస్తాతో ఆమె మాట్లాడింది. రూమ్ నెంబర్ 30 కి బ్రేక్ ఫాస్టు పంపమని చెప్పి, ఆమె మోహన్ పక్కనే సోఫాలో చతికిలబడింది.

అతడి చెయ్యి పట్టుకుని నిమిరింది. అతడి కళ్ళల్లోకి ఆవేశంతో చూసింది. ముందుకు వంగి అతడి పెదిమలను ముద్దెట్టుకుంది.

"ప్లీజ్, నన్ను చంపకు!" అని అతడు లేచి కూర్చున్నాడు.

నిశ్శబ్దంగా ఆమె అతడిని చూస్తూ వుండిపోయింది. కారు యాక్సిడెంట్ తర్వాత మోహన్‌లో ఎంత మార్పు? తను దగ్గరయితే అతడు విసుక్కుంటాడా? అతడికి తనంటే యిష్టం లేదా? మరెవరినేనా అతడు ప్రేమిస్తున్నాడా?

పిచ్చి ప్రశ్నలు! మోహన్ మరెవర్నీ కలుసుకోడం ఆమె చూడలేదు. కారు యాక్సిడెంట్ మూలంగా అతడి బ్రెయిన్ గాయపడింది. అప్పటినుంచీ అతడలా ప్రవర్తిస్తున్నాడు!

ఆమె వెళ్ళి తలుపు తెరిచింది. హోటల్ బాయ్ టీపాయ్ మీద పెద్ద ట్రే వుంచి దూరంగా జరిగాడు. ఆమె సౌజ్ఞ చేయగానే హోటల్ బాయ్ బయటకు వెళ్ళిపోయాడు. ఆమె ఒక ప్లేటును మోహన్ కిచ్చి, మరో ప్లేటు తీసుకుని తినడం ప్రారంభించింది. మోహన్ మౌనంగా తింటున్నాడు.

తినడం పూర్తిచేసి ఇద్దరూ కాఫీ సేవించారు.

"సిగరెట్ కాలుస్తావా?" అందామె.

వద్దన్నట్లు చూశాడతను. టెలఫోన్ మ్రోగింది. ఆమె వెళ్ళి రిసీవర్ని అందుకుంది. "మనోరమ హియర్" అందామె.

"డాక్టర్ సింగ్ స్పీకింగ్! మనోరమా, మీరు నా కోసం ఫోన్ చేశారట. నేను నర్సింగ్ హోమ్‌కి యిప్పుడే వచ్చాను. మీ భర్తను తీసుకు రండి" అన్నాడతను.

"ఎన్నింటికి?"

"నేను పద్దాకా వుంటాను."

"వెంటనే తీసుకొస్తాను డాక్టర్, థాంక్స్" అని ఆమె రిసీవర్ని పెట్టేసింది.

"మోహన్, పద డాక్టర్ దగ్గరకు వెళ్ళాలి!" అందామె.

"రోజూ యిదొకటి! ప్లీజ్, ఐయామ్ ఆల్ రైట్! నాకు డాక్టర్ వద్దు!" అర్చాడతను.

"లే, మోహన్! బి ఎ గుడ్ బాయ్!" అని లాలిస్తూ ఆమె అతడిని నిలబెట్టింది.

దుస్తులు మార్చుకుని వాళ్ళు కిందకు వెళ్ళారు. ముందు హాల్లోంచి వెళ్తూన్న ఆమెకు హోటల్ మేనేజర్ ప్రతాప్ నమస్కారించాడు.

అంబాసిడర్ కారు ముందు సీట్లో మోహన్ కూర్చున్నాడు. ఆమె కారును స్టార్టు చేసి గేటు దాటి పోనిచ్చింది.

* * *

గదిలోని ఫ్లోరసెంట్ ట్యూబ్ ప్రకాశవంతంగా వెలుగుతోంది. టయిమ్ ఆరు దాటింది. మోహన్ సోఫాలో కూర్చుని కామిక్స్ బుక్ చూస్తున్నాడు. "నేను స్నానం చేసి వస్తాను, అలా బీచ్‌కి వెళ్దాం. తర్వాత డిన్నర్!" అందామె.

శూన్యంలోకి చూస్తున్నట్లు అతడామెవంక చూశాడు. ఆమె చీరను విప్పేసింది. పావడా, జాకెట్ లో అతడి ముందు నిలబడింది. అతడివంక కొంటెగా చూసింది. అతడామెవైపు తిరగలేదు, కామిక్స్ బుక్ లో మునిగి వున్నాడు.

"మోహన్!" పిల్చిందామె.

తిరిగి ఆమెకేసి చూశాడు. అతడి చూపులో యే ఆవేశమూ లేదు. ఆమె బాత్ రూమ్‌లోకి పరుగెత్తుకెళ్ళి తలుపు మూసుకుంది.

అరగంట తర్వాత ఆమె బయట కొచ్చింది. టర్కిష్ తువ్వాల్ను నడుంచుట్టూ కట్టుకుంది. పైభాగం నగ్నంగా వుంది. మోహన్ తనని యీ రూపంలో చూడాలి! ఆమె సోఫావైపు చూసింది. కనురెప్పలను చిట్లించింది. మోహన్ సోఫాలో లేడు.

ఆమె సోఫా దగ్గరగా వెళ్ళింది. కామిక్స్ పుస్తకం సోఫాలో పడివుంది. మోహన్ ఎక్కడకు వెళ్ళాడు? ఒంటరిగా బయటకెళ్ళే స్థితిలో లేడతను. ఆమె గుమ్మం వైపు వెళ్ళింది. తలుపు దగ్గరగా మూసివుంది. తలుపు తెరిచి ఆమె బయటకు చూసింది. నడవలో యెవ్వరూ లేరు.

ఆమె తలుపును మూసి వేగంగా దుస్తులు ధరించింది. టేబుల్ మీదకు ఆమె దృష్టి వెళ్ళింది. అంబాసిడర్ కారు యిగ్నిషన్ కీ అక్కడలేదు.

ఆమె వులిక్కిపడింది. కొంపతీసి మోహన్ కారులో ఎక్కడికేనా వెళ్ళాడా? ఆమెగుండె దడదడ కొట్టుకుంది. "ప్రస్తుత స్థితిలో మోహన్ చాలా నడవకూడదు, జాగ్రత్త!" డాక్టర్ సింగ్ మాటలు ఆమెకు జ్ఞప్తి కొచ్చాయి.

మనోరమ రిసీవర్ ఎత్తింది.

"హోటలు రిసెప్షన్!" అందో కంఠం అవతలి వైపు నుంచి.

"మేనేజర్‌కి కనెక్షన్ యివ్వండి."

కనెక్షన్ యివ్వబడింది.

"హలో, ప్రతాప్ స్పీకింగ్."

"మిస్టర్ ప్రతాప్, మనోరమ హియర్. మోహన్ గదిలో లేడు. నేను స్నానం చేస్తూండగా యెక్కడికో వెళ్ళాడు" అందామె.

"డోంట్ బాదర్, నేను కనుక్కుంటాను."

ఆమె రిసీవర్ పెట్టేసింది. గదిలో గాభరాగా పచార్లు చేస్తూ వుండిపోయింది. కాస్సేపట్లో తలుపును ఎవరో తట్టారు. ఆమె తలుపు తెర్చింది. హోటల్ మేనేజర్ ప్రతాప్ లోపలకు వచ్చాడు.

"మనోరమ, డోంట్ బాదర్! ఆయన అంబాసిడర్ కార్లో వెళ్ళారట. మా వాచ్‌మన్ చూశాడు. అలా తిరిగి వచ్చేస్తారు" అన్నాడు ప్రతాప్.

"నాకు భయంగా వుంది. అతడు కారు నడిపే స్థితిలో లేడు!" అందామె.

"నే వెళ్ళి ఆయన కోసం వెతుకుతాను."

"ప్లీజ్, చాలా థాంక్స్," అందామె.

మేనేజర్ ప్రతాప్ బయటకు వెళ్ళిపోయాడు. ఆమె సోఫాలో కూర్చుని ఆలోచిస్తోంది. అరగంటలో మోహన్ ఎక్కువ దూరం వెళ్ళివుండడు! పోలీసు రిపోర్టు యివ్వడం మంచిదేమో! మేనేజర్ ప్రతాప్ తిరిగొచ్చాక ఏదో చెయ్యాలి.

తను తొందరపడకూడదు. ప్రతాప్‌కి మోహన్ కారు

యెక్కడో కనిపించవచ్చు! ఆమె మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి.

ఎనిమిది దాటింది. మేనేజర్ ప్రతాప్ గదిలోకి వచ్చాడు. ఆతని ప్రయత్నం ఫలించలేదని మొహం చూడగానే తెల్సుకుంది మనోరమ.

"మనోరమ, అనేకచోట్ల ఆయన కోసం చూశాను. కాని యెక్కడా ఆయన కారు కనిపించలేదు," అన్నాడతను.

ఆమె కళ్ళు మూసుకుంది. మోహన్ యెక్కడికి వెళ్ళుంటాడు? మళ్ళీ యేదేనా యాక్సిడెంట్ అయిందా? ఇటువంటి సమయంలో తన తండ్రి సలహా తీసుకోవడం మంచిది. ఆమె టెలిఫోన్ దగ్గరకు వెళ్ళి, రిసీవరెత్తి హైద్రాబాద్‌కు ఎస్. టి. డి. కాల్ చేయమని ఆపరేటర్‌తో చెప్పింది.

అటువైపు ఫోన్ మ్రోగుతోంది.

"హలో జయప్రసాద్ అండ్ కంపెనీ!" అందొక యువతి.

"పూర్ణా, నాన్నతో మాట్లాడాలి" అంది మనోరమ.

"ప్లీజ్ వుండండి" అందామె.

అటువైపునుంచి కాసేపట్లో తండ్రి కంఠం వినపడింది.

"మనూ, ఏమిటి?" అడిగాడతను.

"మోహన్ కారులో ఎక్కడికో పోయాడు, నాన్నా!"

"అతడిని బోనులోని జంతువులా వుంచుతున్నావు. విసుగెత్తి ఎక్కడికో పారిపోయి వుంటాడు!"

"నాన్నా, ఇది నవ్వే విషయంకాదు. మోహన్ ఎక్కడున్నాడో వెతకాలి!"

"వెతుకు!"

"నీ సలహాకోసం ఫోన్ చేశాను."

"మనూ, వాడిని పట్టుకు వేళ్ళాడుతూ నీ జీవితాన్ని వేస్టు చేసుకుంటున్నావు. పోయినందుకు సంతోషించి ఫర్‌గెట్ హిమ్!"

"నాన్నా ఐ లవ్ హిమ్. ప్రేమించి పెళ్ళాడాను."

"ఆల్‌రైట్ పోలీసు రిపోర్టియ్యి. పోలీసులు అతడిని పట్టుకుని నీకు అప్పగిస్తారు. పోలీసులతో నా పేరు చెప్పు. అవసరమైతే నాకు మళ్ళా ఫోన్ చేయి. వెంటనే ప్లేన్‌లో వస్తాను."

"థాంక్స్ నాన్నా" అని ఆమె రిసీవర్ని పెట్టేసింది.

ఆమె పోలీసు రిపోర్టిచ్చి సోఫాలో కూర్చుంది. మేనేజర్ ప్రతాప్ సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

నిముషాలు గడుస్తున్నాయి. రెండు గంటలు దొర్లి పోయాయి. టైమ్ పది దాటింది. తిండి తినకుండా మనోరమ తన భర్త గురించి ఎదురు చూస్తోంది. పదిన్నర ప్రాంతంలో టెలిఫోన్ మ్రోగింది.

"హాలో" అందామె.

"ఇన్స్‌పెక్టర్ నాయర్ హియర్, మీ భర్తకోసం పట్నమంతా మా మనుషులు గాలిస్తున్నారు. ఒక విషయం మీకు చెప్పగలను. మీ భర్త కారుకు యాక్సిడెంట్ జరగలేదు. త్వరలో ఎక్కడో అయన మాకు దొరుకుతాడు. వెంటనే మీకు ఫోన్ చేసి చెప్తాను."

"చాలా థాంక్స్ ఇన్స్‌పెక్టర్," అందామె.

రిసీవర్ని పెట్టేసింది. హోటల్ మేనేజర్ ప్రతాప్, వెనకనే ట్రే పట్టుకుని బేరర్ లోపలకు వచ్చారు. ఆమె

ముందునున్న టీపాయి మీద బేరర్ ట్రే పెట్టాడు. "జయప్రసాద్ గారు ఫోన్ చేసి నాతో మాట్లాడారు. మీరు భోజనం చేసేటట్లు చూడమన్నారు" అన్నాడతను.

"నాకు ఆకలిలేదు" అందామె, ట్రే వైపు చూస్తూ.

"మోహన్ గారు తప్పక పోలీసులకు దొరుకుతారు. ఈ సమయంలో మీరు బలంగా ధైర్యంగా వుండాలి. బలానికి తిండి అత్యవసరం."

"మిస్టర్ ప్రతాప్, మీరు వెళ్ళండి, నేను మెల్లిగా తింటాను" అందామె.

మేనేజర్ ప్రతాప్, హోటల్ బాయ్ వెళ్ళిపోయారు. కాలచక్రం తిరుగుతోంది. ఆమె మెల్లిగా తింటోంది. తింటూ ఆలోచిస్తోంది. మోహనంటే ఆమె తండ్రి మొదటినుంచీ యిష్టపడేవాడు కాదు. అతడిని పెళ్ళాడవద్దని ఎన్నిసార్లో హెచ్చరించాడు. కాని ఆమెకు అడ్డుపడే తత్వంకాదు తండ్రిది. మోహాన్ని ఆమె పెళ్ళాడింది. జీవితం హాయిగా సాగిపోతోంది. కారు యాక్సిడెంట్ మూలంగా మోహన్ బ్రెయిన్ గాయపడింది. అప్పటినుంచి అతడు సహజంగా ప్రవర్తించడంలేదు. ఎవరితోటీ ఎక్కువగా మాట్లాడడు. ఒక్కోసారి అర్థంలేకుండా ఏడుస్తాడు. ఒక్కోసారి కోపంగా సమీపంలో వున్న వుస్తువులను అటుఇటు విసురుతాడు. ఆ పరిస్థితులలో ఆమె మద్రాస్ వచ్చింది. డాక్టర్ సింగ్ చేత ట్రీట్‌మెంట్ యిప్పిస్తే మోహన్ ఆరోగ్యం బాగుపడుతుందనే విశ్వాసంతో ఆమె మద్రాసు వచ్చింది.

అర్ధాకలిగా తిని ఆమె చెయ్యికడుక్కుంది. మోహన్ గురించి ఆమె ఆలోచిస్తోంది.

# 2

ఇన్స్పెక్టర్ నాయర్ బిజీగా వున్నాడు. అనేక చోట్లనుంచి టెలిఫోన్ కాల్స్ వస్తున్నాయి. చకచక మాట్లాడి ఏం చెయ్యవలసిందీ అటువైపు వ్యక్తులకు సూచించి యిన్స్పెక్టర్ నాయర్ ఎదురుగా వున్న సార్జెంట్ రామ్‌వైపు తిరిగాడు.

"ఆయన ఏ ఫ్రెండ్ యింటికో వెళ్ళివుండొచ్చు, సార్. అందుకే ఎంత వెతికినా రోడ్లమీద ఆయన కారు కనబడ్డంలేదు" అన్నాడు సార్జెంట్ రామ్.

ఇన్స్పెక్టర్ నాయర్ హోటల్‌కి ఫోన్ చేసి మనోరమతో మాట్లాడి రిసీవర్ని పెట్టేశాడు.

"సార్జెంట్ రామ్, ఆయనకు ఈ పట్నంలో ఫ్రెండ్స్ లేరు!"

సార్జంట్ రామ్ మౌనం దాల్చాడు. టెలిఫోన్ మ్రోగింది.

"హలో," అన్నాడు నాయర్.

"వినోదా హోటల్ మేనేజర్ స్పీకింగ్ సార్. ఇక్కడ హత్య జరిగింది."

"వివరంగా చెప్పండి."

"కాటేజ్ నంబర్ 7లో మిస్ గీత హత్యచేయబడింది."

"ఎవర్నీ ఆ గదిలోకి వెళ్ళనీయకండి. మేం వస్తున్నాం" అని యిన్స్పెక్టర్ నాయర్ రిసీవర్ని పెట్టేశాడు.

ఇన్స్పెక్టర్ నాయర్ కుర్చీలోంచి లేచాడు.

"మిస్టర్ రామ్, ఏదో హత్య జరిగిందట. నువ్వు మాతో రా. అక్కడ నేను ఎక్కువసేపు వుండలేను. అక్కడ పని నువ్వు చూడొచ్చు! మోహన్ కోసం

వెతకాలి. అతడు జయప్రసాద్ గారి అల్లుడు. జయ ప్రసాద్ గారికి మంత్రులతో స్నేహం ఎక్కువ. ఆయన కోటీశ్వరుడు" అన్నాడు నాయర్.

ఇన్స్పెక్టర్ నాయర్ బయటకు నడిచాడు. వెనకనే వెళ్ళాడు సార్జంట్ రామ్.

పోలీస్ జీపు వేగంగా పోతోంది. వెనకనే మోటార్ బైక్ మీద వెళ్తున్నాడు సార్జంట్ రామ్. వినోదా హోటల్ పట్నం చివర వుంది.

రోడ్డుమీద ఎక్కువగా జనసంచారం లేదు. లైట్లు వెల్గు తున్నాయి. పాంట్, బనియన్‌తో రోడ్డు ఓరగా ఒక యువకుడు తూలుతూ నడుస్తున్నాడు. జీప్ హెడ్ లైట్ కాంతిలో అతడిని యిన్స్పెక్టర్ నాయర్ చూశాడు.

"స్టాప్!" అర్చాడు ఇన్స్పెక్టర్.

ఆ యువకుడి పక్కనే జీప్ ఆగింది. యువకుడు రోడ్డమ్మట పరుగెత్తసాగాడు. వెనకనే పరుగెత్తి ఇన్స్పెక్టర్ నాయర్ అతడిని ఆపాడు. టార్చికాంతిలో అతడి మొహాన్ని పరీక్షించాడు. అతడు బాగా తాగాడని యిన్స్పెక్టర్ కనిపెట్టాడు.

"మిస్టర్ నీ పేరు?" అడిగాడు నాయర్.

"మోహన్" అన్నాడతను.

"ఎక్కడికి కెళ్తున్నావు?"

"ఇంటికి."

"ఎక్కడుంది నీ యిల్లు?"

"హోటల్ రివేరా."

ఇన్స్పెక్టర్ నాయర్ కళ్ళు మెరిశాయి. పోలీసులు వెతుకుతున్న మోహన్ యితనే! తన మనుషులు అంబాసిడర్ కారుకోసం చూడ్డంలో రోడ్డమ్మట నడిచిపోతున్న

మోహన్ని గుర్తించివుండరు.

"అంబాసిడర్ కారు ఏమైంది?"

"పెట్రోల్ లేదు. వదిలేశాను."

"ఎక్కడ?"

"తెలియదు."

"మిస్టర్ మోహన్ మీ గురించి మనోరమ మాకు రిపోర్టిచ్చారు."

అతడు ఏమీ మాట్లాడలేదు.

ఇన్స్పెక్టర్ నాయర్ అతడి దుస్తులవంక చూశాడు.

"మీరు బనియన్‌తో తిరగడం విచిత్రంగా వుంది! షర్టు వేసుకోకుండానే బయల్దేరేరా?"

"నాకు జ్ఞాపకంలేదు."

పక్కనున్న సార్జంట్ రామ్‌వైపు తిరిగాడు నాయర్.

"రామ్, నీ మోటర్ బైక్ మీద ఈయన్ని హోటల్ రివేరాకు తీసుకెళ్ళి రూం నెంబర్ 30లో వుండే మనోరమకు అప్పగించు!"

"యస్సార్," అన్నాడు సార్జంట్ రామ్.

సార్జంట్ రామ్ మోటర్ బైక్‌ని స్టార్టుచేశాడు. వెనుక సీటుమీద మోహన్ని కూర్చోబెట్టారు. సార్జంట్ రామ్ బైక్‌ని పోనిచ్చాడు.

ఇన్స్పెక్టర్ నాయర్ జీప్‌లో కూర్చున్నాడు. కానిస్టేబుల్ జీప్‌ను పోనిచ్చాడు. పది నిమిషాల్లో హోటల్ వినోదాముందు జీప్ ఆగింది.

విశాలమైన తోటలోవుంది హోటల్ వినోదా. కొత్తగా నిర్మించిన కాటేజస్ నలవైవున్నాయి. కాటేజస్ విడివిడిగా వున్నాయి. ముందు భాగంలో రిసెప్షన్ ఆఫీసుంది. చెట్లకింద ఎన్నో కార్లు ఆగివున్నాయి.

సన్నగా, పొడుగ్గా వున్న వ్యక్తి జీప్ దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు.

"ఈ హోటల్ మేనేజర్ నేనే సార్. పేరు నాగన్న" అన్నాడతను.

"శవం ఎక్కడుంది?"

"రండి," అన్నాడతను.

నాగన్న పక్క నడుస్తూ యిన్స్పెక్టర్ నాయర్ ఏడో నంబరు కాటేజ్ వైపు వెళ్ళాడు. తలుపు దగ్గరగా మూసి వుంది. తలుపుతోసి నాయర్ లోపలకు వెళ్ళాడు. చిన్న డ్రాయింగ్ రూమ్. పక్కనే పడగ్గది. పడగ్గది విశాలంగా వుంది. పడగ్గదిలో నేలమీద నగ్నంగా ఆమె పడివుంది.

ఆమె వయస్సు యిరవై ఐదు వుండొచ్చు. అనేక చోట్ల కత్తిపోట్లు! పేగులు బయటకు కనిపిస్తున్నాయి. ఆ దృశ్యాన్ని చూసి యిన్స్పెక్టర్ నాయర్ క్షణకాలం కళ్ళు మూసుకున్నాడు.

ఇన్స్పెక్టర్ కాస్సేపయ్యాక పక్కనున్న నాగన్న వంక చూశాడు.

"ఈ హోటల్ ప్రొప్రయిటర్ ఎవరు?"

"సుందరంగారు. ఆయన మస్కట్‌లో వుంటున్నారు. ప్రస్తుతం ఈ హోటల్ నా చేతుల మీదే నడుస్తోంది."

"మీరెక్కడ వుంటున్నారు?"

"నేను బ్రహ్మచారిని. నాకో కాటేజ్ అటువైపు వుంది."

"ఈమె ఎవరు?"

"పేరు గీత. రెండు రోజులనుంచి యిక్కడ వుంటోంది."

"ఆమె యింతకుముందు ఎప్పుడేనా యిక్కడ గది తీసుకుందా?"

"లేదు," అన్నాడు మేనేజర్.

"ఈమెను గురించి మీకేం తెలుసు?"

"నాకేమీ తెలియదు. అనేకమంది వచ్చి యిక్కడ గదులు తీసుకొని కొన్నిరోజులుండి వెళ్ళిపోతూవుంటారు."

యిన్స్పెక్టర్ నాయర్ టైమ్ చూశాడు. పదకొండు దాటింది. అతడు ముందు హాల్లోకి నడిచాడు. సోఫా లున్నాయి. ఒక బల్లమీద టెలిఫోన్ వుంది. ఇన్స్పెక్టర్ నాయర్ బయటకు నడిచాడు. మేనేజర్ నాగన్నతో యిన్స్పెక్టర్ రిసెప్షన్ హాల్లోకి వెళ్ళాడు. అక్కడనుంచి రెండు ఫోన్ కాల్స్ చేసి మళ్ళా కాటేజ్ వైపు నడుస్తూ చెట్టుకింద ఆగాడు.

"నాగన్నగారూ, ఆమెను గురించి మీకేదైనా తెలిసే దాచకుండా చెప్పండి."

"నాకేమీ తెలియదు సార్."

ఇన్స్పెక్టర్ తిన్నగా కాటేజ్ నెంబరు ఏడులోకి వెళ్ళిపోయాడు.

## 3

మెయిన్ రోడ్డునుంచి డాడ్జికారును కుడివైపుకు తిప్పి పోనిచ్చాను. గేటుపైన హోటల్ వినోదా అని పెద్ద అక్షరాల్లో ఆర్చిలా బోర్డుంది. కారును లోపలకు పోనిచ్చి పోలీస్ జీప్ పక్కనే ఆపి దిగాను.

ఇన్స్పెక్టర్ నాయర్ నావైపు వచ్చాడు. అతడితో కరచాలనం చేశాను. నలువైపులా చూశాను. ఎటు చూసినా చెట్లు, పూలమొక్కలు. కాటేజస్ అందంగా కట్టబడినాయి.

"నాయర్ భాయ్, ఈ హోటల్ ఎవరిది?"

"యజమాని మస్కట్‌లో వున్నాడు. మేనేజర్ నాగన్న చేతులమీద అంతా నడుస్తోంది."

"నాగన్న ఏడీ?"

ఇన్స్‌పెక్టర్ నాయర్ యిటూ, అటూ చూశాడు.

"ఇక్కడే వుండాలి, ఏమయ్యాడో!" అని నాయర్ ఒక కానిస్టేబుల్ని పిల్చి నాగన్నను పిలవమని వుత్తర విచ్చాడు.

ఇన్స్‌పెక్టర్ నాయర్‌తో ఏడో నంబరు కాటేజ్ లోకి వెళ్లాను. నేలమీద పడున్న శవాన్ని చూసి వెనక్కు మొహాన్ని తిప్పేశాను. ఘోరమైన దృశ్యం! తిన్నదంతా వాంతవుతుందేమో అనిపించింది.

మనస్సును రాయి చేసుకుని శవాన్ని పరీక్షించాను. ఆమె అందమైన యువతి. ఎవడో కసితో ఆమెను చిత్రవధ చేశాడు. గది నలువైపులా చూశాను. మంచం కింద ఏదో మెరుస్తోంది. దగ్గరగా వెళ్ళి చూశాను. టార్చికాంతితో దాన్ని పరీక్షించాను. డైమండ్ రింగ్. రింగుమీద ఎమ్. అని చెక్కివుంది.

"నాయర్ భాయ్, యీ వుంగరం చూశావా?"

"ఇప్పుడే చూస్తున్నాను" అన్నాడు నాయర్.

"ఈమె పేరు?"

"గీత."

"అయితే యీ వుంగరం యీమెది కాకపోవచ్చు!"

"హంతకుడిదేమో!" అన్నాడు నాయర్.

"అంత విలువైన వుంగరాన్ని హంతకుడు యిక్కడ ఎందుకు వదిలేస్తాడు?"

"బ్రదర్, కత్తితో పొడిచేటప్పుడు అది కిందపడి

వుండవచ్చు. దాన్ని గురించి హంతకుడు మర్చిపోయి వుండొచ్చు!"

"కత్తి దొరికిందా?"

"ఇక్కడెక్కడ లేదు."

"కత్తి పట్టుకుపోయిన హంతకుడు వుంగరాన్ని వదులాడా?" అని లేచి నిలబడ్డాను.

పోలీసు డాక్టర్ సుధాకర్ గదిలోకొచ్చాడు. శవాన్ని చూసి అతడు భయంతో కళ్ళు మూసుకున్నాడు. గదిని పూర్తిగా పరీక్షించి నేను బయటకు నడిచాను. కాటేజ్ ముందు నిలబడి సిగరెట్ వెలిగించాను.

"మేనేజర్ ఏడీ?" అడిగాను నాయర్‌ని.

ఇన్స్‌పెక్టర్ నాయర్ సమీపంలోవున్న కానిస్టేబుల్ వైపు చూశాడు.

"ఆయన పనిలోవున్నారు. వస్తానన్నారు" అన్నాడు కానిస్టేబుల్.

ఇన్స్‌పెక్టర్ నాయర్ శవం పడున్న గదిలోకి వెళ్ళాడు. నలువైపులా చూస్తూ రిసెప్షన్ హాలువైపు నడిచాను—లోపలకు వెళ్ళాను. టెలిఫోన్ ఆపరేటర్ నన్ను చూసి ఏం కావాలని అడిగింది.

"నాగన్న!" అన్నాను.

"ఆయన కళ్ళు తిరుగుతున్నాయి సార్. వెళ్ళి పడుకున్నారు" అందామె.

"ఎక్కడ?"

"ఆయన కాటేజ్‌లో."

"ఎక్కడుంది ఆయన కాటేజ్?"

"నంబర్ 40 సార్. అక్కడికి వెళ్ళకండి. కాస్సేపు

పడుకుని అయనే వస్తారు."

"ఆల్ రైట్" అని బయటకు నడిచాను.

సిగరెట్ పొగ పీల్చి వదుల్తూ తోటలో నడుస్తున్నాను. హోటల్ బాయ్ నా పక్కనుంచి వెళ్తున్నాడు.

"కాటేజ్ నంబర్ 40 ఎక్కడుంది?" ప్రశ్నించాను.

ఒక కాటేజ్ వైపు చేత్తో చూపించాడతను.

"అదే సార్! నాగన్నగారు పడుకున్నారు." అన్నాడతను.

వెనక్కి తిరగాను. అతడు వెళ్ళిపోయాడు. ఒక చెట్టుకింద నిలబడి కాటేజ్ వైపు చూశాను. పడగ్గది కిటికీ కర్టెన్ను పక్కకుతోసి ఒక ఆకారం బయటకు చూస్తోంది!

వేగంగా 40 నంబర్ కాటేజ్ వైపు వెళ్ళాను. ముందు తలుపును తట్టాను.

"ఎవరు?" లోపలినుంచి అడిగాడతను.

"పరశురామ్!" అన్నాను.

"నన్ను క్షమించండి! కళ్ళు తిరుగుతున్నాయి. తర్వాత మిమ్మల్ని కల్సుకుంటాను."

"ఒక్క క్షణం నీతో మాట్లాడాలి!"

తలుపు తెరవబడింది. లైటు కాంతిలో అతడివైపు చూసి ఆశ్చర్యపోయాను.

"మస్తాన్, నువ్వా? జైలునుంచి ఎప్పుడు బయటకొచ్చావు?" అన్నాను.

అతడు జవాబివ్వలేదు. అతడివైపే చూస్తున్నాను. ఆరేళ్ళక్రితం అతడిని నేనే జైలుకి పంపాను. గల్ఫ దేశాల్లో వుద్యోగాలు ఇప్పిస్తానని అతడు ఎందర్నో మోసంచేసి లక్షలు గుంజుకున్నాడు.

అతడు చేతులు జోడించి నాకు నమస్కరించాడు.

"పరశురామ్‌గారూ, ఈ హోటల్ నడుపుతూ నేను ఇప్పుడు మర్యాదగా జీవిస్తున్నాను. బొంబేలో వుండలేక యిక్కడకు వచ్చాను. నా గతం మీకు తెలుసుకాని దాన్ని గురించి పోలీసులకు చెప్పకండి. నన్ను పీడించి నా జీవితాన్ని నాశనం చేస్తారు?" అతడు నన్ను బతిమాలాడు.

"గీతను గురించి నీకు తెలిసిందంతా చెప్పు!"

హాల్లోకి నడిచి సోఫాలో కూర్చుని సిగరెట్ వెలిగించాను. అతడు తలుపుమూసి నావైపు భయంతో చూశాడు.

"పరశురామ్‌గారూ, ఇన్స్‌పెక్టర్ గారితో నాకేమీ తెలియదని అబద్ధమాడాను. ఇప్పుడు మీకేదేనా చెప్తే నేను యిరుకులో పడొచ్చు!"

"డోంట్ బాదర్, నిజం చెప్పు!"

"కాటేజ్ నెంబర్ 7లో ఆమె రెండేళ్ళనుంచి వుంటోంది. ఆమె వ్యభిచారి. శరీరాన్ని అమ్ముకుని డబ్బు గడిస్తూ వుంటుంది."

"అది నీకు తెలిసి వూరుకున్నావా?"

"అటువంటివాళ్ళు వుంటేగాని యీనాడు హోటల్స్ లాభదాయకంగా నడవవు, సార్! అనేక పట్నాలనుంచి వ్యాపారస్తులు మద్రాస్ వచ్చి యీ హోటల్లో బస చేస్తారు. రాత్రిళ్ళు వాళ్ళకు వినోదం కావాలి. గీత వాళ్ళకు వుపయోగపడేది."

"ఆమె కాటేజ్‌కి అద్దె ఎంత?"

"రోజుకు వందరూపాయలు."

"ఆమె అద్దె సక్రమంగా యిచ్చేదా?"

"ఒకోసారి బాకీపడినా చివరకి ఇచ్చేసేది."

"ఆమె ఎంత తీసుకునేది?"

"రాత్రికి ఐదొందలని విన్నాను. అది ఎంట్రన్స్ ఛార్జి. కాటేజ్ లోకి విటుడు ప్రవేశించాక ఆమె ఇంకా డబ్బు గుంజుకునేదని పుకార్లు వున్నాయి."

"ఆమెకొచ్చే ఆదాయంలో నీ కేదేనా వాటా వుందా?"

అతడు బాధతో నావంక చూశాడు.

"పరశురామ్‌గారూ, నేను మస్తాన్ కాను. నాగన్నని. నా జీవితం పూర్తిగా మారిపోయింది. నేను మర్యాదగా బ్రతుకుతున్నాను. సుందరంగారు నాకు యీ కాటేజ్ యిచ్చి వెయ్యిరూపాయలు జీతం యిస్తున్నారు."

"సుందరంగారు ఏం చేస్తున్నారు?"

"ఆయన మస్కట్‌లో సివిల్ యింజనీరు."

సుందరం అడ్రసు, పనిచేసే కంపెనీ పేరు అడిగి తెల్సుకున్నాను.

"ఆయనతో మీరు మాట్లాడదల్చారా?"

అతడివంక సూటిగా చూశాను.

"మాట్లాడొద్దా?"

"ఆయన మరో దేశంలో వున్నారు. ఇక్కడి విష యాలు ఆయనకు తెలియవు. గీత గురించి ఆయన మీకేమీ చెప్పలేరు."

"యూ ఆర్ రైట్, ఆయనతో మాట్లాడ్డం అన వసరం" అన్నాను.

సోఫాలోంచి లేచాను. సిగరెట్ పొగవదుల్తూ అతడి వైపు చూశాను.

"గీతతో నీకు సంబంధముందా?"

అతడు జవాబివ్వలేదు.

"వినోదం కోసం ఆమె కాటేజ్‌కి నువ్వు అప్పు డప్పుడు వెళ్ళేవాడివా?"

"నేను వెళ్ళలేదు సార్. అటువంటి పనిచేస్తే నేనామెకు చులకనయిపోతాను. ఆమె అద్దె కూడా లక్షణంగా యీయక పోవచ్చు!"

గుమ్మంవైపు కదిలాను.

"ఇవాళ రాత్రి ఆమె కాటేజ్‌కి ఎవరేనా వెళ్ళడం నువ్వు చూశావా?"

"లేదు సార్. నేను రిసెప్షన్‌లో బిజీగా వున్నాను. బయట జరిగేది నాకు కనపడదు."

తలుపు తెరిచాను. అతడు చేతులెత్తి నాకు నమస్క రించాడు.

"ఇదంతా పోలీసులకు చెప్పకండి!"

"ఇన్స్‌పెక్టర్ నాయర్ దేవాంతకుడు. ప్రస్తుతం తెలియకపోయినా నీ గురించి అతడు తెల్సుకుంటాడు. నేను చెప్పను కాని అతడు తెల్సుకుంటే నేనేమీ చెయ్య లేను" అని బయటకు నడిచాను.

"పాడు లోకం నన్ను మర్యాదగా బతకనివ్వదు!" అతడి మాటలు నాకు వెనుకనుంచి వినపడ్డాయి. వేగంగా కాటేజ్ నంబర్ 7లోకి ప్రవేశించాను. డాక్టర్ సుధాకర్, ఇన్స్‌పెక్టర్ నాయర్ ముందు హాల్లో నాకు ఎదురయ్యారు.

"పరశురామ్‌గారూ, ఎవరో పిచ్చాడు ఆమెను చిత్ర వధ చేసుండాలి! తొమ్మిది పది మధ్య ఆమె మరణించి వుండాలి" అన్నాడు డాక్టర్ సుధాకర్.

శవం పడున్న గదిలోకి వెళ్లాను. స్టీలు బీరువాలో

మూడు మెక్‌డోవల్స్ బ్రాందీబాటిల్స్ వున్నాయి. ఇంకా వాటిని తెరవలేదు. శవం ఫోటోలు తియ్యడం పూర్తయింది.

ఆమె వైపు పరీక్షగా చూశాను. చెవులకు రింగు లున్నాయి. మెళ్ళో బంగారం గొలుసుంది. ఎడంచేతికి వాచ్ వుంది. జపానిస్ సీకో వాచ్. వాచ్ నడుస్తోంది. టైమ్ పన్నెండు కావస్తోంది.

బీరువాను పరీక్షించాను మళ్ళా. కొన్ని నోట్లకట్ట లున్నాయి. ఈ హత్యచేసిన వ్యక్తి డబ్బునీ, నగలనూ ముట్టుకోలేదు. ఆలోచిస్తూ వెనక్కి తిరిగి బయటకు నడిచాను.

ఇన్‌స్పెక్టర్ నాయర్ నా చెయ్యి పట్టుకున్నాడు.

"బ్రదర్, నాగన్నతో మాట్లాడావా?"

"మాట్లాడాను."

"వాడు పరమ లయ్యర్.గీత రెండురోజులనుంచి యీ కాటేజ్‌లో వుంటోందని అబద్ధమాడాడు. ఆమె యీ కాటేజ్‌లో చాలాకాలంనుంచి వుంటోందిట!" అన్నాడు నాయర్.

"నాయర్ భాయ్, ఈ కాటేజ్‌లోకి ప్రవేశించిన వ్యక్తిని ఎవరో చూసివుండొచ్చు. నేనలా తిరిగి హోటల్ నౌకర్లతో మాట్లాడివస్తాను" అని బయటకు నడిచాను.

## 4

డాక్టర్ సింగ్‌కు ఎదురుగా మనోరమ కూర్చుంది.

"మనోరమా, నిన్నరాత్రి మోహన్ని నా దగ్గరకు తీసుకురావడం మంచిదైంది. నిన్న ఆయన బాగా బ్రాందీ తాగారు. దానితో మెదడు బాగా ఎఫెక్టు అయింది" అన్నాడు డాక్టర్.

"డాక్టర్, మోహన్ దగ్గర డబ్బులేదు. ఎలా తాగేడో!" అందామె.

"ఆయన దగ్గర డబ్బు వున్నట్లు మీకు తెలియ లేదేమో!"

"నాకు తెలుసు, డాక్టర్. అతడికేమి కావలసినా నేను కొనియిస్తాను. అతడి జేబులో పర్సులేదు. మరో విషయం. చొక్కా లేకుండా అతడు రోడ్డమ్మట నడుస్తూ పోలీసులకు దొరికాడు!"

"ఒళ్ళు వేడెక్కి చొక్కా తీసేసివుంటాడు. అదెక్కడో జారిపోయి వుంటుంది."

"డాక్టర్, మోహన్ని చూడొచ్చా?"

"చూడొచ్చు, కాని ఆయన్ని లేపవద్దు. నిద్ర పోతున్నారు. ఆయన లేచిన తర్వాత మీరు మాట్లాడొచ్చు!"

ఆమె కుర్చీలోంచి లేచింది. మోహన్ వుండే గదిలోకి వెళ్ళింది. గదిలో ఫాన్ తిరుగుతోంది. మంచం పక్కకు వెళ్ళిందామె. ఒక నర్సు గదిలో స్టూల్ మీద కూర్చుని వుంది.

"బాగా నిద్రపోతున్నారు. రాత్రినుంచి ఒకే నిద్ర!" అంది నర్సు.

మనోరమ అతడివంక ఆప్యాయంగా చూసింది. అమాయకుడిలా అతడు పడుకుని వున్నాడు. అతడి అరచేతులు ఛాతీమీద వున్నాయి. అతడి వేళ్ళను చూసిందామె. డైమండ్ రింగ్ ఏమైంది? పెళ్ళిముందు తను యిచ్చిన డైమండ్ రింగ్‌ను మోహన్ ఎలా పోగొట్టుకున్నాడు?

పోలీసులు ఆ వుంగరాన్ని తీసేరేమో! వాళ్ళను అడగాలి! ఆలోచిస్తూ ఆమె వెనక్కు తిరిగి డాక్టర్ సింగ్

గదివైపు నడిచింది.

"సాయంత్రం రమ్మంటారా?"

"ఆయన లేచాక మీకు ఫోన్ చేస్తాను" అన్నాడు డాక్టర్.

మనోరమ తన కారువైపు నడిచింది. టైమ్ చూసింది. పదికావస్తోంది. పొద్దుటే అంబాశిడర్ కారును పోలీసులు తీసుకొచ్చి ఆమెకు అప్పగించారు. అడ్యార్ ప్రాంతంలో కారు దొరికిందని పోలీసులు చెప్పారు.

స్టేరింగ్ వీల్ వెనక కూర్చుని మనోరమ తలుపు మూసింది. కారును పోనిచ్చింది. ఆమె మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. మోహన్ కారును అడ్యార్ ప్రాంతంలో వదిలేశాడు, పెట్రోలు లేక. జేబులో డబ్బుంటే పెట్రోలు పోయించి వుండేవాడు. అక్కడనుంచి పిచ్చిగా నడిచివెళ్ళిపోయాడు. ఎక్కడికెళ్ళాడో అతడికే గుర్తులేదు!

క్రితం రాత్రి తనని చూడగానే మోహన్ పిచ్చివాడిలా ఏడ్వసాగాడు. భయపడి వెంటనే అతడిని ఆమె డాక్టర్ సింగ్ నర్సింగ్ హోమ్‌కి తీసుకెళ్ళింది. డాక్టర్ సలహా మేర అతడిని అక్కడే వుంచేసింది.

హోటల్ రివేరా కాంపౌండులో కారాపి ఆమె తన గదికి చేరుకుంది. తలుపు మూసి పరుపుమీద వాలిపోయింది. గత రాత్రి ఆమెకు నిద్రపట్టలేదు. నర్సింగ్ హోమ్‌లో మోహన్ ఎలా వున్నాడో అని బెంగపడ్తూ ఆమె నిద్రపోకుండా వుండిపోయింది. నర్సింగ్ హోమ్‌లో అతడితో వుంటానంది. కాని డాక్టర్ సింగ్ ఆమెను హోటల్‌కు వెళ్ళిపోమన్నాడు.

టెలిఫోన్ మ్రోగింది. ఆమె వెళ్ళి రిసీవర్ని అందు

కుంది.

"హలో! మనోరమ స్పీకింగ్!"

"నమస్తే మనోరమ! నేను ఎవరో మీకు తెలియదు. మీతో అర్జంటుగా మాట్లాడాలి" అందో పురుషకంఠం అటువైపునుంచి.

"ప్రస్తుతం నేను ఎవరితోనూ మాట్లాడలేను. మోహన్ స్థితి బాగాలేదు" అందామె.

"మోహన్ గురించే మాట్లాడాలి."

"ఎవరు మీరు?"

"పేరుచెప్పి లాభంలేదు. నేను చెప్పదల్చినది విన్నాక మీకంతా తెలుస్తుంది."

మోహన్ని గురించి అతడు ఏంచెప్తాడు? తెలుసుకోడం మంచిదేమో!

"వెంటనే నా హోటల్కి రండి!" అందామె.

"నేనక్కడకు రాను. నేను చెప్పిన చోటుకు మీరు రావాలి!"

"ఎక్కడకు?"

"గాంధీ విగ్రహం సమీపంలో వున్న బీచ్ కి రండి. పగలు అక్కడ ఎవ్వరూ వుండరు. మీ కారును లోపలి రోడ్డువారగా ఆపి కూర్చోండి. నేను మీ దగ్గరకు వస్తాను."

"నా కారు నంబరు తెలుసా?"

"తెలుసు."

"ఎప్పుడు నేను రావాలి?"

"సరిగ్గా పన్నెండింటికి."

"అలాగే వస్తాను."

"ఈ విషయం ఎవరికీ చెప్పొద్దు. చెప్తే మోహన్ కి

ప్రమాదం సంభవిస్తుంది."

"ఆల్ రైట్."

అటువైపునుంచి క్లిక్ శబ్దం వినపడింది. రిసీవర్ని పెట్టేసి ఆమె సోఫాలో కూర్చుంది. ఏమిటీ మిస్టరీ? మోహన్ గురించి అతడు ఏం చెప్తాడు?

టీపాయిమీదున్న దినపత్రికను చేతిలోకి తీసుకుని ఆమె చూడసాగింది. ఘోరమైన హత్య! హోటల్ వినోదాలో జరిగిన గీత హత్య గురించి ఆమె చదివింది. భయంతో పేపర్ని టీపాయిమీద పడేసింది.

సరిగ్గా పన్నెండింటికి ఆమె అంబాసిడర్ కారును బీచ్ లోపల రోడ్డుమీద ఆపింది. దగ్గరలోవున్న సముద్రం హోరు వినపడ్తోంది. ఆమె నలువైపులా చూసింది. ఎవ్వరూ ఎక్కడా కనపడలేదు.

బీచ్ లో వున్న పడవ వెనకనుంచి ఒకతను మెల్లిగా నడిచి కారు దగ్గరకు వచ్చాడు. తలుపు తెర్చి ముందు సీటుమీద కూర్చున్నాడు. సన్నగా, పొడుగ్గా వున్నాడు. పాంట్, స్లాక్ ధరించాడు. అమెరికన్ క్రాపు. నల్లటి కళ్ళద్దాలను ధరించాడు. చేతిలో ప్లాస్టిక్ బాగ్ వుంది.

"మనోరమ, నేనే మీకు ఫోన్ చేసింది" అన్నాడతను.

బ్రాందీ వాసన అతడినుంచి వెలువడ్తోంది.

"తొందరగా చెప్పండి. నేను పోవాలి" అందామె.

"ఇదంత తొందరగా తేలే విషయం కాదు" అన్నాడతను.

సిగరెట్ తీసి వెలిగించాడు.

"ప్రారంభించండి!"

"ఇవాళ పేపర్లో గీత హత్యగురించి చదివారా?"

అడిగాడతను.

"చూశాను."

అతడు బాగ్ తెరిచాడు. కాగితంలో చుట్టిన ఒక పాకెట్‌ను పైకి తీశాడు. ఆమె దానివైపు విచిత్రంగా చూసింది.

అతను పాకెట్‌ను విప్పాడు. రక్తంతో ఎర్రబడిన తెల్ల షర్టును చూసి వులిక్కిపడింది. ఆ షర్టు వేసుకునే క్రితం రాత్రి మోహన్ కారులో బయటకు వెళ్ళాడు! గదికి తిరిగొచ్చేసరికి యీ షర్టులేదు. షర్ట్ పక్కనే రక్తం మరకలున్న కత్తివుంది.

ఆ రెండింటినీ చూసి ఆమె మూగవారిపోయింది. ఆమె గుండె దడదడ కొట్టుకుంటోంది.

గీత అనే యువతిని మోహన్ హత్యచేశాడా? ఈ ప్రశ్న ఆమె చెవుల్లో మారు మ్రోగుతోంది.

"మనోరమ మోహన్ ఏంచేశాడో అతడికే తెలియదు! ఈ షర్టుతో, కత్తితో అతడు రోడ్డువారగా నడుస్తూంటే నేను చూశాను. లక్కీ. ఆ సమయంలో రోడ్డుమీద ఎవ్వరూ లేరు. అతడు నిషాలో వున్నాడు. ఈ షర్ట్ తీసేసి, కత్తిని లాక్కొని అతడిని పోనిచ్చాను."

"మంచిపని చేశారు" అందామె.

"అతను మీ భర్త అని తెల్సుకుని మీకివ్వడాని కొచ్చాను!" అని అతను పాకెట్‌ను మళ్ళా కట్టేశాడు.

ఆమె ఆలోచిస్తోంది. మోహన్ ఆమె గదికి ఎందుకు వెళ్ళాడు? ఆమె అతడికి యింతకుముందు తెలుసా?

"ఆ యువకుని వేలికుండే డైమండ్ రింగ్ గీత శవం పక్కన మంచంకింద పోలీసులకు దొరికిందని నేను విన్నాను. అది ఏమైనా యీ పాకెట్ పోలీసులుచూస్తే

వెంటనే మీ భర్తను అరెస్టుచేస్తారు. సందేహంలేదు!"

ఓ నిముషం తర్వాత ఆమె అతడివైపు చూసింది.

"మీకు ఏం కావాలో చెప్పండి. ఆ పాకెట్ నాకిచ్చేయండి!" అందామె.

జయప్రసాద్ అల్లుడు హంతకుడని పేపర్లలో పడితే ఆమె తండ్రి తలెత్తుకుని తిరగలేడు! తన తండ్రికి తెలియకుండా తను చూడాలి!

"మనోరమ, నేను ధనవంతుడిని కాను. ఈ పాకెట్ జాక్‌పాట్‌లా నాకు లభించింది. నేను అడిగేది మీరిస్తే యీ పాకెట్ యిచ్చేస్తాను."

"ఎంత కావాలి?"

"ఐదు లక్షలు!" అన్నాడతను అగ్గిపుల్లను గీస్తూ.

ఆమె తృళ్ళిపడింది.

"అంత డబ్బు నా దగ్గర లేదు!"

"జయప్రసాద్‌గారు కోటీశ్వరులు. ఆయనకు ఒక్కగానొక్క కూతురు మీరు. మీరు అడిగితే ఐదు లక్షలు వెంటనే యిస్తారాయన."

"నా గురించి మీకంతా తెలిసినట్లుందే!"

"తెలియకుండా యిక్కడికొస్తానా!" అన్నాడతను.

ఆమె టైమ్ చూసింది. పన్నెండున్నర అయింది.

"ప్రస్తుతం నేను యిరవై అయిదువేలు యివ్వగలను. వారంరోజుల్లో తతిమ్మా దానికోసం ప్రయత్నిస్తాను."

ఆమెవైపు అతడు సూటిగా చూశాడు.

"వారంరోజులు నేను వుండలేను. వెంటనే యిరవై అయిదువేలు యిస్తే తీసుకుంటాను. తతిమ్మాది మూడు రోజుల్లోపల నాకు అందాలి. అటుపైన యీ పాకెట్ మీ చేతికొస్తుంది."

"నేను బాంకికి వెళ్ళి డబ్బు తీసుకోవాలి. దానికి టైముపడుతుంది."

"ఇవాళ రాత్రి ఎనిమిదింటికి ఇదే స్థలంలో వుండండి. నేను వచ్చి డబ్బు తీసుకుంటాను. తరివాత్మాది మూడు రోజుల్లోపల రెడీ చెయ్యండి."

"అలాగే. మీ పేరు?"

"పేరులో ఏముంది? అయినా మీ తృప్తికి గిరీశం అనుకోండి!" అని నవ్వుతూ అతడు తలుపు తెరుచుకుని దిగాడు.

"మీతో మాట్లాడాలంటే ఏం చెయ్యాలి?"

"నా ఫోన్ కాల్ కోసం వేచి వుండాలి" అని అతను వేగంగా రోడ్డువైపు వెళ్ళిపోయాడు. ఆమె అంబాసిడర్ కారును పోనిచ్చింది.

## 5

మస్కట్‌లో వుంటే సివిల్ యింజనీర్ సుందరంతో మాట్లాడాను. నాగన్న తను చిత్రించినట్లు మర్యాదగా బతకడంలేదని గ్రహించాను.

రిసీవరెత్తి నాయర్‌కి ఫోన్ చేశాను.

"ఇన్స్‌పెక్టర నాయర్!"

"నాయర్ భాయ్, ఆ వుంగరం గురించి కనుక్కున్నావా?" అడిగాను.

"నువ్వు అన్నట్లు అది బాపాలాల్ అండ్ కంపెనీ తయారుచేసినదే. వాళ్ళు ఆ వుంగరాన్ని సంవత్సరం క్రితం మనోరమకు అమ్మారు."

"మనోరమ ఎవరు?"

"ప్రఖ్యాత పారిశ్రామికవేత్త జయప్రసాద్‌గారి కూతురు. ఆమె ప్రస్తుతం హోటల్ రివేరా, రూమ్

నెంబర్ 30లో వుంటోంది. నిన్న రాత్రి ఆమె భర్త మోహన్ మాయమయ్యాడు. అతడు అడ్యార్ ప్రాంతంలో మాకు దొరికాడు!"

"నాయర్ భాయ్, హోటల్ వినోదా ఆ ప్రాంతంలోనే వుంది!" అన్నాను.

"అవును బ్రదర్, అది నేను గుర్తించలేదు!"

"నాయర్ భాయ్, నేను వస్తున్నాను. ఆ వుంగరం నాకు కావాలి" అని రిసీవర్ని పెట్టేశాను.

టైము మూడు కావస్తోంది. మెట్లెక్కి పైకివెళ్ళాను. తలుపును తట్టాను. తలుపు తెరవబడింది. ఒక అందమైన యువతి నా వంక నవ్వుతూ చూసింది.

"మనోరమ!"

"నేనే" అందామె.

"డిటెక్టివ్ పరశురామ్" అన్నాను.

ఆమె ఎందుకో వులిక్కిపడింది.

"రండి, కూర్చోండి" అందామె.

విశాలమైన గది. డ్రాయింగ్ రూమ్ కమ్ పడగ్గది. సోఫాలో కూర్చున్నాను. ఆమెవైపు నవ్వుతూ చూశాను.

"మోహన్ లేరా?"

"అతడు నర్సింగ్ హోమ్‌లో వున్నాడు సార్. మీకేం కావాలి?"

కోటు జేబులోంచి ఉంగరం తీశాను. ఆమెకు కనపడేటట్లు పట్టుకున్నాను. దానివైపు ఆమె ఆశ్చర్యంగా చూసింది.

"ఈ వుంగరాన్ని మీరు చూశారా?" అన్నాను.

నా చేతిలోని వుంగరాన్ని ఆమె తీసుకుంది. పరీక్షగా చూసింది.

"ఈ వుంగరం నేనే కొన్నాను. పెళ్ళిముందు మోహన్‌కి యిచ్చాను. దీనిమీద ఎమ్. అని కూడా వుంది!" అందామె.

"ఈ వుంగరం విచిత్రంగా నిన్న రాత్రి హత్యచేయ బడిన గీత గదిలో మాకు దొరికింది" అని ఆమెవంక చూశాను.

"ఎలా దొరికిందో విచిత్రంగా వుంది సార్."

"మోహన్ హోటల్ వినోదా సమీపంలో నే పోలీసులకు కనిపించారు!"

ఆమె వుద్రేకంతో నావైపు చూపింది.

"పరశురామ్‌గారూ, మోహన్‌కి ఆ హత్యతో ఎటువంటి సంబంధమూ లేదని నేను చెప్పగలను. ఆ యువతిని మోహన్ చంపవలసిన అవసరంలేదు. ఎవరో మోహన్ని అందులో యిరికించడానికి ప్రయత్నిస్తున్నారు!"

కొంతసేపు గదిలో నిశ్శబ్దంగా వుంది. ఆమె సోఫాలోంచి లేచి వచ్చి నా ముందు నిలబడింది. దీనంగా నావైపు చూసింది. ఆ క్షణంలో ఆమెను చూస్తూంటే నాకు జాలివేసింది.

"పరశురామ్‌గారూ, మోహన్ నా భర్త. ప్రేమించి అతడిని పెళ్ళాడాను. కారు యాక్సిడెంట్‌లో అతడి తలకు దెబ్బలు తగిలాయి. అటుపైన అతడు మునపటిలా లేడు. డాక్టర్ సింగ్ అతడికి ట్రీట్‌మెంట్ యిస్తున్నారు. మోహన్ అంటే నాకెంతో ప్రేమ. అయినా ప్రేమ మూలంగా నేను గుడ్డిదాన్ని అవను. మీకు మరి కొన్ని విషయాలు చెప్తాను. నా తరఫున మీరు పరిశోధించి నిజం తెల్సుకోండి. మోహన్ నిర్దోషని ఋజువయితే సంతోషిస్తాను. అతడు ఏదైనా నేరం చేసుంటే

తగిన శిక్షను అనుభవించాలని నా అభిప్రాయం”
అందామె.

“మనోరమ, మీకు తెలిసినది చెప్పండి.”

ఆమె వెళ్ళి సోఫాలో కూర్చుంది.

“పరశురామ్‌గారూ, ఒకతను నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు!” అందామె.

“ఎవరతను?”

“పేరు తెలియదు. నిన్న రాత్రి మోహన్ వెళ్ళేటప్పుడు షర్టు వుంది. పోలీసులకు అతడు దొరికినప్పుడు షర్టు లేదు. పాంట్, బనియన్‌లో వున్నాడు మోహన్. ఆ షర్టు, ఒక కత్తి నన్ను కల్సుకున్న వ్యక్తి దగ్గర వున్నాయి. షర్టు రక్తమయంగా వుంది. కత్తిమీద రక్తం మరకలున్నాయి.”

ఆమె ఆగింది. గాభరాగా అంతా వివరంగా చెప్పింది.

“ఇవాళ రాత్రి అతడికి డబ్బు యిస్తున్నారా?” అడిగాను.

“మీరు ఏం చెయ్యమంటే అలా చేస్తాను”అందామె.

ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించి పొగ పీల్చి వదులూ క్షణకాలం ఆలోచించాను.

“అతడికి యివ్వండి. నోట్ల నంబర్లు రాసుకోండి. తతిమ్మాది మూడురోజుల్లో సిద్ధం చేస్తానని చెప్పండి. ఏమాత్రం అనుమానం లేకుండా అతడు వెళ్ళిపోయేటట్లు చూడండి” అన్నాను.

“అలాగే చేస్తాను” అందామె.

“నిన్న రాత్రి మోహన్ బనియన్ మీద రక్తం మరకలున్నాయా?”

“లేవు” అంది మనోరమ.

టెలిఫోన్ మ్రోగింది. ఆమె వెళ్ళి రిసీవర్ని అందు కుని, మాట్లాడి నాముందు కొచ్చింది.

"డాక్టర్ సింగ్ ఫోన్ చేశారు. మోహన్ లేచాడట. అతడిని చూడ్డానికి రమ్మన్నారు."

"నేను వస్తాను. మోహన్‌తో మాట్లాడ్డం మంచిది."

"అతడు మిమ్మల్ని చూసి భయపడ్తాడేమో!"

కమ్మగా నవ్వాను.

"భయపెట్టకుండా మనుషులను కల్సుకోడం నాకు బాగా తెలుసు."

"అయితే రండి" అందామె.

ఇద్దరం కిందకు నడిచాం. నా కారు పక్కనే ఆగాను.

"నేనక్కడ మరికొంతసేపు వుంటాను. అందువలన నా కార్లో వస్తాను" అని సమీపంలో వున్న అంబాసిడర్ వైపు నడిచిందామె.

ఆమె కారును గేటువైపు పోనిచ్చింది. వెనకనే డాడ్జి కారును పోనిచ్చాను. నా మెదడులో ఆలోచనలు సాగు తున్నాయి. మనోరమను బ్లాక్ మెయిల్ చేస్తూన్నతను ఎవరు? గీతను హత్యచేసిన వ్యక్తి ఆమెను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడా?

## 6

డాక్టర్ సింగ్ కరచాలనంచేసి నన్ను కూర్చో మన్నాడు. ఎదురుగా కూర్చుని అతడివంక చూశాను. ఎన్నేళ్ళపాటో అమెరికా, ఇంగ్లండ్ దేశాల్లో కృషిచేసి అతడు లెక్కలేనన్ని డిగ్రీలను సంపాదించాడు.

"డాక్టర్ సింగ్, నిన్నరాత్రి మోహన్ యిక్కడకు వచ్చినప్పుడు ఆయన ఎలా వున్నారు?"

"హిస్టీరికల్ స్టేట్‌లో వున్నాడు. ఏడుస్తున్నాడు. ఇంజక్షన్ యిచ్చి అతడిని పడుకోబెట్టాను."

"ఆయన అప్పుడప్పుడు వైలెంట్‌గా ప్రవర్తిస్తారా?"

"అతను మెంటల్ డిప్రెషన్ మూలంగా ఒక్కోసారి వైలెంట్‌గా అగుపిస్తాడు. ఆ సమయంలో వస్తువులను అటూ యిటూ విసిరేస్తాడు."

"ఆ సమయంలో మనుషులకు హాని చేయ్యొచ్చా?"

"చేయడు. ఎవరేనా అడ్డొస్తే తన షెల్‌లోకి పోయి మౌనంగా వుంటాడు."

అతడివైపు చూశాను నవ్వుతూ.

"నిన్న రాత్రి అతడు ఎక్కడికెళ్ళాడో కనుక్కున్నారా?"

"అడిగాను. అతడికి ఏదీ గుర్తుండడం లేదు. ఏదీ చెప్ప లేకపోయాడతను. కారులో పెట్రోల్ లేక దిగి నడవసాగాడు. ఎక్కడికెళ్ళాడో, ఎవర్ని కల్సుకున్నాడో అతడికి జ్ఞాపకం లేదు."

డాక్టర్ సింగ్‌కు థాంక్స్ చెప్పి మోహన్ గదిలోకి వెళ్ళాను. అతడు పరుపుమీద పడుకొని వున్నాడు. ప్రక్కనే కూర్చుని మనోరమ అతడితో కబుర్లు చెప్తోంది. అతడు నావైపు చూడలేదు.

కొంచెం దూరంలో నిలబడి కాస్సేపు అతడిని పరికించాను. యువకుడు. అందంగా వున్నాడు. వెర్రివాడిలా భార్యవైపు చూస్తున్నాడు.

వెనక్కి తిరిగి బయటకు నడిచాను. నడవమ్మట కదులుతున్నాను. మనోరమ గబగబా నా దగ్గరకొచ్చింది.

"పరశురామ్‌గారూ, రాత్రి ఎనిమిదింటికి బీచ్‌లో డబ్బు అతడికిస్తాను" అందామె.

"ఇవ్వండి. మీరు భయపడకండి!"

ఆమెకు బైబై చెప్పి నా కారువైపు వేగంగా నడిచాను. జేబులో వున్న డైమండ్ రింగ్ గుర్తొచ్చింది. దాన్ని యిన్స్పెక్టర్ నాయర్‌కి యిచ్చేయాలి. డాడ్జి కారును స్టార్టుచేసి, పోలీస్ హెడ్ క్వార్టర్స్‌వైపు పోనిచ్చాను.

చల్లగాలి వీస్తోంది. పేవ్‌మెంట్ మీదున్న లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి. టైమ్ ఏడున్నర అయింది. సముద్రంవైపు తిరిగిచూశాను. వేలాది ప్రజలు యిసుకలో కూర్చుని వున్నారు. పిల్లలు అరుస్తూ పరుగెడుతున్నారు.

పూలమొక్కలను చూస్తూ ముందుకు నడిచాను. బీచ్ లోపల రోడ్డుకు వెళ్ళాలంటే కార్లు యిక్కడే తిరగాలి. వెనక్కు తిరిగాను. అక్కడే యిటూ, అటూ పచార్లు చేస్తున్నాను.

7-50కి అంబాసిడర్ కారు మలుపు తిరిగి లోపలకు వెళ్ళింది. ఆ కారునే చూస్తూ నిలబడ్డాను. లోపల రోడ్డు మీద కారు ఆగింది. పూలమొక్కలమధ్య నుంచి ఆ కారువైపు వెళ్ళాను. ముందు సీటుమీద మనోరమ కూర్చుని వుంది. కారు ముందునుంచి వెళ్తూండగా ఆమె నావైపు చూసింది కాని నన్ను గుర్తుపట్టినట్లులేదు. గోచీ పోసి పంచకట్టాను. పొడుగాటి జుబ్బా, తెల్లటి గడ్డం. తలమీద మార్వాడీ టోపీ. కళ్ళద్దాలు!

కారుకు కొంచెం దూరంలో యిసుకలో కూర్చున్నాను. టైమ్ చూశాను. ఎనిమిదైంది. ఒకతను కారువైపు వెళ్ళాడు. ఆమె ఒక పాకెట్‌ను అతడికిచ్చింది. అతడు బాగ్‌లో దాన్ని పడేసుకున్నాడు.

నేను లేచాను. అతడు రోడ్డువైపు వెళ్తున్నాడు. కొంచెం దూరంలో అతడిని వెంటాడాను. అంబాసిడర్ కారు వెళ్ళిపోయింది. పేవ్ మెంట్ వారగా ఒక ఆటో ఆగివుంది. ఓసారి నావైపుచూసి అతడు ఆటోలో ఎక్కి కూర్చున్నాడు. వెంటనే ఆటో కదిలింది.

సమీపంలోవున్న ఫియట్ కారులో కూర్చొని తలుపు మూశాను. ఆటో వెళ్ళినవైపు కారును పోనిచ్చాను. మనోరమను బ్లాక్ మెయిల్ చేసే మనిషెవరో నేను గ్రహించగల్గాను.

ఇరవై నిమిషాలుపైన ఆటో వెళ్తూనే వుంది. ఒక గేటుదాటి ఆటో లోపలకు వెళ్ళింది. రోడ్డమ్మట కొంచెం దూరంవెళ్ళి, వెనక్కి తిప్పి ఫియట్ కారును గేటుదాటి అదే కాంపౌండ్ లోకి పోనిచ్చి ఆపాను.

కిందకు దిగాను. 40 నంబరు కాటేజ్ లోకి వెళ్ళి నాగన్న తలుపు మూశాడు. ఆ కాటేజ్ వైపు వేగంగా వెళ్ళాను. తలుపుమీద తట్టాను. తలుపు తెర్చి నాగన్న నావంక చూశాడు.

"ఏం కావాలి సార్?" అడిగాడతను.

"మస్తాన్, నువ్వే!" అన్నాను.

అతడు వులిక్కిపడ్డాడు. నావైపు పరీక్షగా చూశాడు.

"మీరా! మిమ్మల్ని బీచ్ లో చూశాను! మీరని పోల్చలేక పోయాను!" అన్నాడతను.

లోపలకు నడిచి తలుపు దగ్గరగా మూశాను. గదిలో లైట్ వెల్గుతోంది. కుర్చీలో ప్లాస్టిక్ బాగ్ వుంది. దాన్ని తెరిచాను. చిన్న పాకెట్ లో నోట్లకట్టలున్నాయి. మరో పాకెట్ లో రక్తమయమయిన షర్టు, కత్తి

వున్నాయి.

అతడు మౌనంగా గదిమూల నిలబడ్డాడు.

"ఇవి నీకెలా వచ్చాయి?"

"నిన్న రాత్రి మోహన్ యీ కాంపౌండులో తిరుగుతున్నాడు. ఈ షర్టునీ, కత్తినీ పూలమొక్కలమధ్య విసిరేశాడు. అది నేను గమనించాను. అతడిని నా గదికి తీసుకొచ్చి బ్రాందీ యిచ్చాను. నిషాలో అతడు తన్ని గురించి చెప్పాడు. కారులో తీసుకెళ్ళి అతడిని దూరంగా వదిలేశాను. పూలమొక్కలమధ్య పారేసిన షర్టునీ, కత్తినీ పాక్ చేసి దాచాను."

"ఎందుకు?"

"నా పరిస్థితి బాగాలేదు. రాత్రి మీరొచ్చి నన్ను చూశాక యిక్కడ వుండడం క్షేమకరం కాదనిపించింది. సుందరంగారు కూడా నన్ను డిస్మిస్ చెయ్యాలని చూస్తున్నారు. మనోరమ ధనవంతుడి కూతురు. ఆమెను భయపెట్టి, ఆ డబ్బుతో ఎక్కడికేనా పారిపోవాలని నా ఆశ!"

అతడివైపు సూటిగా చూశాను.

"గీతను అతడు హత్య చేశాడంటావా?"

"శని విరగడైందని అతడు నాతో అన్నాడు. ఆమెతో అతడికి ముందు పరిచయముందిట. ఆమె అతడిని బ్లాక్ మెయిల్ చేస్తోంది. అతడు కోటీశ్వరుడి అల్లుడయ్యాడు. ఆమెను శాశ్వతంగా వదిలించుకున్నాడు" అన్నాడతను.

అతడి దగ్గరకెళ్ళాను నా కుడిచెయ్యి పైకిలేచింది. అతడి చంప చెళ్ళుమంది. మళ్ళా మళ్ళా కొట్టాను. అతడి నోటమ్మట రక్తం కార్తోంది. అతడు మూలుగుతూ నేల

మీద పడ్డాడు.

"రాస్కెల్, నువ్వు నిజం చెప్పవు! నిజం చెప్పిందాకా నిన్ను హింసిస్తాను!" అర్చాను.

కాలితో అతడి ముఖం మీద తన్నాను. అతడు వెనక్కి పడ్డాడు. "పరశురామ్‌గారూ! నేను చెప్పింది నిజం. నన్ను నమ్మండి!" అన్నాడతను.

అతడి మాటల్ని వినలేదు. అతడిని పదే పదే తన్న సాగాను. అతడు మూలుగుతున్నాడు. సిగరెట్ వెలిగించి అతని వైపు చూశాను. "యేం జరిగిందో నేను చెప్తాను, విను" అర్చాను.

అతడు భయంతో నా వంక చూశాడు.

"గీతతో నీకు సంబంధ ముంది. తప్ప తాగి నీ గతాన్ని గురించి నువ్వామె ముందు వాగుంటావు. ఆమె నిన్ను బ్లాక్ మెయిల్ చేస్తోంది. ఆమెను ఎలాగయినా తుద ముట్టించాలని నువ్వు ఆరాటపడుతున్నావు."

"దొంగ ముండ!" అర్చాడతను.

"మోహన్ కారులో పెట్రోల్ అయిపోయింది. అతడి దగ్గర డబ్బులేదు. అతడు నడుస్తూ యిక్కడి కొచ్చాడు. అతడిని చూసి, మాట్లాడగానే నీ కోరిక ఫలించే సమయం వచ్చిందనుకున్నావు. అతడిచేత తాగించావు. అతదెవరో తెలుసుకున్నావు. అటుపైన నీ బుర్ర బ్రహ్మాండమయిన ప్లాను రూపొందించింది. మోహాన్ని యీ కాటేజ్‌లో లాక్ చేసి వుంచావు. నువ్వు వెళ్ళి గీతను ఘోరంగా హత్య చేశావు. మోహన్ షర్టును ఆమె రక్తంలో పడేశావు. షర్టునీ, కత్తినీ పాక్ చేశావు. అతడి చేతికున్న వుంగరాన్ని నువ్వే మంచం కింద పడేశావు. తర్వాత అతడిని కారులో తీసుకెళ్ళి రోడ్డువారగా

పడవేశావు."

అతడు నోరెత్తలేదు. దగ్గరకెళ్ళి మళ్ళా అన్నాను.

"నేను చెప్పింది నిజమేనా?"

అతడు మాట్లాడలేదు.

"ఇటు గీత శని విరగడైంది. అటు మనోరమను బ్లాక్ మెయిల్ చేసే అవకాశం చిక్కింది. నీలాటి కిరాతకుడికి అంతకంటె ఏం కావాలి?

అతడు నావైపు భయంతో చూశాడు.

"ఇదంతా మీరెలా వూహించారో కాని అంతా నిజమే!" అన్నాడతను.

గదిలో వున్న టెలిఫోన్ రిసీవర్ని ఎత్తాను. ఆపరేటర్ కంఠం వినపడింది. డైరెక్టు కనెక్షన్ యివ్వమన్నాను. ఇన్‌స్పెక్టర్ నాయర్ నంబరు తిప్పాను.

"ఇన్‌స్పెక్టర్ నాయర్!"

"నాయర్ భాయ్, నువ్వు వెంటనే హోటల్ వినోదా కాటేజ్ నంబర్ 40 కి రా! గీత హంతకుడు యిక్కడ రెడీగా వున్నాడు" అన్నాను.

"బ్రదర్, హంతకుడు నాగన్న గదిలో దాక్కున్నాడా?" అడిగాడు నాయర్ ఆశ్చర్యంగా.

"గదిలో కాదు, నాగన్నలో దాక్కున్నాడు!" అని నవ్వుతూ రిసీవర్ని పెట్టేశాను.

రిసీవర్ ఎత్తి మరో నంబరు తిప్పాను.

"హోటల్ రివేరా?" అంది ఆపరేటర్.

"రూమ్ నంబర్ 30" అన్నాను.

అటువైపునుంచి మనోరమ కంఠం వినపడింది.

"మనోరమ, మీ భర్త నిర్దోషి. మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేసిన వ్యక్తే గీతను హత్య చేశాడు," అన్నాను.

"చాలా శుభవార్త చెప్పారు, పరశురామ్‌గారూ! మీకు నా ధన్యవాదాలు" అందామె.

ఆమె కంఠం కృతజ్ఞతతో తొణికిసలాడింది. నేరస్తుడిని శిక్షించడంలోకంటె నిర్దోషిని కాపాడ్డంలో ఎక్కువ ఆనందం వుందని ఆ క్షణంలో నాకనిపించింది.

—:ఐ పో యిం ది:—

# కత్తి విసిరిన కన్య

## సికిందర్

"వాడ్నలా ఊరికే వదలను. పొడిచి చంపుతాను"
అంది రాగిణి పిడికిలి బిగించి ఆవేశంగా. ఆమె కళ్ళు ఎర్రబడి, వొళ్లు కంపించిపోతోంది.

అనిత దిండులోంచి కంగారుగా తలెత్తి చూసింది, వర్షిస్తున్న కళ్ళతో.

"నువ్వలా పిచ్చిగా మాట్లాడకు" వారించిందామె, పూడుకుపోయిన స్వరంతో, ముంచుకొస్తోన్న దుఃఖాన్ని ఆపుకుంటూ.

"వాడ్ని చంపి వదులుతానంతే!" కచ్చితంగా చెప్పేసింది రాగిణి, అదే వుద్రేకంతో.

అనిత తటాలున కూర్చుని ఆమెని పట్టుకుంది. "రాగిణీ! నువ్వలా మాట్లాడకే!...."

రాగిణి ఆమెని విడిపించుకొని దూరంగా జరిగింది. "వాడ్ని చంపుతానక్కా! కసిగా చంపిగానీ వదలను."

"నోర్మూయ్! పిచ్చిగా వాగుతున్నావ్. వెళ్ళి వంట

సంగతి చూడు!"

"అంటే!....అయితే వాడన్నలా వూరికే వదిలేయడ మేనా? వాడిచేత అంతమాట పడి నువ్వు—నువ్వింకా ఎలా తలెత్తుకుంటావ్? సిగ్గు విడిచి మళ్ళీ ఆఫీసు కెళతావా లేక ఇంట్లో కూర్చుని ఇలా ఏడుస్తూ...."

"నువ్వెళ్ళు ఇక్కడ్నించి!" అనిత కేక పెట్టింది.

"నువ్వుత్త వెర్రిదానివక్కా! నేనయితే ఏం చేసే దాన్నో తెలుసా? ఆ మాట అన్నప్పుడే చెప్పుతో పళ్ళు వూడగొట్టి, మరో చెప్పుతో దవడ పగలగొట్టేదాన్ని."

"నీకు పిచ్చి పట్టింది! వెళ్ళిక్కడ్నించి."

"వెర్రి మొఖానివి! నీకేం తెలుసు? పెద్ద సంపాదించే దానిలా బయలుదేరి వచ్చావు—మా మాట వినకుండా, మమ్మల్ని లక్ష్యపెట్టకుండా! నీ గురించి నాన్న ఎంత బెంగపడుతున్నాడు! శుద్ధ అమాయకురాలివి, ఇంత పెద్ద వూళ్ళో ఎలా వున్నావో, ఏమయిపోతున్నావోనని! అక్కడ ఇంటి దగ్గరే ఎవరయినా ఆకతాయి వేళాకోళం చేస్తే భోరుమని ఏడ్చేదానివి—ఇక్కడ ఈ హైద్రా బాదులో ఎలా వుండగలననుకుంటున్నావు? పెద్ద మమ్మల్ని వుద్ధరించేదానిలా బయలుదేరి వచ్చావు! సంపా దించాలన్న పట్టుదల వుంటే పౌరుషం కూడా వుండాలి. ఛ—నీ చెల్లెల్నని చెప్పుకోడానికి సిగ్గుపడుతున్నాను."

"నిన్నిక్కడి కెవడు రమ్మన్నాడు? నా ఏడుపేదో నే నేడుస్తాను."

"ఆ ఏడుపేదో నువ్వే యేడ్వక నాతో యెందుకు చెప్పావు? చెప్పాక నేనూరుకుంటానని యెలా అనుకు న్నావు? నా సంగతి నీకు తెలియదా? ఇలాంటివి సహి స్తానా? నేనంటే అందరికీ హడల్! రోమియోలంతా

బలాదూర్! తెలియదూ, మనూళ్ళో నేనెలా చెలామణి అవుతానో! నాకు సెలవులు కాబట్టి, ఇక్కడికి రొచ్చాను కాబట్టి సరిపోయింది. లేకపోతే నువ్విక్కడ జరిగే అన్యాయాలకి గురై — లేదు, వాడ్నలా వదలకూడదు. చెప్పు, వాడెక్కడుంటాడు? కమాన్!"

"నువ్వూరుకో రాగిణీ! అలా వుద్రేక పడకు. నేనక్కడ పని మానేసి వేరేచోట చూసుకుంటాను."

"వాడెక్కడుంటాడు?" రెట్టించింది రాగిణి.

"నీ కెందుకు? ఏం చేస్తావు?"

"సరే, నువ్వు చెప్పవు. నేనే తెలుసుకుంటాను. వాడి పేరు, ఆఫీసు పేరూ నాకు తెలుసు. నువ్విక్కడే వుండు, నే నిప్పుడే వస్తాను."

అనిత తటాలున ఆమెని పట్టుకుంది.

"వెళ్ళకు! నువ్వక్కడికి కెళ్ళకే రాగిణీ!"

రాగిణి ఉద్రేకంతో ఒక్క కేక పెట్టి ఆమెని వెనక్కి నెట్టేసింది.

"వాడికి నా తడాఖా తెలియాలి. నీకు నిప్పులాటి చెల్లెలుందని తెలిస్తే నీ జోలికి యెవరూ రారెప్పుడూ."

రాగిణి వేగంగా వెళ్ళి తలుపు తీసింది. అనిత మళ్ళీ వెనుక నుంచి పట్టుకుంది. "నువ్వేం చేయబోతున్నావిప్పుడు?"

రాగిణి నవ్వింది జాలిగా. "అక్కా, నువ్వెందుకలా తప్పు చేసినదానిలా భయపడ్తావు? భయపడి కాళ్ళబేరానికి రావల్సింది వాడు!"

ఆమె చటుక్కున బయటకి దూకి, తలుపు లాగి గొళ్ళెం పెట్టేసింది.

లోపల నుంచి అనిత అరుస్తున్నా, వారిస్తున్నా

విన్పించుకోకుండా వెళ్ళిపోయింది— రోడ్డెక్కి రిక్షా ఎక్కేసింది.

"దగ్గరలో హోటల్ వుందా?"

"ఉందండి."

"ఎక్కడ?"

"క్రాస్ రోడ్స్‌లో, రహత్ మహల్ దగ్గర."

"ఆ హోటల్లో ఫోన్ వుందా?"

"వుందండి."

"అక్కడికి పోనివ్వు త్వరగా."

రాగిణి ఎడమ చేతికి వాచీలో నిమిషాలు లెక్క బెట్టింది. సరిగ్గా ఏడు నిమిషాల ఇరవై సెకన్లకి హోటల్ చేరుకుంది రిక్షా. ఆమె దిగి డబ్బులిచ్చి వేగంగా ఎదురుగా ఇరానీ కేఫ్‌లో కెళ్ళింది. కౌంటర్‌లో మనిషి నవ్వుతూ చూశాడు.

"ఫోన్ ఉపయోగించవచ్చా?"

"సంతోషంగా."

"డిక్షనరీ వుందా?"

"పారబడ్డారు, డైరెక్టరీ అడగండి."

"ఏదో ఒకటి ఇలా పారేయండి, నేను తొందరలో వున్నాను."

డైరెక్టరీ అందుకొని ఆమె, "ఇక మీరవతల బిల్స్ తీసుకోండి!" అంది.

ఆమె ముఖంలో వుద్రేకం, ఆవేశం చూసి అతను, "బహెన్‌జీ, బాత్ క్యా హై?" అన్నాడు.

"తుమ్ కైసా చెప్తాహై? కామ్ దేఖో నీది!" కసిరిందామె గబగబా పేజీలు తిరగేస్తూ. ఒకచోట ఆగిపోయి ఒక నెంబర్ ఎన్నుకొని డయల్ చేసింది. కానీ రెస్పాన్స్

లేకపోవడంతో మళ్ళీ పేజీలు తిప్పి మరో నంబర్ డయల్ చేసింది.

అప్పుడు సమాధానం వచ్చింది: "హాలో, ఎవరూ?"

"మిస్టర్ మహేంద్రనాథ్! ఇతరులకి మానర్స్ నేర్పే ముందు నీ హక్కేమిటో, ఔచిత్యమేమిటో ఆలోచించాలి. అసలు నీకు మానర్స్ వుందా? ఉంటే మా అక్కయ్యను హోటల్ కు రమ్మంటావా? అక్కడామెకి పద్ధతులు నేర్పుతావా? ఆమె అమాయకతను చూసి ఎర వేస్తావా? నీచుడా! నీ ఎర నీ మెడకు ఉరి అయేలా చూస్తాను!"

"హాలో, ఎవరది?"

"నీ అక్కౌంటెంట్ అనిత చెల్లెల్ని."

"ఓహ్ అలాగా.... నువ్వు పొరబడ్డావమ్మాయ్.... తప్పుగా మాట్లాడుతున్నావ్."

"నోర్మూయ్! అరగంటలోగా వచ్చి అక్కయ్యకు క్షమాపణ చెప్పుకోకపోతే నువ్విక బ్రతకవ్."

"షటప్! ఆమెని నేనేమీ చేయలేదు."

"ఆమెని నీ మాటలతో అవమానించావు. క్షమాపణ చెప్పుకుతీరాలి. అరగంటలోగా ఇంటికి రాకపోతే నీకు చావు ఖాయం. వింటున్నావా? నీకు చావు తథ్యం! బాగా గుర్తుంచుకో."

రిసీవర్ తక్కున పెట్టేసి "ఎంతివ్వాలి?" అనడిగిందామె.

ప్రొప్రయిటర్ అయోమయంగా చూశాడు. "హమ్ పైసా నై లేతా, బహెన్ జీ!"

"అయితే కైసా జీతాజీ?" అర్చిందామె సహనం కోల్పోయి, అక్కడ నుంచి కదిలి వేగంగా వెళ్ళిపోతూ.

# 2

ట్విన్ సిటీస్ డిటెక్టివ్ ఏజెన్సీ ఆఫీసులోకి ఒక అజానుబాహుడు ప్రవేశించి చొరవగా కరచాలనం చేస్తూ, "గుడ్‌మార్నింగ్ మిష్టర్ లాల్. గుడ్‌మార్నింగ్ మిస్టర్ జాన్, గుడ్‌మార్నింగ్, గుడ్‌మార్నింగ్. హౌ ఆర్యూ?". అన్నాడు నవ్వుతూ.

డిటెక్టివ్‌లు అర్థంగాక ముఖాలు చూసుకున్నారు.

"ఫైన్, ప్లీజ్ సిడవున్" అన్నాడు లాల్.

"థాంక్స్. మీతో చాలా ముఖ్యమయిన విషయం మాట్లాడాలి!" అన్నాడతను కూర్చుంటూ, "నా పేరు మహేంద్రనాథ్, జూబ్లీ క్రెడిట్ కార్పొరేషన్ పార్ట్నర్‌ని. మా ఆఫీసు తిలక్ రోడ్‌లో వుంది. ఉదయం 10 నుండి సాయంత్రం 5 వరకు పని చేస్తుంది. ఆదివారాలు సెలవు. మా కంపెనీలో ఆరుగురు ఉద్యోగులున్నారు....నలుగురు ఆడవాళ్ళు, ఇద్దరు మగవాళ్ళు."

"ప్రొసీడ్," లాల్ అన్నాడు.

"ఆడవాళ్ళలో అనిత అనే ఆమె మూడు నెలల క్రితం చేరింది. మంచి సమర్థురాలు. అక్కౌంటింగ్ చూస్తుంది. ఎక్కడా తప్పులు పట్టనివ్వదు. మంచి చిత్తశుద్ధి గలది. పనితప్ప మరో ధ్యాసలేదు. మిగతావాళ్ళందరికంటె నాకామెపైన యెక్కువ యిష్టమేర్పడింది—కానీ ఆమె నా ఫీలింగ్స్‌ని కేర్ చెయ్యదు. మెచ్చుకున్నా మందలించినా అసలు రియాక్టు అవదు. స్తబ్దంగా వుండిపోతుంది. ఆమె స్వభావం అంతేననుకున్నాను. సరే, పని సక్రమంగా చేస్తున్నంతవరకు స్వభావంతో నాకు నిమిత్తం లేదు.

"ఆమె నాతో యెక్కువగా మాట్లాడదు. ఎంతో అవసరమైతే తప్ప నోరు విప్పదు. నా ఆఫీసు గదిలో ఒంట

రిగా వాళ్తో రెండు నిముషాలు వుంటే చాలు—నెర్వస్ అయిపోతుంది—వీలయినంత త్వరగా అక్కడ్నుంచి వెళ్ళి పోవాలని ప్రయత్నిస్తుంది.

"అదీ నేను పట్టించుకోలేదు. భయం ఎక్కువ ఆమెకి. నగర వాతావరణానికి కొత్త. ఇక్కడి సొసైటీ, మనుషులు, పద్ధతులు ఆమెని కలవర పెట్టేస్తాయి. ఆఫీసూ, ఇల్లు తప్ప మరో వ్యాపకం లేదు. ఒక సరదా లేదు. ఒక షోకు లేదు—"

"షోకు....? అంటే?" జాన్ అడ్డు తగిలాడు.

మహేంద్రనాథ్ కలవరంగా చూశాడు. వెంటనే తేరుకొని నవ్వాడు. "అంటే—ఆధునికత ఆమెకి తెలియదని నా ఉద్దేశం. అందంగా ముస్తాబవటం ఆమెకు రాదు. రాదో, తెలియదో నాకు తెలియదు. చాలా నిరాడంబరంగా వుంటుంది."

"వెల్, అది పూర్తిగా ఆమె వ్యక్తిగత విషయం. ఉద్యోగుల వ్యక్తిగత జీవితం మీ కనవసరమైన విషయం."

"నా ఉద్యోగుల్ని చాలా గౌరవంగా చూస్తాను, మిస్టర్ జాన్."

"మీ ఉద్యోగుల్లో ఆడవాళ్ళ నిష్పత్తి యెందుకు యెక్కువ వుంది?"

"వాళ్ళలో ఏకాగ్రత, కార్యదీక్ష ఎక్కువ వుంటాయి. మగవాళ్ళలా పని మానేసి హస్కుకొట్టడం, షికార్లు తిరగడం వంటివి వుండవు."

"ఐసీ....అందరూ వివాహితులేనా?"

"కాదు, ముగ్గురు అవివాహితులు."

"ఈ అనిత?"

"అవివాహిత."

"ప్రొసీడ్!" అన్నాడు లాల్.

"అనిత వయసు 22 వుండొచ్చు....ఇరవై రెండే. నేనామె సర్టిఫికెట్ చూశాను. ఓ. కే. ఇక అసలు విషయం: అలా మూడ్నెల్లు గమనించాక ఆమెతో చనువు పెంచుకోకూడదనుకున్నాను."

"అంటే మిగతావారితో పెంచుకున్నారా?"

అతను నీళ్ళు నమిలాడు. "అవును.... పెంచుకో కూడదా?"

"కూడదని ఎలా అంటాను? అది మీ ఇరు పక్షాల మధ్య అండర్‌స్టాండింగ్. మూడో పార్టీ నాకభ్యం తరం లేదు."

"ప్రొసీడ్!" అన్నాడు లాల్.

"ఓ. కే. ఇప్పుడసలు విషయం....అలా చనువు పెంచుకోకూడదనుకున్నాను గానీ....నిన్న ఎందుకో మనసు మార్చుకున్నాను. ఆమెకు పద్ధతులు, మానర్స్— నా ఉద్దేశ్యం సొసైటీలో ఎలా మెలగాలో నేర్పాలను కున్నాను. ఇలా అనుకోవడం పొరపాటని నాకు తెలుసు. కాని నా ఉద్యోగి నా అభిరుచులకి—"

"ఆ మాట పూర్తి చెయ్యండి!" అన్నాడు జాన్.

"అంటే—ఆఫీసులో నేననుకొన్నవిధంగా ప్రవర్తించాలని నా అభిలాష. ఆఫీసుకెందరో పెద్దమనుషులొస్తుంటారు. వాళ్ళందరితో సరదాగా నవ్వుతూ, కలుపుగోలుగా, బిడియపడకుండా మాట్లాడాలి. అలా చాలాసార్లు చెప్పి చూశాను. ఫలితంలేదు. అందుకే స్వయంగా నేనే పూనుకొని ఆమెలో భయం, బిడియం పోగొట్టి ఈ నాగరిక ప్రపంచానికి అలవాటు చెయ్యాలనుకున్నాను. ఇదెంత పొరపాటో నిన్న అనుభవ

పూర్వకంగా తెలుసుకున్నాను."

"ఎలా? ఏం జరిగింది?"

"నిన్న సాయంత్రం ఆమెనో కోరిక కోరాను. హోటల్ మయూర్ లో గది తీసుకున్నాను, డిన్నర్ కు రాగలవా అని—"

"ఏమిటీ! డిన్నర్ కా!" జాన్ అన్నాడు కళ్ళు పెద్దవి చేసి.

నాథ్ కలవరపడ్డాడు. "అవును, ఎందుకలా అడుగుతున్నారు?"

"డిన్నర్—ఈ పదాన్ని మీరే ఉద్దేశంతో ఉపయోగించారు?"

"ఉద్దేశమా....అంటే?"

"అంటే—ఆమధ్య ఓ బొంబాయి నటుడు ఓ ఆడ జర్నలిస్టుని 'మిడ్ నైట్ డిన్నర్ తినిపిస్తా'నని బెదిరించాడు. తర్వాత చంపడానికి ప్రయత్నించాడు. మీరు అదే ఉద్దేశంతో అన్నారా?"

"దానికి అలాటి అర్థం వస్తుందా, మిస్టర్ జాన్?"

"హోటల్ గది—డిన్నర్ అంటే ఇంకే అర్థం వస్తుంది? గ్రహించలేరా?"

"మిస్టర్ జాన్, ఈ ద్వంద్వార్థాల పురాణం నాకు తెలియదు. ఆమాట అన్నప్పుడు నా మనసు స్వచ్ఛంగా వుంది. ఎలాటి దురుద్దేశంలేదు. నా ఉద్యోగుల్ని చాలా గౌరవిస్తానని చెప్పాను."

"వెల్, యూ కెన్ ప్రొసీడ్" అన్నాడు లాల్.

"నా మాటలు విని ఆమె బెదిరిపోయింది. అంగీకరించలేదు. నచ్చజెప్పాను. అభయమిచ్చాను. చివరికి బలవంత

పెట్టాను. సహనం చచ్చి హెచ్చరిక చేశాను. నా ఇష్ట ప్రకారం నడచుకోకపోతే, కల్చర్ నేర్చుకోకపోతే, ఉద్యోగం ప్రమాదంలో పడ్తుందని బెదిరించాను. అంతే.

“అయినా ఆమె నన్ను ఖాతరుచెయ్యలేదు. ఇంటి కెళ్ళిపోయింది. బాగా ఆలోచించుకుని వస్తుందను కున్నాను. ఎనిమిది గంటలకు రమ్మన్నాను హోటల్ కి... కానీ ఇంతలోనే పరిసితి మరోవిధంగా రూపుదాల్చింది.”

“ఏం జరిగింది?” జాన్ అడిగాడు.

“సాయంత్రం 6 గంటలకి ఆమె చెల్లెలు ఫోన్ చేసింది—నా ఇంటికి. ఆమె మాటలు విని నేను ఆశ్చర్య పడ్డాను. ఆమె ఏమందో తెలుసా? ఆమె అక్కను నేనవమానపర్చానట! అసభ్యంగా మాట్లాడానట! నేనామెని కామదృష్టితో చూసి ఆమె అమాయకత్వాన్ని ఎక్స్ప్లాయిట్ చేశానట! ఛీ....ఛీ! ఛీ! మిస్టర్ జాన్ ఈ అభాండం విని నా మనసు వికలమైపోయింది. హృదయం గిలగిల్లాడింది. కాళ్ళూ చేతులు ఆడలేదు!

“అబద్ధమన్నాను. బనాయింపు అన్నాను. నాకలాంటి దుర్బుద్ధి లేదన్నాను. ఊహుఁ....ఆమె వినలేదు. ఆమె ఎలాంటి తిట్లు తిట్టిందో సభ్యత దృష్ట్యా ఇక్కడ చెప్పడం మంచిదికాదు, జంటిల్ మెన్. ఆ అమ్మాయి పేరేమిటో గాని చాకు లాటిది!”

“మిస్టర్ లాల్” అన్నాడతను లాల్ వైపు తిరుగుతూ. “నన్ను చూస్తే మీకలా అనిపిస్తోందా? నా పెళ్ళయి పదేళ్ళయింది. ఇద్దరు బుడ్డి వెధవలున్నారు. నాకదేం బుద్ధి? అనిత నా మోటివ్ ని అపార్థం చేసుకుంది. ఆమె చెల్లెలితో చెప్పివుంటుంది—ఆ పిసుగు నామీద కత్తి కట్టింది!”

"మీరలా చెప్తూవుండండి" అన్నాడు లాల్.

"ఆమె ఇంకేం చెప్పిందో తెలుసా? తక్షణం ఇంటి కొచ్చి క్షమాపణ చెప్పుకోకపోతే నా చావు తథ్యమట! అప్పుడు నవ్వుకొన్నాను. క్షమాపణ కోరే గతి నాకేమిటి? నా ఉద్యోగిని క్షమాపణ కోరడమేమిటి, ఉద్యోగం లోంచి తీసిపారేస్తానన్నాను. అయినా ఆమె అలాగే బెదిరించింది. నేను వెళ్ళలేదు. ఇంతలో—అర గంటలో ఆమె అక్కను వెంటబెట్టుకొని నా ఇంటికొచ్చేసింది!"

"గో ఎహెడ్!"

"ఇంట్లో నా భార్యముందు, నా పిల్లలముందు, నౌకర్ల ముందు....అయ్యొయ్యో మిస్టర్ లాల్! నా పరువుతీసి ఉతికి ఆరేసింది!"

"ప్రొసీడ్!"

"ఆమెకు పట్టుమని పధ్ధెనిమిదేళ్ళుండవు, చిచ్చుబుడ్డిలా పేలింది! ఎన్ని చిచ్చుబుడ్లు, ఎలాటి చిచ్చుబుడ్లు నా మీద విసిరిందో నేను చెప్పలేను! నేనెలాటివాడ్నో సాక్షాత్తూ నా భార్య ముత్తుకున్నా విన్పించుకోలేదు. అప్పుడొక్కటే మాట—క్షమాపణ లేదా చావు!"

"ఎలా చావమంది?" జాన్ తెగించి అడిగేశాడు.

"మిస్టర్ జాన్, ఆమె బ్యాగులోంచి ఈ కత్తి తీసి నామీద దాడిచేసింది" అంటూ అతను బ్రీఫ్ కేసులోంచి ఒక కత్తితీసి చూపించాడు.

లాల్ దాన్ని అందుకున్నాడు. అది మామూలు కూరలు కోసుకునే స్టీలు కత్తి. వంచితే బ్లేడు వంగుతుంది. కొన మొనదేలిలేదు. పదును కూడా ఎక్కువలేదు. దానికి నల్లటి ఫైబర్ పిడివుంది.

"వెల్, మీరింకా చెప్పండి" అన్నాడు లాల్.

"ఆ కత్తితో నామీద దాడిచేసింది. ఏ కొంచెం ఏమరుపాటుగావున్నా అది నా రొమ్ముల్లో—ఇక్కడ గుచ్చుకునేదే! ఆమె చెయ్యి మెలిదిప్పి దాన్ని క్రింద పడేశాను. కాలితో దూరంగా తన్నాను. అంతవరకూ చెల్లెలి ప్రతాపం ముందు నోరు విప్పని అనిత, అప్పుడామెని లాగి దూరంగా ఈడ్చుకెళ్ళింది. రెండు దెబ్బలువేసింది. తన విషయాల్లో కల్పించుకొంటే-అంటూ ఏదో తిట్టింది. అయినా ఆ కోతిపిల్ల వూరుకోలేదు, మిస్టర్ లాల్. అక్కమీద ఎదురుతిరిగింది. చేతకానిదానివంది. చచ్చు దద్దమ్మవంది. ఆమెని వదిలి మళ్ళీ నామీద పడింది.

నేనదేపళంగా లేపి బయట ఎత్తేశాను. అనితనికూడా నెట్టేసి తలుపులు లాగేశాను. రేపట్నుంచి ఉద్యోగం లోకి రావద్దన్నాను. ఆ కోతిపిల్ల బయట చిందులేసింది. నా అంతు తప్పక చూస్తానంది! ఏదో క్షణంలో నా చావు తన చేతుల్లో ఖాయమైంది. అప్పుడామె ఉగ్రావతారాన్ని చూస్తే—ఓహ్! నిజంగా నాకది తథ్య మనిపించింది!

"అదీ జరిగింది, మిస్టర్ లాల్" అన్నాడతను ఊపిరి పీల్చుకుని. "ఆమె మాటలు తలచుకొంటేనే వెన్ను జలదరిస్తోంది. ఆమె చెప్పింది చేసితీరుంది! నామీద ఎంత కసిలేకపోతే అలా కత్తితో బయలుదేరి వస్తుంది? మొదట ఏమో అనుకున్నాను, కానీ ఇప్పుడామెని నమ్మ లేను! నా ప్రాణాలకి మోసంవుంది. ఆమె పగబట్టింది!"

"ఒక పనిచెయ్యండి. పోలీసులకి—"

"ఓహ్, పోలీసు లొద్దు! నేనొప్పుకోను. నేను కంపెనీ ప్రతిష్ఠను దృష్టిలో వుంచుకోవాలి. నా పార్ట్‌నర్‌తో విభేదాలు రాకుండా చూసుకోవాలి. పోలీసులవల్ల అంతా

బయటపడ్తుంది. జరిగింది అతనికి తెలిస్తే నన్ను నమ్మడు. నా కారెక్టర్‌ని అపార్థం చేసుకుంటాడు. పార్టనర్ షిప్ నుంచి తక్షణం వైదొలగుతాడు—అతనిలాటివి అసలు సహించడు! నేను కుప్పకూలిపోతాను."

"అయితే మమ్మల్నేం చెయ్యమంటారు?"

"మీవల్ల ఏదీ బయటపడదు. ఆ అమ్మాయికి నచ్చ జెప్పండి. శాంతపర్చండి. నన్ను చంపితే ఆమెకేమొస్తుంది? పర్యవసానం ఆమె గ్రహించే స్థితిలో లేదు. వయసు అలాటిది. నన్ను చంపడంవల్ల ఆమె అక్క పరువు తిరిగివస్తుందనుకుంటే అసలు నేనామె పరువుని—ఒకవేళ నా మాటలు ఆమెని అవమానించే విధంగావుంటే నల్గురిముందు తీయలేదుకదా? అది ఆమెకు నాకూ మధ్య జరిగిన సంభాషణ. ఎవరూ వినలేదు. అదెప్పటికీ బయట పడే వీలులేదు. ఆమె నవ్వులపాలు కాదు.

"వెంటనే అక్కడికెళ్ళి ఆమెని ఒప్పించండి. అనిత పరిస్థితి నేనర్థంచేసుకోగలను. రేపట్నుంచి ఉద్యోగం లోకి రమ్మనండి. దయచేసి మీరీ పనిచేసి కంపెనీ శ్రేయస్సుని కాపాడండి!"

జాన్ సాలోచనగా చూసి తలూపాడు. "అలాగే చేస్తాం. కానీ మాకు ప్రేరణ కావాలి. కొంతడబ్బు కళ్ళ జూస్తే తప్ప రంగంలో దూకలేం?"

అతను వెంటనే పెద్ద కట్టతీసి టేబిల్ మీద వుంచాడు.

"అయిదువేలు—"

"ప్రస్తుతానికి పనికొస్తాయి. మీరిక నిశ్చింతగా వెళ్ళండి!"

"ఇదంతా జరగడం కేవలం దురదృష్టకరం!" అన్నాడతను లేచి కరచాలనంచేస్తూ. ఆ తర్వాత తన అడ్రసు

అనిత అడ్రెసూ ఇచ్చాడు.

అతను వెళ్ళిపోయాక జాన్ నవ్వుతూ లాల్ ని చూశాడు.

"ఏమిటి నీ అయిడియా పార్టనర్?"

"ఈ క్లయింట్ కథ అల్లుకొచ్చాడు" లాల్ అన్నాడు.

"ఎందుకలా అనుకొంటున్నావు?"

"అతని ధోరణి, మాటలలా వున్నాయి. కొన్ని మాటలు అజాగ్రత్తగా వాడేసి అంతలోనే సవరించుకోవడం; ఉద్దేశాలు మార్చెయ్యడం, నువ్వు గమనించలేదా? హీ ఈజ్ డామ్ ఎక్సెలెంట్ యాక్టర్!

"జాన్, అతను చెప్పింది కొంతవరకు నిజం. కాని పూర్తిగాకాదు. అనితని బుద్ధిపూర్వకంగా చేరదీశాడు. కానీ బెడిసికొట్టడంతో ప్లేటు ఫిరాయిస్తున్నాడు. అసలు మోటివ్ ని మార్చేసి సదాశయాల్నీ, సదుద్దేశాల్నీ చాటుతున్నాడు. ఆమెకి కల్చర్ నేర్పుతాడా! డిన్నర్ ఇవ్వాలనుకుంటే హోటల్ గది ఎందుకు? పూర్ లయర్."

"ఇప్పుడేం చేద్దాం?"

"నువ్వెంటనే హోటల్ మయూర్ కెళ్ళు. నిన్న అతను గది ఎప్పుడు తీసుకొన్నాడో తెలుసుకో. తరచు తీసుకొంటుంటాడేమో కనుక్కో. తీసుకొంటే అక్కడతని కలాపాలేమిటో కూపీ తీయ్. జాగ్రత్త. చాలా రహస్యంగా జరగాలీ పని. అతనికి తెలిస్తే బాగుండదు."

"ఓ.కే. మరి నువ్వేం చేస్తావ్?"

"ఇంకేం చేస్తాను!" అన్నాడు లాల్ నుదురుపట్టుకొని. "ఆ అక్కాచెల్లెళ్ళతో వాగ్యుద్ధానికి బయలుదేరతాను. వాదిస్తాను. ఖండిస్తాను. హెచ్చరికలు చేస్తాను. రాజీకోసం ప్రయత్నిస్తాను—"

"అక్కడే? లుక్ లాల్, ఆ చెల్లెలిదగ్గర జాగ్రత్తగా వుండాలి!" అన్నాడు జాన్.

# 3

శాంతీనగర్ బస్ స్టాప్ ప్రక్కవీధిలో ఒక యింటి ముందు కారు దిగి లాల్ తలుపు తట్టాడు.

మరుక్షణం తలుపుతీసి ఓ యువతి దర్శనమిచ్చింది. వయసు పాతికమించదు. నాజూకైన విగ్రహం. కానీ ముఖంలో చెప్పలేని విషాదం కన్పిస్తోంది .... కొంత సమయం క్రితం ఎప్పుడో ఆమె బాగా ఏడ్చివుంటుందని ఎర్రబడ్డ కళ్ళు, కన్నీటి చారికలు ఏర్పడ్డ చెక్కిళ్ళు చెప్తున్నాయి.

"మిస్ అనిత?" అన్నాడు లాల్.

ఆమె కంగారుగా తలూపింది.

"లోనికి రావచ్చా?"

ఆమె అయోమయంగా చూసింది. "మీరు—మీ రెవరు?"

లాల్ ఎదురు ప్రశ్న వేశాడు. "మీరు బిజ్లీ క్రెడిట్ కార్పొరేషన్‌లో అక్కౌంటెంట్ కదూ?"

"బిజ్లీ కాదు, జూబ్లీ."

"ఓహ్, అవును. నేను లాల్‌ని, డిటెక్టివ్. మీతో మాట్లాడాలి."

ఆమె ఉలిక్కిపడి గాభరాగా చూసింది.

"అలా భయపడకండి. మిత్రుణ్ని. లోనికి రానివ్వండి" ఆమె ప్రక్కకి తొలగడంతో లాల్ లోనికి నడిచి కుర్చీలో కూర్చున్నాడు.

"ఇలా రండి అనితా. మీ చెల్లెలెక్కడ?"

ఆమె అతనెదురుగా వచ్చి ఇంకా అయోమయంగా

చూసింది.

"రాగిణి—బజారు కెళ్ళింది—"

"దేనికి?"

"సరుకులకి—కూర గాయలకి—"

"వెల్, భయపడకండి. కూర్చోండి. మీ బాస్ మమ్మల్ని కలిశాడు. నిన్న జరిగిందంతా చెప్పాడు. మీరతన్ని అపార్థం జేసుకొన్నారు. మిమ్మల్ని గురించి అలాంటి ఆలోచనలు అతనికెప్పుడూ—"

"ఇప్పుడు మిమ్మల్ని క్షమాపణలు చెప్పి పంపాడా?"

"కాదు, ఆ పని జన్మలో చెయ్యడనుకొంటాను. ఎందుకు చెప్పుకోవాలి? అతనేం తప్పుచేశాడు? అంతా మీరు తప్పుగా అర్థంజేసుకొన్నారు. దౌర్జన్యానికి పాల్పడారు. మీ మనస్థితి నతను అర్థంజేసుకొన్నాడు. మీపట్ల అతనికి చాలా సానుభూతి వుంది. జరిగిందంతా పీడకలగా మర్చిపోయి తిరిగి ఉద్యోగంలోకి—"

"ఆపండి మీ మాటలు!" అడ్డుతగిలిందామె ఆవేశంగా. "నాకతని క్షమాపణ వద్దూ, అతని ఈ రాజీ వద్దు. ఇలాంటి పరిస్థితిని నేనెప్పుడో ఆశించాను. ఈ ఉద్యోగం ఇప్పుడు నా కనవసరంలేదు.

"నా మానర్స్‌ని, నా వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దడానికతనెవరు? నాకు ప్రవర్తన నేర్పడానికతనికేం అర్హత వుంది? మిస్టర్ లాల్, మీకతను అన్నీ కట్టుకథలు చెప్పి వుంటాడు. తన్ని సమర్థించుకొని వుంటాడు. మీరతన్ని గుడ్డిగా నమ్మేసి ఇలా వచ్చారు, నే నపార్థంజేసుకున్నాననుకొంటూ!"

"మీ రపార్థంజేసుకోలేదా?"

"ఇందులో అసలు అర్థం చేసుకోడానికే ఏమీ లేదు!

ఇంక అపార్థం ఎక్కడ వుంటుంది? అంతా స్పష్టంగా కన్పిస్తోంది.... మీక్కాదు, నాకు. నేనమాయకురాల్ని కావచ్చు. నాకు పద్ధతులు తెలియకపోవచ్చు. కాని ఎదుటివారి ఆలోచనల్ని పసిగట్టలేని ఎదగని మనసేమీ కాదు నాది. మొదట్నుంచీ అతన్ని గమనిస్తున్నాను. అతని మాటల్లో, చేతల్లో అంతా చూస్తున్నాను. నామీద అతనికి—పచ్చిగా చెప్పాలంటే—"

"చెప్పండి?"

"ఎంత ఆకలిగా వుందో!"

"నిజంగానా?"

"నిజంగా! ఆ మాత్రం అర్థంజేసుకొని జాగ్రత్తలో వుండకపోతే ఈ భూమ్మీద ఆడది పదికాలాలు కాక పోయినా మూడు కాలాలు మనగల్గడం కష్టం.

"మహేంద్రనాథ్ నా విషయంలో నిన్న బయట పడ్డాడు. ఆఫీసులో మరో ఇద్దరితో ఎలా ప్రవర్తిస్తాడో, వాళ్ళతో అతనికున్న చనువు ఎలాటిదో నాకు బాగా తెలుసు. నన్నూ వాళ్ళలాగే భావించాడు. ఆ దృష్టితోనే చూశాడు. అతని డబ్బూ హోదా చూసి తేలిగ్గా వల్లో పడ్తాననుకున్నాడు. సొసైటిలో ఆధునికంగా మెలగడమంటే నైతిక విలువల్ని వదులుకోడమనుకున్నాడు కాబోలు! అతని అంతస్తూ, ఆహ్వానం చూసి నిబ్బరం కోల్పోతాననుకున్నాడేమో, నిన్న నన్ను హోటల్ గది కిడ్చడానికి ప్రయత్నించాడు!

"మిస్టర్ లాల్, ఆ ప్రయత్నం బెడిసికొట్టడంతో అతని మాటల్లో అర్థాన్ని వక్రీకరిస్తున్నాడు. ఉద్దేశాన్ని మార్చి ప్రకటించుకుంటున్నాడు. 'హోటల్ మయూర్ లో గది తీసుకున్నాను—సాయంత్రం డిన్నర్ కు వస్తావా?'

అనంటున్నప్పుడు ఆ మాటల్లో వెకిలితనం, ద్వంద్వార్థం, కుళ్ళు ఉద్దేశం పసిగట్టలేరా మీరు, అతని చరిత్ర ఎలాటిదో తెలిసి వుంటే?"

లాల్ తలూపాడు.

అనిత అంది. "కానీ నాకు వేసిన ఎర తిరిగి అతని మెడకే ఉరికావడంతో పిరికిపంద అయ్యాడు! అతని కిప్పుడు రాగిణి భయం బాగా పట్టుకుంది. ఉండి ఉండి ఏ అఘాయిత్యం జరుపుతుందోనన్న జంకుతో మిమ్మల్నిలా పంపాడు. సరే, ఆమెని నచ్చజెప్పే ప్రయత్నాలేవో మీరే చెయ్యండి. కానీ నేను ఉద్యోగంలో చేరే ప్రసక్తి మాత్రం తేకండి దయచేసి! ఆ ఉద్యోగానికో నమస్కారం."

"మీ చెల్లెలు సీరియస్‌గానే తీసుకుందా?"

"దాని పట్టుదల, ఆవేశం మీకు తెలియవు. అదలా ప్రవర్తించకుండా వుండలేదు, అలాటి పరిస్థితిలో. నేనసలు చెప్పకుండా వుండవల్సింది. సెలవులకి ఇక్కడకొచ్చింది మొన్ననే. మహేంద్రనాథ్ ప్రవర్తనకి ఏడుపుతో బరువెక్కిన గుండెల్ని దానితో చెప్పి తేలికబర్చుకో కుండా ఉండలేకపోయాను. అదిలా చేసింది—"

"నిన్న ఆమె కత్తితో దాడిచేసింది. ఇప్పుడూ అదే ఉద్రేకంతో ఉందా?"

"అదే స్థితిలో వుంది. అతన్ని చంపకుండా వదల నంటోంది, అవకాశం మాత్రమే కావాలట."

"చూడండి, మిస్ అనిత, మీరు వెంటనే ఆమెను తీసుకొని మీ ఊరెళ్ళి—" అప్పుడే లోనికొస్తోన్న రాగిణిని చూసి లాల్ మాటలాపేసి సర్దుకున్నారు న్నాడు.

రాగిణి సంచీ పట్టుకొని లోనికొచ్చి ప్రశ్నార్థకంగా చూసింది.

"ఈయన డిటెక్టివ్ లాల్, రాగిణి. నమస్కరించు" అంది అనిత.

"నమస్తే. ఏమిటిలా వచ్చారు?" అందామె ముఖం చిట్లించి.

లాల్ ముందు నవ్వాడు. తర్వాత ఆమెని పరీక్షగా చూస్తూ తటపటాయించాడు. కొన్ని క్షణాలవరకూ అతని గొంతు పెగల్లేదు.

"అలా కూర్చో, రాగిణి. నీతో మాట్లాడాలి."

"నిల్చొని మాట్లాడ్డం నాకలవాటు."

"అలాగా? అలాగే, అలాగే.... కూరగాయలు తెచ్చావా?"

"అవును."

"ఏం కూరగాయలు, రాగిణీ?"

"ఇంటికొచ్చిన అతిధులు అలా కూరలేమిటీ, పులుసేమిటీ అనడగరు! ఏమిటి మీరొచ్చిన పని?"

"రాగిణీ! నువ్వలా మాట్లాడకూడదు. ఆయనకు మర్యాద యివ్వు."

"సరే, అయితే ఆ అప్రాచ్యుడు డిటెక్టివ్‌ల సహాయం కోరుతున్నాడన్నమాట?"

లాల్ అన్నాడు. "నువ్వు ప్రమాదకరంగా వ్యవహరిస్తున్నావ్, రాగిణి. చట్టం దృష్టిలో తీవ్రమైన నేరం. ఒకర్ని చంపుతానని బెదిరించటం తీవ్రమైన పరిణామాలకి___"

"పరిణామాలు నాకనవసరం. అతన్ని చంపడమే నా ధ్యేయం!"

"ఎందుకని?"

"ఎందుకేమిటి? ఏమీ తెలియనట్లు మాట్లాడుతారు. మీ సోదరి నెవరైనా అవమానిస్తే వూరుకొంటారా?"

లాల్ కావాలని బలవంతంగా నవ్వాడు, "నాకు సోదరిలేదు మైడియర్ యంగ్ గర్ల్. నాకున్న ఆత్మీయు డొక్కడే—జాన్, సోమరి పార్టనర్."

ఆమె కోపంతో ఒక్క కేక పెట్టింది. "మీకు సోదరి లేదని లోకంలో ఎవరికీ వుండదనుకున్నారా! మీ డిటెక్టివ్‌ల ధోరణే అంత! మీకో ఇల్లూ, వాకిలీ, ఫ్యామిలీ, నా అనేవాళ్ళూ ఎవరూ వుండరు! దేశ దిమ్మరుల్లా తిరగడమే పని! మీకులాటి ఫీలింగ్స్ నాకు లేవు. మా అక్కయ్యకు అన్యాయం జరిగింది. తీవ్రమైన పరాభవం జరిగింది. నేను న్యాయంగా క్షమాపణ కావాలన్నాను. వాడు ఒప్పుకోలేదు. నన్ను రెచ్చగొట్టాడు. నా రక్తం మరుగుతోంది. వాడ్ని చంపి పగతీర్చుకోకుండా వదలను!"

"నువ్వాపని చెయ్యలేవు. నీ వైఖరి మార్చుకోకపోతే అతను పోలీస్ కంప్లెయింట్ ఇస్తాడు. కనీసం మూడు నెల్లు జైల్లో కూర్చుంటావు."

"ఏమిటీ! పోలీస్ కంప్లెయింట్ ఇస్తాడా, తప్పు తను చేసి! గుండెలెన్ని వాడికి? సరే, అలాగే చెయ్యమనండి. నేనపుడు మూడ్నెల్లుకాదు, జీవితాంతం జైల్లో కూర్చోడానికి సిద్ధంగా వుంటాను—వాడ్ని సఫాచేసి!"

"షటప్!"

"ఎలాగైనా వాడి చావు నా చేతిలో ఖాయం!"

"షటప్, యూ స్టుపిడ్. నేనిప్పుడే పోలీసుల్ని పిలుస్తాను. అదో ఘనకార్యమనుకున్నావా? దాన్ని నీ

అక్క హరిస్తుందనుకున్నావా? కుమిలిపోతుంది. కృంగి కృశించిపోతుంది, జీవితాంతం ఏకు పే మిగులుతుంది! నువ్వు కటకటాల వెనుక కూర్చొని గొప్ప ఉపకారం చేశానని వెకిలిగా నవ్వుతుంటావు! మురిసిపోతావు. వెర్రిగా గర్వపడతావు. ఇక్కడ నీవాళ్ళు నిన్ను తలచుకొని అన్నివిధాలా నాశనమవుతారు—

"నీలో ఆవేశం తప్ప ఆలోచన లేదనుకొంటాను. నీ కుటుంబాన్ని చేతులారా నాశనం చేస్తావు. నీకింత పట్టుదల కూడదు. నాథ్ మీ అక్కయ్యని నలుగుర్లో అవమానించలేదు. అది వాళ్ళిద్దరిమధ్య జరిగిన సంభాషణ. దాన్ని సాగదీసి బట్టబయలు చేసుకోడం మంచిదికాదు. అదెప్పటికీ ఆ ఇద్దరిమధ్యే వుండిపోతుంది. ఇహ జరిగింది చాలు. ఉద్యోగాలుచేసే ఆడవాళ్ళకిలాటి అనుభవాలు సర్వసామాన్యం. పట్టించుకోకూడదు. చూసీచూడనట్లుండాలి. ఎప్పటికప్పుడు మర్చిపోతుండాలి—"

"నేనేదీ మర్చిపోను. ఇది వాళ్ళిద్దరిమధ్య వ్యవహారమైతే ఆమెతో ఏకాంతంలోనే క్షమాపణ వేడుకోమనండి. ఏమిటి నామోషీ? అంత ఆత్మాభిమానం వుంటే ప్రాణభయం ఎందుకు? ఆత్మాభిమానంతోనే చావమనండి! సాయంత్రం 5 గంటలవరకు సమయమిస్తున్నాను. ఈలోపు ఇక్కడికి స్వయంగా వచ్చి అక్కయ్య చేతులుపట్టుకొని క్షమాపణ వేడుకోకపోతే...."

"నీ నిర్ణయం మారదన్నమాట?"

"ముమ్మాటికీ మారదు!"

"పరమ మూర్ఖురాలివి నువ్వు!"

"పరమ విసుగ్గా వుంది నాకు! వెళ్ళిపోండిక్కడ్నించి!" అర్చిందామె కళ్ళెర్రజేసి.

## 4

సరిగ్గా మధ్యాహ్నం 12 గంటలకి జాన్ ఏజెన్సీ ఆఫీసులో ప్రవేశించాడు.

"పార్టనర్! నీకు సీతాకోక చిలుకల గురించి తెలుసా?"

లాల్ తలెత్తి పరధ్యానంగా చూశాడు.

"ఏమిటలా వున్నావ్? ఏమైంది?"

లాల్ కుడిచెయ్యెత్తి నుదుటిమీద కొట్టుకున్నాడు.

"లాల్! వాట్ యార్! ఏం జరిగింది.... బీటింగ్?"

"ఓహ్, కాదు. నా నీతివాక్యాలు కొన్ని ఆమెకి బోధించాను. విని గెటవుట్ అంది."

"అయితే నిర్ణయం మార్చుకో లేదన్నమాట! బహిరంగంగా ఛాలెంజి చేస్తోందా? అలా చేసే ధైర్యముందా ఆమెకి?"

"ధైర్యమైతే ఉంది, కానీ అవకాశం లేదు-వుండదను కుంటాను. అనిత ఆమెని తీసుకొని ఊరెళ్ళిపోతే ఏ గొడవా వుండదు. అందుకు రాగిణి వ్యతిరేకిస్తే మాత్రం క్లయంట్‌ని హెచ్చరించవల్సి వుంటుంది. నువ్వేం కనుక్కున్నావు?"

జాన్ సిగరెట్ ముట్టించి అదోలా నవ్వాడు. "సీతాకోకచిలుకలు, పార్టనర్! అందమైన, ఆకర్షణీయమైన రంగు రంగుల చిలుకలు! అను నిత్యం అవి అతనిచుట్టూ ఎగురుతూ, అతనిమీద వాలుతూ, ఇచ్చి పుచ్చుకొనే ధర్మాన్ని నిర్వర్తిస్తుంటాయి .... డూయూ అండర్ స్టాండ్? ఆ చిలుకలు ఎన్ని, ఎలాటివి, ఏం చేస్తుంటాయి, ఎక్కడ వుంటాయి, మొదలైన ప్రశ్నలకి సమాధానాలు నాదగ్గరగానీ, రూంబాయ్ వద్దగానీ, చివరికి మహేంద్ర

నాథ్ దగ్గర గానీ లేవు!"

"ప్రాసీడ్!"

"ఏమిటి నీ ప్రాసీడ్ ట్రాఫిక్ పోలీసులా? నీ స్టయిల్ నా దగ్గర కాదు, ఇక విను! హోటల్ మయూర్ పెయ్‌య్....అంతస్తులో, అంటే చివరి అంతస్తులో మన క్లయింట్‌కో పర్మనెంట్ గదివుంది. రూం. 124. ఆ గది అతని ప్రేమ పంజరం—అంటే సీక్రెట్ లవ్ స్పాట్ వంటిదన్నమాట. ఆ పంజరంలోకి సాయంత్రం ఆరయ్యేసరికల్లా చిలుకలు వాలుతుంటాయి....అంటే ఒక్కరికి మించికాదు.

"మహేంద్రనాథ్ భాషలో ఈ చిలుకలు వాల డాన్ని డిన్నర్‌కాహ్వానించుట అంటారు—రూం బాయ్ చెప్పాడు. ఈ రూం బాయ్ మొదట నోరు విప్పలేదు. భయపడ్డాడు. అనుమానించాడు. సందేహించాడు. ఇలాటి సందేహ జీవుల వీక్‌నెస్ నాకు బాగా తెలుసు. పచ్చ కాగితం ఒకటి రెపరెపలాడించేసరికి వాటన్నిటినీ వాహ్యాళికి పంపించేసి, నా తాళానికనువుగా కీర్తన లాలాపించాడు....

"ఓ.కే, ఇప్పుడు సీరియస్‌గా చెప్తాను విను. ఈ రూం బాయ్ పేరు నాగేష్. పాతికేళ్ళు. పహిల్వాన్‌లా వున్నాడు. అతను చెప్పినదాన్నిబట్టి వారం క్రిందట నాథ్‌కు అతని ఆఫీసులోనే పనిచేసే నీల అనే ఆమెతో గొడవ జరిగింది. ఇదివరకెప్పుడూ ఎవరితోనూ అలాటిది జరగలేదు. మరో సంగతేమిటంటే, అతని కెందరితో వ్యవహారాలున్నా ఎవరికీ మరొకరితో అతనికి బాంధవ్య ముందని తెలియదట. ఎవరికివారు తామొక్కరే అతని ప్రేయసి అనుకొని మురిసిపోయేవారేనట—అంత పటి

ష్టంగా సాగిస్తున్నాడు."

"గొడవ ఎందుకు జరిగింది? రూం బాయ్ విన్నాడా?"

జాన్ తలూపాడు. "ఈ రూం బాయ్‌కి కుతూహల మెక్కువ, పైగా తెలివిగలవాడు. అసలా హోటల్లో నాథ్ కలాపాలు చట్టవ్యతిరేకం. వాటిని హోటల్ వాళ్ళు అనుమతించడం కూడా నేరమే. హోటల్ చాలావరకు అలాటి కలాపాలమీదే జీవిస్తోందని చెప్పాడు. ఇక నాథ్ ఆ గదిలో చేసేపనుల్ని రహస్యంగా గమనించడం నేరంకాదని వాదిస్తున్నాడు...."

"మనం రూం బాయ్ మనస్తత్వాన్ని విశ్లేషించడం లేదు. నాథ్ సమస్యకో పరిష్కారం కావాలి. అసలు గొడవెందుకు జరిగింది?"

"సరే, చెప్తాను. రజని అనే మరొకామెను నాథ్ రహస్యంగా కలుసుకుంటున్నాడని నీల ఘర్షణపడిందట. పాపం ఆ పిచ్చి తల్లికి నాథ్ అంతఃపురంలో జనానా సంఖ్య తెలీదు. ఆ జనాభాలో కేవలం తనూ ఒకతెనని కూడా తెలియదు! అతని కోటలో తనొక్కతే రాణి అని మురిసిపోయింది....ఒక్క చెలికత్తె గురించి తెలిసి చిందులు తొక్కింది. ఉంచిన విశ్వాసం, చేసిన బాసలు వమ్ముచేశావని దాడిచేసింది. అతన్ని మరొకరితో పంచుకోవడం సహించదట. తనని నిర్లక్ష్యంచేసి కానుకలూ, బహుమానాలూ ఇతరులకి సమర్పించుకోడం భరించనందట.

నాథ్ చాలారోజులుగా భార్యకి విడాకులిచ్చి ఆమెని చేసుకుంటానని చెప్తున్నాడట. అది కేవలం తన్ని మభ్యపెట్టడానికి బుకాయింపని ఆరోపించిందట. ఇప్పుడు మరొకర్ని అలా బుకాయిస్తూ, ఇంకెందర్ని ఇలా బుకా

యిస్తూ కాలక్షేపం చేస్తున్నాడో ఎలా నమ్మాలని ఏడ్చిందట. అతన్ని నమ్మితన్ని సమర్పించుకుంది. ఇప్పుడు తన గతేమిటని బావురుమందిట. రజనిని మర్చిపోయి వెంటనే తన్ని పెళ్ళాడకపోతే కిటికీతీసి థామ్మని దూకేస్తానని బెదిరించిందట!"

"నాథ్ ఏమన్నాడు?"

"ఏమంటాడు? ఆమె మాటలన్నీ అబద్ధమన్నాడు. ఇలాంటి వాళ్ళు అబద్ధాలాడ్డంలో ప్రవీణులై వుంటారు. నిన్ను చేసుకోను పొమ్మని చెప్పలేదు. ఇంకా ఆమెని నచ్చజెప్పడానికీ, నమ్మించడానికీ అబద్ధాల పరంపరను కోరమండల్ ఎక్స్‌ప్రెస్‌లా వదిలాడట. ఆమె నమ్మేసింది, తేలికపడింది. అమాయకురాలు.

"కానీ లాల్, ఇవ్వాడీ అనిత వ్యవహారం కూడా తెలిస్తే ఎలా రియాక్టు అవుతుంది? కిటికీతీసి థామ్మని రెండుసార్లు దూకుతుందా?"

లాల్ అడ్డంగా తలూపాడు. "నాథ్ అందుకే జాగ్రత్తగా మసలుకొంటున్నాడు. నేను ఫోన్ చేసి రాగిణి గురించి చెప్తే పోలీసు కంప్లెయింట్ ఇవ్వడానికి అసలు ఒప్పుకోలేదు. ఆమె 5 గంటలవరకు గడువిచ్చింది. ఆ సమయంలో ఆమెని కనిపెట్టి, వెంటాడి, తనకోసం బయలుదేరి వస్తోంటే, దార్లో ఏ గొడవలోనో ఇరికించి పోలీసుల చేతుల్లోకి నెట్టమన్నాడు."

జాన్ నిటారుగా కూర్చున్నాడు. "నిజంగానా?"

"నిజంగా. ఇప్పుడతనికి పార్ట్‌నర్ భయం, నీల భయం రెండూ వున్నాయి. వ్యవహారం పొక్కితే ఏమవుతుందో నీకు తెలుసు. నాథ్ కలాటి శాస్తి జరగాల్సిందే

గాని, ఒక ప్రాణం మనచేతిలో వుందిప్పుడు. ఈ నీల నిజంగా ఆత్మహత్య కొడిగడ్తుందా?"

"ఆమె కంతటి సత్సాంప్రదాయం, ఆత్మాభిమానం వుంటే తప్పగు! నాథ్ ఆమెను పెళ్ళాడ్డం కల్ల."

"వెల్, అతని పార్ట్‌నర్‌వల్ల నాథ్ నాశనమవుతాడు. నాథ్‌వల్ల, నీల ఆహుతికావచ్చు. కనుక నాథ్ గురించి మనం ఉదాసీనంగా ఎందుకుండాలి? అతన్ని ఉపద్రవం నుంచి తప్పిస్తే నీలను కాపాడినవాళ్ళ మవుతాం, తాత్కాలికంగా; మనకు సంబంధించినంతవరకూ, ఆ తర్వాత ఏంజరిగినా మన బాధ్యత ఉండదు."

జాన్ నవ్వాడు. "అందుకని రాగిణి మీద కేసు బనాయించి పోలీసుల చేతుల్లో పెట్టాలా? బ్రదర్, అప్పుడామె అంతా వాళ్ళకి చెప్పేస్తే!"

"అలా చేయమని నాథ్ సూచించాడు. కానీ మనం చేయడంలేదు—ఆమెని కిడ్నాప్ చేయబోతున్నాం!"

"ఓహ్, ఓహ్, అదెలా?"

"అదిలా! మనిద్దరం క్రూక్స్. మారువేషంలో అద్దె కార్లో వెళ్తాం. ఆమె ఇంటినుంచి బయలుదేరాక కొంత దూరం వెంటాడి, హఠాత్తుగా లాగి కార్లో ఎత్తేస్తాం. కళ్ళూ నోరూ, కాళ్ళూ చేతులు కట్టేస్తాం. మారుమూల ప్రదేశానికి తీసికెళ్ళి ఆమె గట్స్ ఎగరగొడ్తాం, అందుకో చోటు ఎన్నుకోవాలి. కనీసం రెండురోజులక్కడ వుంచి తగిన ట్రీట్‌మెంట్ ఇవ్వాలి. గంపెడు భయాల్ని కల్గించి వదలాలి. ఆమెని దోచుకునే ప్రయత్నాలు చేస్తూనే, మరోవైపు తప్పించుకొనే అవకాశమూ ఇస్తుండాలి.... ఇది చాలా డర్టీ జాబ్. అయినా తప్పదు. దాంతో ఆమెకి ప్రాణం విలువ తెలిసిరావాలి. తెంపవేసుకొని ఈ

ఊరు వదిలి పారిపోవాలి."

జాన్ అయోమయంగా చూశాడు. "ఆ పని నువ్వు చేస్తావా! సిస్టర్, మీకేం భయంలేదు—నేనున్నానని నోరు జారితే? ఎదురు తిరిగి నన్ను కొడితే?"

లాల్ నవ్వాడు. "ఐ డోంట్నో! నిన్ను కొట్టే పరిసితి నువ్వే కల్పించవచ్చు, అది నటన అని మర్చిపోయి నీ గర్ల్ ఫ్రెండ్స్ జ్ఞాపకమొస్తే."

## 5

మధ్యాహ్నం లంచ్ కి వెళ్ళి తిరిగివచ్చిన డిటెక్టివ్ లకు ఆఫీసు కారిడార్ లో అనిత తచ్చాడుతూ కన్పించింది.

"మిస్ అనిత!" అన్నాడు లాల్ వేగంగా సమీపించి "ఏమిటి, మీరిక్కడేం చేస్తున్నారు?"

ఆమె గిరుక్కున తిరిగిచూసింది. ఆమె ముఖం పాలి పోయివుంది. కళ్ళలో భయం వర్ణనాతీతం. అవి ఎర్రబడి, వాచివున్నాయి.

"లాల్!" అందామె దగ్గరకు జరిగి, ఆమె కళ్ళలో గిరుక్కున నీళ్ళు తిరిగాయి. అకస్మాత్తుగా దుఃఖం పొంగు కొచ్చి, లాల్ ని పట్టుకొని భుజంమీద తలవాల్చేసింది.... వెక్కి వెక్కి ఏడ్వసాగింది....

జాన్ చటుక్కున తాళంతీసి తలుపు తెరిచాడు.

లాల్ ఆమె బరువు నాపుతూ భుజంమీద తట్టాడు. "టేకిట్ ఈజీ.... టేకిటీజ్ ...." ఆమెని నడిపించి తెచ్చి సోఫాలో కూర్చోబెట్టడంతో ఏడ్పు ఇంకా ఎక్కువైంది. లాల్ మృదువుగా ఆమె చెయ్యి నిమిరాడు.

"పిచ్చిపని! ఏమిటిది! తేరుకోండి...."

ఆమె తలెత్తి ఆవేదనగా చూసింది. "రాగిణి పారి పోయింది, లాల్!"

"ఎ—ఏమిటి—ఏమిటి మీార నేది?"

"అవును! రాగిణి పారిపోయింది!"

"ఎప్పుడు? ఎలా?"

"తెలియదు! ఈ ఉత్తరం వదలి వెళ్ళింది." వెక్కిళ్ళతో ఆమె బ్యాగులోంచి ఒక కాయితం తీసిచ్చింది.

లాల్ గాభరాగా విప్పిచూశాడు. అందులో ఇలా వుంది—

"ఈ డిటెక్టివ్ వెళ్ళిన క్షణాన ఏం జరుగుతుందో నాకు తెలుసు. అందుకే వెళ్ళిపోతున్నాను. పోలీసులకి భయపడికాదు. వాళ్ళు నన్ను ముందుగా అరెస్ట్ చేస్తే నా లక్ష్యం నెరవేరదు. మహేంద్రనాథ్ సంగతి తేల్చిగాని ముందుకు రాను. సాయంత్రం 5 గంటలవరకు గడువిచ్చాను. ఈలోపు ఇంటికొచ్చి క్షమాపణ చెప్పుకొంటే సరేసరి! లేకపోతే—

వాడి గుండెలో బాకు దింపుతానంతే!—

—రాగిణి"

జాన్ కూడా ఆ ఉత్తరం చదివి, "డామిట్! ఎలా జరిగింది!" అనర్చాడు.

అనిత అంది. "మీారెళ్ళిన కాస్సేపటికి ఆమె కన్పించలేదు. కంగారుపడ్డాను. నాథ్ దగ్గరికెళ్ళిందనుకున్నాను. కానీ గడువిచ్చి అప్పుడే వెళ్ళదన్పించింది. బజారు కెళ్ళిందనుకున్నాను.... ఎంత సేపటికీ తిరిగిరాలేదు. అంతలో టేబిల్ మీాద ఈ ఉత్తరం చూశాను."

లాల్ విసురుగా వెళ్ళి ఫోన్ ఎత్తాడు.

"వెల్, మీారేం భయపడకండి!" అన్నాడు జాన్. "ఆమె ఏమీా చేయదు. ఆమె నాథ్‌ని కనిపెడ్తోంటే ఆ

పరిసరాల్లోనే సమీపంలో ఎక్కడో వుంటుంది. ఆ చుట్టుపక్కల జాగ్రత్తగా కనిపెట్టివుంటే పట్టుకోవడం కష్టంకాదు...."

"మిస్టర్ నాథ్" లాల్ అంటున్నాడు ఫోన్‌లో, "వ్యవహారం బెడిసింది! లాభంలేదు. ఆమె ఇంట్లోంచి పారిపోయి మిమ్మల్ని కనిపెడుతోంది. మీ ప్రాణాలకి గ్యారంటీలేదు....వచ్చి క్షమాపణ చెప్పుకోండి! ఏమిటీ... గట్టిగా చెప్పండి....నో! ఆమెనిప్పుడు పట్టుకోగలమని నిశ్చయంగా చెప్పలేను. రిస్కు. మీ ప్రాణాలకే రిస్కు. విన్పించడంలేదు, గట్టిగా మాట్లాడండి దయచేసి! ఓహో, ఎలా చంపుతుందంటారా? మీరలా కార్లోపోతుంటే ఎక్కడైనా పొంచివుండి కత్తి విసరవచ్చు—కొద్ది మార్పుతో కెన్నడీ వైపు మర్డరన్నమాట. లేదా—వెల్, ఇప్పుడు మేం ఏమీ చెయ్యలేం. పోలీసుల్ని పిలిస్తే ఆమెని పట్టుకోడం సులభమవుతుంది...."

లాల్ కోపంగా అన్నాడు మళ్ళీ. "మీ రెందుకంత చిన్నగా మాట్లాడుతున్నారు? అక్కడెవరైనా వున్నారా? మరి, కాస్త గట్టిగా మాట్లాడండి! ఏమన్నారూ .... ఓహ్, అలాగా .... అవును. కానీ మీరవన్నీ మర్చిపోవాలిప్పుడు....ఏమిటీ...."

లాల్ అవతలి మాటలు కొన్ని క్షణాలు ఉద్రిక్తంగా విన్నాడు. "కానీ ప్రయోజనముండదనుకుంటాను. అవును ఇదీ రిస్కే! ఎలా?....అలాగా? ...సరే, సరే, మీ ఇష్టం. తర్వాత మమ్మల్ని బ్లేమ్ చెయ్యకూడదు!"

ఫోన్ పెట్టేసి జాన్ వైపు తిరిగాడు. "వెల్, క్షమాపణ చెప్పుకోడట. పోలీసుల్ని పిలవడట. ఎట్టి పరిస్థితి లోనూ ఆ పని చెయ్యడట. పార్ట్‌నర్ గురించి భయ

పడ్తున్నాడు. అతను చాలా క్రమశిక్షణ పాటించే వ్యక్తిట. ఎక్కడ మర్యాద తప్పినా సహించడట— తనకు సంబంధించిన వ్యవహారాల్లో."

"ఆల్ రైట్, అయితే ఏం చెయ్యమన్నాడు?"

"మనల్ని బాడీగార్డుగా రమ్మంటున్నాడు."

"బాడీగార్డ్స్! ఇంకా నయం—"

"ముందు విను! అతన్ని అంటిపెట్టుకునుంటే ఆమెని పట్టుకోవడం సులభం. ఆమె అతని దగ్గర్లోనే ఎక్కడో పొంచివుండి గమనిస్తుంటుంది. నాథ్‌తో అలా ఒకసారి షైరుకి బయలుదేరితే అతని వెనుక ఆమె కూడా...."

"జస్టెమినిట్, జస్టెమినిట్, జంటిల్‌మెన్!" ఒక అజానుబాహుడు లోనికొస్తూ అరిచాడు. "ఏమిటీగొడవ? ఏమిటీ హడావిడి! నా పార్ట్‌నర్ ఏం చేశాడు?"

డిటెక్టివ్‌లు కలవరపడి అతన్ని చూశారు.

అనిత భయపడిపోయింది.

"ఎక్స్‌క్యూజ్ మీ, మీరు—" లాల్ గొణిగాడు.

"నేను జూబ్లీ క్రెడిట్ కార్పొరేషన్ పార్ట్‌నర్‌ని. నా పేరు నరేంద్రపాటిల్. మహేంద్రనాథ్ పార్ట్‌నర్."

"ప్లీజ్ సిడవున్."

"మిస్టర్ లాల్ మా కంపెనీ ఇప్పుడిప్పుడే వృద్ధిలోకొస్తోంది. ప్రజల్లో విశ్వాసం ఏర్పరచుకుంటోంది. రోజు రోజుకీ మా లావాదేవీలు పెరిగిపోతున్నాయి. మామీద ఎంతో నమ్మకంతో ప్రజలు తమ ధనాన్ని మావద్ద పొదుపుచేస్తున్నారు. తిరిగి మేమూ సులభ పద్ధతుల్లో ఎన్నో సంస్థలకీ, వ్యక్తులకి లోన్స్ ఇస్తున్నాం.... ఇలాటి కంపెనీలు, డబ్బు వ్యాపారం చేసే కంపెనీలు బ్యాంకుల్లాగా నమ్మకంగా, సమర్థంగా పనిచేయాలి. ఈ

కంపెనీలు నడిపే వ్యక్తులు కూడా మంచి వ్యక్తిత్వంతో, క్రమశిక్షణతో వుండాలి. వ్యక్తి నడవడిక మీద కంపెనీ శ్రేయస్సు, ప్రజల విశ్వాసం ఆధారపడి వుంటుంది.”

లాల్ ఓరగా జాన్‌ని చూసి, “ప్రొసీడ్!” అన్నాడు.

పాటిల్ అన్నాడు. “నేను వర్కింగ్ పార్ట్‌నర్‌ని గాను, స్లీపింగ్ పార్ట్‌నర్‌ని. అలాగని కళ్ళుమూసుకుని లేను. ప్రజల డబ్బుతో లావాదేవీలు జరిపే వ్యక్తులు నీతిబాహ్యంగా, నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తే వికృత పరిణామాలేర్పడతాయి. నాథ్ పైన నాకు మొదట్నుంచీ అనుమానాలున్నాయి. కానీ రూఢిచేసుకోలేక పోతున్నాను. చెప్పుడు మాటలే తప్ప రుజువులు దొరకడలేదు. చివరికి అతని మొహం మీదే అడిగేశాను. మందలించాను. కాల్‌గర్ల్స్‌తో సావాసాలు మంచిదికాదు, బ్లాక్ మెయిల్‌లో ఇరుక్కుంటావని. నవ్వి నన్ను హేళన చేశాడు. ఇలాంటి అబద్ధపు ఆరోపణలు మళ్ళీప్పుడైనా చేస్తే కోర్టుకు లాగుతానని హెచ్చరించాడు.

“దాంతో నా పట్టుదల పెరిగింది. ఎలాగైనా అతని చీకటి బ్రతుకు రుజువుచేసి కిక్ ఇవ్వాలని గట్టిగా నిశ్చయించుకున్నాను. ఈ మధ్యే నాకు కొత్తగా తెలిసింది ఆఫీసులో నీల అనే ఉద్యోగిని రహస్యంగా కలుసుకుంటున్నాడని. ఎక్కడో తెలియదు. ఒకరోజు ఆమె ఇంటికి హఠాద్దర్శనం చేసుకున్నాను....ఏం చెప్పను! ఆమె దర్జా చూసి అదిరిపోయాను. ఇంటినిండా విలువైన సామగ్రి! ఆమె విలాస జీవితం చూసి మతిపోయింది. అవన్నీ ఆమెకెలా వచ్చాయి? ఉద్యోగంలో చేరిన సంవత్సరం—కేవలం ఒక్క సంవత్సరంలో సంపాదించేసిందా?”

"ప్రొసీడ్!"

"దీన్నిబట్టి మీకేమర్థమవుతోంది? అవన్నీ నాథ్ సమర్పించుకొన్న కానుకలు! అప్పటినుంచీ వెయ్యి కళ్ళతో కనిపెట్టసాగాను. ఆ ఇద్దర్నీ అదనుచూసి రెడ్ హాండెడ్‌గా పట్టుకుంటే ఇంకేం రుజువు కావాలి. ఆమె ఒక్కరేకాదు, ఇంకా చాలామందితో వ్యవహారాలున్నాయట. ఒక్కటి గనుక రుజువైతే కంపెనీనుంచి వెదొలగాలనుకొంటున్నాను."

"ఎందువల్ల?"

"నేను వైదొలగితే అగ్రిమెంట్ ప్రకారం తక్షణం డబ్బు రావడం కల్ల! అందువల్ల అతని భాగంకంటే మరికొంత ఎక్కువ నేనే ఎదురిచ్చి క్లోజ్ షాట్‌లో కిక్ ఇస్తాను."

"మంచిది. అయితే ఇక్కడెందుకొచ్చారు?"

"నిన్నేదో గొడవ జరిగిందని—అనితపట్ల అతడు అమర్యాదగా ప్రవర్తించాడని తెలిసింది. వివరాలు తెలియవు. అతనేం చేశాడు? ఇప్పుడేం జరుగుతోంది? అతన్ని కిక్ ఇచ్చే అవకాశం నాకిప్పుడు కల్పించండి!"

"అయాం వెరీ సారీ, మీ కోరిక తీర్చలేం. అతను మా క్లయంట్. మేం డబుల్ డీలింగ్ చేయలేం."

అతను కోపంగా చూసి అనిత వంక తిరిగాడు.

"నాతో ఎందుకు చెప్పలేదు నువ్వు?"

"సారీ సర్. మీతో ఎక్కువ పరిచయంలేదు."

"ఇప్పుడు చెప్పు! అతనేం చేశాడు? కమాన్!"

"సారీ సర్. నేనేమీ చెప్పదలచలేదు. జరిగిందంతా మర్చిపోవాలనుకొంటున్నాను. నన్నింకా మీ గొడవల్లో ఇరికించకండి, దూరంగా ఉండనివ్వండి. మరోచోట

ఉద్యోగం చూసుకుంటాను."

పాటిల్ విసురుగా లేచాడు, "ఆల్ రైట్ జంటిల్ మెన్! అలాగే! నేను చూసుకుంటాను. అంతా తెలుసు కొని అతన్ని కిక్ ఇస్తాను... ఐయామ్ గోయింగ్ టు ఫినిష్ హిమ్! దటీజ్ మై వర్డు."

తటాలున తిరిగి అతను బయటకెళ్ళి పోయాడు.

"ఉష్ష్...." అన్నాడు జాన్ పేపరు విసురుకొంటూ.

"వెల్, వెళ్ళి మూసీలో దూకమను!" అన్నాడు లాల్.

"ఇప్పుడేం జరుగుతుంది?" అడిగింది అనిత ఆత్రంగా.

"మంచి జరుగుతుంది. నాథ్‌కి మీ చెల్లెలికంటే ముందు ఇతను బుద్ధి చెప్పేలా వున్నాడు."

"రామ రామా!"

"అరె, అదేమిటి?"

"నా తల తిరుగుతోంది!"

"ఇంటికెళ్ళిపోండి! తల నెప్పిగావుంటే ఆస్ప్రో వేసుకోండి. ఆపైన నిశ్చింతగా నిద్రపోండి."

"మరి.... రాగిణి?"

"ఆమెని జాన్ ట్రాప్ చేస్తాడు. పాటిల్ శపథం విన్నారుగా? అది విన్పిస్తే ఆమె చల్లబడుతుంది___బడ వచ్చు. మీరేమీ దిగులు పడకండి.

"వెల్, జాన్. ఆమెనెలా ట్రాప్ చేయాలో నీకు తెలుసు. నాథ్‌కు పాటిల్ గురించి చెప్పు. కాని అత న్నుంచి రక్షణకొరకు హామీ ఇవ్వకు. కమిట్ అవకు. నాథ్‌కి శాస్తి జరగాలి! వ్యక్తిగతంగా నా కతనిపైన సద్భావంలేదు. ఆడవాళ్ళంతా ఒకే రకం అనుకొనే అతనికి గుణపాఠం కావాలి!

"వెల్ అనిత, మీరిక ఇంటి కెళ్ళండి. జాన్ డ్రాప్ చేస్తాడు."

అనిత తలూపి లేచింది; జాన్‌తో బయటికి అడుగు లేసింది.

# 6

రాత్రి 8 గంటలకి క్రైంబ్రాంచ్ డిటెక్టివ్ బాల కృష్ణన్‌నుంచి ఫోన్ వచ్చింది.

"హలో, మిస్టర్ లాల్. మా క్రైంచార్టులో మరో మర్డర్ పెరిగింది."

"అలాగా....ఎవరిది" లాల్ అన్నాడు నవ్వుతూ.

"ఓ ఫైనాన్సర్‌ది. పేరు మహేంద్రనాథ్."

"మహేంద్రనాథ్! ఏ మహేంద్రనాథ్, కృష్ణన్?"

"జూబ్లీ క్రెడిట్ కార్పొరేషన్ పార్టనర్. నేనిప్పుడు హత్యాస్థలంలోనే వున్నాను. ఇందులో మీకాసక్తి వుంటుందేమోనని...."

"నా కాసక్తి?....ఈ కేసు మాది! నాకతని గురించి, అతని పూర్తి వ్యవహారం తెలుసు!"

"ఐ.సీ...."

"ఆశ్చర్యంగావుంది....ఎలా జరిగింది? జాన్ అక్కడ వున్నాడా?"

"ఇక్కడ లేదు. హత్య హోటల్ మయూర్‌లో జరిగింది. చివరి అంతస్తులో అతని గదిముందు. గుమ్మం దగ్గర శవం వుంది. గుండెలో కత్తి దిగివుంది. అదృష్ట మేమిటంటే హంతకురాలు దొరికిపోయింది!"

"హంతకురాలా! దొరికిపోయిందా?"

"అవును. పారిపోతూ పట్టుబడింది. అంతా ఒప్పు కుంది. పేరు రాగిణి."

"రాగిణి! దట్ డామ్ స్టుపిడ్ గర్లు!" అర్చాడు లాల్ ఉద్రేకంగా.

"ఓహ్, ఆమె కూడా తెలుసా మీకు?"

"కృష్ణన్, నేను వెంటనే వస్తాను. జాన్ ఎక్కడ వున్నట్లు...." లాల్ రిసీవర్ పెట్టేసి లేచాడు. ఏదో తోచి గబగబా నాథ్ ఆఫీసుకి డయల్ చేశాడు. కానీ రెస్పాన్స్ లేదు. అవతల ఎంగేజిలోవుంది.

అసహనంగా రెండు నిమిషాలు పచార్లు చేసి తిరిగి డయల్ చేశాడు. అప్పుడూ ఎంగేజిలో నే వుంది. చేతిలో సిగరెట్ అంచుని తీక్షణంగా చూస్తూండిపోయాడు కొన్ని క్షణాలు.... ఉన్నట్టుండి ఉలిక్కిపడి సిగరెట్ విసిరేసి టేబిల్ సొరుగులాగాడు. అందులోంచి పెద్ద తాళాల గుత్తితీసి వేగంగా నడిచాడు తలుపు దగ్గరకి.

అప్పుడే ఫోను మ్రోగింది—

వెనక్కి దూకి వచ్చి రిసీవరెత్తాడు.

"యస్, హలో....ఎవరిది?"

"నేను మిసెస్ మహేంద్రనాథ్ ని. ఆయన అక్కడ వున్నారా?"

లాల్ పూర్తిగా తేరుకొని జాగ్రత్తపడ్డాడు. "మీరెక్కడనించి మాట్లాడుతున్నారు?"

"మా ఇంటినుంచి."

"ఆయన ఇంటికి రాలేదా?"

"మధ్యాహ్నం భోజనానికొచ్చి వెళ్ళారు, అంతే."

"ఆయనిక్కడ వుంటారని ఎందుకనుకున్నారు? మీ రెవరితో మాట్లాడుతున్నారు?"

"డిటెక్టివ్ కాంతిలాల్ తో, కదూ? ఆయనిక్కడుండవచ్చని పాటిల్—ఆయన పార్ట్ నర్ చెప్పారు.

అంతకుముందు రెండుసార్లు ఫోన్ చేశారట— నేను లేను."

"ఎక్కడికెళ్ళారు?"

"షాపింగ్ కెళ్ళి ఇప్పుడే వచ్చాను. ఫోన్ వచ్చింది పాటిల్ నుంచి. ఆఫీసుకి ఫోన్ చేస్తే రెస్పాన్స్ లేదట. మీ దగ్గరికొచ్చారేమో కనుక్కోమన్నారు."

"మీరు ఆఫీసుకి ఫోన్ చేశారా?"

"లేదు, పాటిల్ చెప్పారు. రెస్పాన్స్ లేదు, ఆఫీసు మూసివుందని."

"మీవారితో ఏం పనో చెప్పాడా?"

"లేదు. ఆయనెక్కడున్నారింతకీ?"

లాల్ తటపటాయించాడు. "సారీ, మాడమ్. నేనిప్పుడు తొందర్లో వున్నాను...." అంటూ ఫోన్ పెట్టేసి బయటకురికాడు.

ఆఫీసు మూసేసి క్రిందికొచ్చి కారెక్కాడు. వేగంగా డ్రైవ్ చేసి నాథ్ ఆఫీసుకి చేరుకున్నాడు. కారిడార్ నిర్జనంగా వుంది. ఆఫీసుకి తాళం వుంది. అతను ఓ క్షణం సందేహించి మారుతాళాలు తీశాడు. తలుపు నెట్టి, చటుక్కున లోనికెళ్ళాడు. చీకటిగావుంది. ఏమీ కన్పించడంలేదు.

మరికొంత ముందుకెళ్ళి "జాన్?" అని పిల్చాడు.

సమాధానంలేదు. అలాగే చీకట్లో కదుల్తూ మళ్ళీ పిల్చాడు. "జాన్!"

అప్పుడూ బదులులేదు.

సిగార్ లైటర్ వెల్గించి లైటు స్విచ్ కోసం వెతికాడు. లైటు వెల్గించి చుట్టూ చూశాడు వేగంగా, ఆతృతగా. గదికి కుడివైపు అద్దాల పార్టిషన్ తో నాథ్ ఆఫీసువుంది. పవతలి లైటు అద్దాలగుండా ఆ ఆఫీసులోకి

పడుతోంది. లాల్ దృష్టి టేబిల్ మీద పడింది. అత న్నేమీ ఆకర్షించలేదు, టెలిఫోన్ తప్ప. అది స్థాన భ్రంశం చెంది క్రింద వ్రేలాడుతోంది.

వెంటనే డోర్ తీసి లోనికెళ్ళాడు.

నేలమీద జాన్ బోర్లా పడివున్నాడు.

లాల్ తటాలున అక్కడ కూర్చొని నాడీ చూశాడు.

"జాన్ .... లే!"

జాన్ కదల్లేదు. లాల్ మళ్ళీ తట్టాడు. కుదిపేశాడు. "కమాన్, జాన్, గెటప్! ఎవరైనా చూస్తే, పరువు పోతుంది...."

లాల్ లేచి గ్లాసులో నీళ్ళందుకొని ముఖంమీద కొట్టాడు. జాన్ కదిలాడు. చిన్నగా కదిలి మూల్గాడు. కళ్ళు తెరిచి, ఒళ్ళు విరుచుకుంటూ లేచి కూర్చున్నాడు.

"నేను .... నేనెక్కడ — ఎవరది? లాల్ నువ్వి క్కడ....?"

"నీకోసమే వచ్చాను, గెటప్!"

"ఎలా వచ్చావు? అరె భాయ్, మహేంద్రనాథ్ ఎక్కడ?"

"మహేంద్రనాథ్ చచ్చాడు."

"గాడ్! ఏమిటి నువ్వనేది?"

"కృష్ణన్ ఫోన్ చేశాడు, హోటల్ మయూర్ లో నాథ్ హత్య జరిగింది. రాగిణి చంపిందట—కత్తితో అక్కడే పట్టుబడింది. నాథ్ అక్కడి కెలా వెళ్ళాడో అంతుబట్టలేదు. నువ్వక్కడలేవని కృష్ణన్ చెప్పాడు. అయితే నాథ్ ఒంటరిగా వెళ్ళాడనుకున్నాను. నీ కేదో సాకు చెప్పి, లేదా మాయచేసి వదిలించుకున్నా డను కున్నాను. కాని నువ్విక్కడుంటావని ఫోన్ చేస్తే

రెస్పాన్స్ లేదు. ఎంగేజిలో వుంది. రెండు నిమిషాలు ఆగి చేసినా ఫోన్ ఎంగేజిలోనే వుంది.

నా కనుమానం వేసింది. ఇక్కడేదో జరిగింది—ఫోన్ ఎంగేజిలో వుండటం కాదు, ఇంత రాత్రి ఆఫీసు మూసి వుంటుంది, అది స్థానభ్రంశం చెందివుండాలనుకున్నాను. అర్జంటుగా నాథ్ ఎక్కడికో వెళ్ళవల్సివచ్చి నిన్ను వదిలించుకోనే ప్రయత్నంలో చిన్నపాటి ఘర్షణ జరిగిందనిపించింది.... నువ్విక్కడ బంధించబడో, స్పృహ తప్పో వుంటావనుకుని స్కెలిటన్ కీస్‌తో బయలుదేరి వస్తే—"

"ఓహ్, లాల్! అతను నా తల పగలగొట్టేశాడనిపించింది!"

"ఎందుకలా చేశాడు?"

"మేమిద్దరం మాట్లాడుకుంటున్నాం. ఇంతలో 7 గంటలకనుకుంటాను, ఫోన్ మోగింది. అవతలి మాటలతన్ని కంగారుపెట్టాయి. నాముందు ఏమీ మాట్లాడలేకపోయాడు. వెంటనే వస్తున్నానని చెప్పి, రిసీవర్ విసిరికొట్టి లేచాడు. నన్నిక్కడే వుండమని చెప్పి బయటికి నడిచాడు. నేను వెంబడించాను. అతను వారించాడు. నేను బాడీగార్డ్‌నన్న సంగతి గుర్తు చేశాను. కానీ విన్పించుకోలేదు. చాలా పర్సనల్ అని చెప్పి రావద్దని అర్చాడు. నేను మొండిగా వెళ్ళబోయాను.

"అప్పుడతను వేగంగా తిరిగివచ్చి టేబిల్ మీద ఆ పేపర్ వెయిట్ అంగుకుని టపటపమని కొట్టేశాడు నెత్తిమీద. ఆ క్షణంలో ఏం జరుగుతోందో నాకసలు తెలియలేదు!...."

"నీ మెదడు బాగా తిమ్మిరెక్కివుంటుంది, ఇక్కడ

పనిలేకుండా కూర్చుంటే!" కసిరాడు లాల్. "కమాన్. అక్కడికి చేరుకోవాలి త్వరగా!"

## 7

కృష్ణన్ డిటెక్టివ్‌లని విష్ చేశాడు. "ఫ్రెండ్స్, అతనే మీ క్లయింట్."

డిటెక్టివ్‌లు చూశారు. మహేంద్రనాథ్ గది ద్వారం దగ్గర, గడపమీద వెల్లకిలా పడివున్నాడు. సగం దేహం గదిలోపల, సగం దేహం నడవలో. తల గదిలోవుంది. గుండెలో బాకు పిడివరకూ దిగివుంది.... అతని ఒంటిమీద తెల్లషర్టు, నల్లపాంటు వున్నాయి. కాళ్ళకి బూట్స్. షర్టు ఎర్రబడింది. రక్తం క్రింద మడుగుకట్టింది.

నిపుణులు గదిలోపలా, శవందగ్గర బిజీగా ఉన్నారు.

ఆ గది కారిడార్‌లో చివర్న వుంది. గది ప్రక్క నుంచి క్రింది అంతస్తుకి మెట్లున్నాయి. లిఫ్ట్ సౌకర్యం వేరే వుంది. మెట్లకి కొంచెం ఇవతల కుర్చీల్లో రాగిణి, మరో యువతి, ఒక ఇన్స్‌పెక్టర్ వున్నారు. వాళ్ళ ప్రక్కన రూం బాయ్ నిల్చున్నాడు.

డిటెక్టివ్‌లు వాళ్ళని సమీపించారు. రాగిణి ముఖం పాలిపోయి, కళావిహీనంగావుంది. ఆమె పెదవులు బిగబట్టి బిగుసుకుపోయి కూర్చునుంది. ఆమె ప్రక్కన యువతిని జాన్ ఆశ్చర్యంగా చూశాడు. "మీరు మిస్ నీల కదూ?"

ఆమె తలూపింది చటుక్కున.

"మిమ్మల్ని నాథ్ ఆఫీసులో చూశాను. మీరక్కడ పనిచేస్తారు."

"మళ్ళీ తలూపిందామె.

లాల్ అన్నాడు కర్కశంగా, "రాగిణి, ఇప్పుడెలా

వుంది? నీ పగ చల్లారిందా?"

"నే ననుకొన్న దెప్పుడూ జరక్కుండా వుండలేదు."

"జైలుకెళ్తానన్న దానివి, పారిపోవడానికెందుకు ప్రయత్నించావు?"

"ప్రతిదీ నేను చాలెంజ్ చేస్తాను. పోలీసులు నన్ను వెంటాడి, వేటాడి పట్టుకుంటేనే నాకు తృప్తి."

"ఎంత తేలిగ్గా మాట్లాడేస్తున్నావు! ఉదయంనుంచి ఎక్కడవున్నావు?"

"అతన్ని కనిపెడ్తున్నాను. ఆఫీసు కెదురుగా మూడంతస్తుల హోటల్ వుంది. పై అంతస్తులో గదితీసుకొని గమనిస్తున్నాను. మధ్యాహ్నం బయటకొస్తే వెంటాడాను. అక్కయ్య దగ్గర కెళ్తాడనుకున్నాను. కానీ ఇంటికెళ్ళి భోంచేసి వచ్చాడు. సాయంత్రం 7 గంటల వరకూ ఆఫీసులోనే ఉన్నాడు. నేను కనిపెడ్తూనే వున్నాను. ఈయన రెండుమూడుసార్లు బయటకొచ్చి తిరగడం చూశాను" జాన్‌ని చూపిస్తూ అందామె.

"ఆయన డిటెక్టివని నాకు తెలియదప్పుడు. మహేంద్రనాథ్ 7 గంటలవరకు ఆఫీసు కదల్లేదు. నా హెచ్చరిక పాటించలేదు. అప్పటికి గడువు దాటిపోయింది. ఆఫీసు కెళ్ళి పొడి చెయ్యాలనుకున్నాను. నా దగ్గర కత్తివుంది. అతని గుండెలో చూశారా? దాన్ని ప్రత్యేకంగా ఈ పనికే కొన్నాను.

"సరే, అప్పుడు 7 దాటింది. అతను హడావిడిగా బయటికొచ్చి కారెక్కి బయలుదేరాడు. వెంట ఈ డిటెక్టివ్ లేరు. ఎవరూ లేరు. నేను ఆటోలో వెంటాడాను. కానీ నాకూ అతనికీ మధ్య ఒక కారు మాటిమాటికీ అడ్డువచ్చి విసిగించింది దారి పొడుగునా. నాథ్

తప్పిపోతాడనుకున్నాను.

"ఆ మధ్య వచ్చిన కారు హోటలు దగ్గర ఎటో మాయమైంది. అది గ్రీన్ అంబాసిడర్. అలా అడ్డు వస్తున్నందుకు ముందు దాని డ్రైవర్‌ని పొడవాలనుకున్నాను. నాథ్ అప్పుడూ అక్కయ్య దగ్గర కెళ్ళి క్షమాపణ చెప్పుకోలేదు. ఇక్కడికొచ్చాడు. నేనీ గది వరకూ జాగ్రత్తగా వెంబడించాను. అసలు నా హెచ్చరికనూ, నన్నూ మర్చిపోయినట్లు కన్పించాడు - అతని వాలకం చూస్తే. అంత కంగారుగా—కాదు—కసిగా, ఆవేశంగా కన్పించాడు. గదిలో ఏవో అరుపులు విన్పించాయి. నేను బయట బెల్లు నొక్కాను. అరుపులాగిపోయి తలుపు తెరుచుకుంది. గుమ్మంలో నిలబడి నన్ను గాభరాగా చూశాడు. తెరుచుకునే లోపున కత్తిలాగి పొడిచేశాను.

అంతే! అతను అరవలేదు. చిన్నగా మూల్గాడు. మూల్గి క్రిందపడ్డాడు. నేనక్కడనుంచి మెట్ల దగ్గర కరిగాను. అప్పుడే ఈ వెయిటర్ శనిలా దాపురించాడు! వెనుకనుండి వెంటాడి నన్ను మెట్లమీద పట్టుకున్నాడు. కేకవేశాడు. అంతే, ఇంకేముంది?"

లాల్ ఆమె కళ్ళలోకి పరీక్షగా చూసి వెయిటర్ వైపు తిరిగాడు.

"అవును సార్, ఆమె చెప్పింది నిజం. ఆమె పొడుస్తున్నప్పుడు నేను ఆ చివర వున్నాను—అప్పుడే యిటు వస్తున్నాను. కళ్ళారా చూశాను."

జాన్ కళ్ళు నీలమీద పడ్డాయి, "కానీ మీరిక్కడికెలా వచ్చారు? నాథ్‌ని యెందుకు పిలిచారు?"

"మేం తరచు ఇక్కడ కలుసుకొంటుంటాం. ఇది

అతని పర్మనెంట్ గది. నాకో డూప్లికేట్ కీ చేయించి ఇచ్చాడు, హోటలురూల్సుకి విరుద్ధమైనా. నే నాఫీసులో ఆరుగంటల వరకున్నాను. మీరు మధ్యాహ్నంనుంచీ అక్కడే వున్నారు. ఎందుకో నా కర్థంకాలేదు. కానీ మిమ్మల్ని గుర్తుపట్టాను. ఆఫీసు వదిలేక తిన్నగా ఇక్కడి కొచ్చాను. స్నానం అదీ అయ్యాక ఏడుగంటలకి అతనికి ఫోన్ చేశాను రమ్మని, ఎప్పటిలాగే. కానీ అతనంత కోపంగా, ఆవేశంగా వచ్చి తిడతాడనుకోలేదు!"

"ఎందుకు తిట్టాడు?"

"ఆయన పార్ట్నర్ ఆఫీసులో అందర్నీ గమనిస్తున్నాడట. నన్నిక్కడ పట్టుకుంటే తన వ్యవహారమంతా బైట పడ్తుందని తిట్టాడు. ఇక పైన ఇక్కడ అసలు రావద్దని అన్నాడు. స్థలం మారుస్తానని చెప్పాడు."

"అప్పుడు?"

"అలా అరుస్తున్నప్పుడే కాలింగ్ బెల్లు మ్రోగింది. పాటిల్ వచ్చేశాడని కంగారుపడ్డాడు. కానీ బయట గాజులశబ్దం విని వెంటనే తలుపుతీశాడు. అంతే—అప్పుడీమె మాటమాత్రం లేకుండా పొడిచి పారిపోయింది!"

రాగిణి చివాల్న తలతిప్పి నీలను అసహ్యంగాచూసింది.

"అలా స్పష్టంగా చూశారా?"

"స్పష్టంగా చూశాను. ఒకే ఒక్క పోటు బలంగా పొడిచింది."

లాల్ ఇన్స్పెక్టర్ వైపు తిరిగాడు: "మీరేం చెయ్యదల్చుకున్నారు?"

"ఈ ముగ్గుర్నీ స్టేషన్కి తీసికెళ్తాం. అక్కడ స్టేట్మెంట్స్ తీసుకుని వీళ్ళిద్దర్నీ వదిలేస్తాం. రాగిణి కస్టడీలో వుంటుంది" అన్నాడు ఇన్స్పెక్టర్.

# 8

మర్నాడు అనిత లాల్ ఆఫీసుకొచ్చి ఏడ్చింది, బ్రతిమాలింది; చెల్లెల్ని రక్షించమని. నగలు వొలిచి చేతిలో పెట్టింది. ఎలాగయినా ఆమెను కాపాడమని ప్రాధేయపడింది.

కానీ ఏ ఆధారంతో ఆమెని విడిపించగలరు, తాను చంపానని స్వయంగా చెప్పుకుంటుంటే? ఆమె స్టేట్మెంటుకి తగట్టు ఆధారాలున్నాయి, సాక్షులు కూడా వున్నారు. డిటెక్టివ్లు తమ నిస్సహాయతను వెల్లడించారు. సానుభూతి చూపడంకంటే చెయ్యగల్గిందేమీ లేదన్నారు. ఈ వార్త తక్షణం పెద్దలకు తెలియజేసి, లాయర్ సహాయాన్ని పొందటమే ప్రస్తుత కర్తవ్యమని చెప్పారు.

అనిత దాదాపు స్పృహలేని స్థితిలో తూలుతూ వెళ్ళిపోయింది.

అయితే డిటెక్టివ్లు చెరొకరికి మెదడులో ఏదో మూల మాటల్లో పెట్టలేనిదేదో తొలుస్తూనే వుంది— రాత్రినుంచి. దాన్ని పరస్పరం వెల్లడిచేసుకొని రూఢీ చేసుకొనే ప్రయత్నం చెయ్యలేకపోతున్నారు — జరిగిన హత్యను ఓపెన్ & షట్ కేసులా తేల్చేసిన రాగిణి స్టేట్మెంట్ విని.

పరిస్థితి ఇలావుండగా మధ్యాహ్నం ఒంటిగంటకు నాథ్ పార్ట్నర్ పాటిల్ దుమారంలా వచ్చి, పెద్దగొంతుకతో చిన్న ఉపన్యాసమిచ్చాడు :

"జంటిల్మన్! క్రితంసారి వచ్చినప్పుడు నేనేంచెప్పాను. నా ఆందోళన ఏమిటి? కంపెనీ ప్రతిష్ఠగురించి నేనెంత ప్రాకులాడాను. నిద్రకాచాను. ఆరోగ్యం పాడుచేసుకున్నాను. అవినీతిని నిరోధించాలని శాయశక్తులా శ్రమిం

చాను. ఫలితం? నా శ్రమంతా బూడిదలో పోసిన పన్నీ రయింది! కంపెనీ ప్రతిష్ట పత్రికల కెక్కింది. ప్రజల్లో ప్రెస్టేజి, విశ్వాసం కోల్పోయింది! నా పార్ట్నర్‌నీ కంపెనీ ఉద్యోగినీ 'ఛీ—అవ్వ!' అనుకునేలా హెడ్డింగ్ పెట్టి వ్రాశాయి! ఏం కాను! ఇప్పుడు కంపెనీ గతి ఏం కాను!"

"టు హెల్ విత్ యువర్ బిజినెస్!" కసురుకున్నాడు లాల్.

"ఏమిటీ?"

"ప్లీజ్, మీరలా ఆవేశపడకండి." జాన్ కల్పించుకున్నాడు.

"ఇదంతా మీవల్లనే జరిగింది!" అర్చాడతను.

"వాట్ నాన్సెన్స్! ఏమిటి మీ దబాయింపు?" కోపంగా అన్నాడు లాల్.

అప్పుడే ఫోన్ మ్రోగటంతో జాన్ రిసీవరెత్తాడు.

"నాథ్ మొన్న ఏంచేశాడో మీరు చెప్పలేదు!" అన్నాడు పాటిల్. "అతని భార్యకూడా చెప్పడానికొప్పుకోలేదు. అనిత ఏం చెప్పిందో మీకు తెలుసు. నాథ్ చేసిందేవిటో నాకు తెలిస్తే ఈ గొడవని గుట్టు చప్పుడుకాకుండా పరిష్కరించేవాడ్ని. కంపెనీ గుడ్‌విల్ని అలా కాపాడేవాడ్ని."

"ఎవరో చెప్పలేదంటే మేమేం చెయ్యాలి? మేం చెప్పటమన్నది క్లయింట్ విశ్వాసాన్ని భంగపర్చినట్లు అవుతుంది."

"పోనీ, అంతటి విశ్వాసంతో అతనికేం మేలు చేశారు? హత్యని నివారించలేకపోయారు? మీ అసమర్థతవల్ల బండారమంతా బయట—" పాటిల్ ఆగిపోయి

ఫోన్‌లో మాట్లాడుతోన్న జాన్‌ని తీక్షణంగా చూశాడు.

"అలాగా?.... ఈ కేసులో మలుపా?" అంటున్నాడు జాన్, "వెరీవెల్! ఈ కేసు నాకసలు నచ్చలేదు. ఏదో విచిత్రం జరిగి విడిపోవాలని జీసెస్ క్రైస్ట్‌ని ప్రార్థిస్తున్నాను ఇంతదాకా.... ఈ మలుపుని ఆహ్వానిస్తున్నాను కృష్ణన్. అసలు మలుపులేని దేమిటి? మలుపులేకుండా ప్రయాణం సాగదు. మలుపు లేకపోతే పరిశోధన సాగదు...."

లాల్ పాటిల్ని చూశాడు. "మిస్టర్ పాటిల్, ఇంతకీ మీరే ఉద్దేశంతో వచ్చారిక్కడికి? ఏమిటి పేచీ?"

"నాకు మనస్తాపం కల్గించిన వాళ్ళని చెడామడా తిట్టేయడం నా అలవాటు" అనేసి గిరుక్కున తిరిగి వేగంగా తలుపు దగ్గరికి నడిచాడు అతను.

లాల్ గబుక్కున ముందుకి వంగాడు. "జస్ట్ మినిట్! ఆగండి, మిస్టర్ పాటిల్."

అతను వెనక్కి తిరిగి కోపంగా చూశాడు. "ఏమిటి?"

"నిన్న సాయంత్రం మీరెక్కడున్నారు?"

"ఈ ప్రశ్న దేనికి వేశారు?"

"మేం మీ పార్ట్‌నర్ హత్యని పరిశోధిస్తున్నాం."

"ఇంకా పరిశోధన ఏమిటి? అంతా ఆమె ఒప్పుకుందిగా?"

"ఆమె ఒప్పుకోలేదు, పరిస్థితులు ఆమెని ఒప్పించాయి."

"ఐసీ.... ఐ పిటీ హర్, నా సానుభూతి తెలపండి."

"నిన్న సాయంత్రం 7 నుంచి 8 వరకు మీరెక్కడున్నారు?" రెట్టించాడు లాల్.

జాన్ ఫోన్ పెట్టేసి అయోమయంగా చూశాడు.

"ఆల్రైట్. ఆరు తర్వాతనుంచీ ఇంట్లోనే వున్నాను. చాలా?"

"రుజువు చెయ్యగలరా?"

"చెయ్యలేను. ఒంటరిగాడ్ని. ఇంట్లో ఎవరూ లేరు."

"అది రుజువుచెయ్యడం చాలా అవసరం."

"మీరు నన్నను మానిస్తున్నారా? చింతిస్తారు మై డియర్ —"

"నిన్న సాయంత్రం మిసెస్ నాథ్ కెందుకు ఫోన్ చేశారు?"

ఈ ప్రశ్నకి అతను కలవరపడ్డాడు. వెంటనే తేరుకుని, "మిసెస్ నాథ్ కి చేయలేదు, నాథ్ ఇంటికిచేశాను. ఆమె పలికింది" అన్నాడు.

"దేనికి చేశారు?"

"నాథ్ కోసం. కానీ అక్కడలేడు. మీ ఆఫీసులో ఉన్నాడేమో కనుక్కోమన్నాను. ఆమె మీకు ఫోన్ చేసి, లేడని నాకు తెలియజేసింది."

"మాకు స్వయంగా మీరే ఎందుకు చెయ్యలేక పోయారు?"

"ఎందుకా? మీరతని రహస్యాల్ని భద్రంగా కాపాడుతున్నారనీ!"

"నాథ్ ఇంటికెన్ని గంటలకి ఫోన్ చేశారు?"

"ఆరున్నరనుంచి ఎనిమిది వరకు మూడుసార్లు చేశాను. మొదటి రెండుసార్లు పిల్లలు పలికారు. మమ్మీ షాపింగ్ కెళ్ళిందన్నారు. కానీ ఆమె షాపింగ్ కెళ్ళగా నేనెప్పుడూ చూడలేదు. ఆమె అసలు ఇల్లు కదలదు. మూడోసారి ఎనిమిది గంటలకి ఫోన్ చేశాను. అప్పుడామె పలికింది."

"రెండోసారి ఎన్ని గంటలకి చేశారు?"

"ఏడున్నరకి—అప్పుడూ పిల్లలు పలికారు."

"నాథ్‌తో ఏం మాట్లాడాలనుకున్నారసలు?"

"పార్టనర్‌షిప్ గురించి. అతని చీకటి బ్రతుకు గురించి నా కనవసరమనుకున్నాను. అతని భాగంకంటే ఎక్కువ డబ్బిచ్చి వదిలించుకోవాలనుకున్నాను. ఆ విషయాలన్నీ మాట్లాడుకునేందుకు ఇంటికి రమ్మనాలనుకున్నాను. కానీ అతనెక్కడా లభించలేదు."

"ఆఫీసుకి ఫోన్ చెయ్యలేదా?"

"చేశాను. ఆఫీసు అయిదు గంటలకే మూసేస్తారు. అందువల్ల ఇంటికే చేశాను మొదట. కానీ ఇంట్లో లేక పోవడంతో అప్పు డాఫీసుకి ఫోన్ చేశాను."

"ఎన్ని గంటలకి? వెంటనే చేశారా?"

"లేదు. ఇంటికి ఆరున్నరకి చేశాను. అక్కడలేకపోతే ఎక్కడ వెళ్ళివుంటాడా అని ఆలోచించాను. ఒకవేళ పని ఎక్కువవుండి ఆఫీసులోనే ఉండిపోయాడేమోనని చాలా సేపటి తర్వాత తట్టింది. ఏడుదాటిందనుకుంటాను, అప్పుడు ఫోన్ చేశాను. కానీ రెస్పాన్స్ లేదు, నిజంగానే ఆఫీసు మూసివుంది."

"రెస్పాన్స్ లేదా....? అంటే?"

అతను కోపంగా చూశాడు. "అంటే?....అంటే ఏమిటి!"

"రెస్పాన్స్ లేదంటే అర్థమేమిటి?"

అతని ముఖం కందిపోయింది. "అర్థంలేని ప్రశ్నలు వేస్తున్నారు! రెస్పాన్స్ లేదంటే అర్థమేమివుంటుంది?"

లాల్ జాన్ వైపు తిరిగాడు. "ఏమైవుంటుంది పార్టనర్?"

జాన్ అయోమయంలోంచి తేరుకొని, "అవతల ఎవరూ

లేరనా?" అన్నాడు.

"ఓహ్, అవును! మరింకేమిటనుకున్నారు?" అరిచాడు పాటిల్.

"అవతల ఎవరైనా వుంటే ఫోన్ ఎత్తకపోయినా రెస్పాన్స్ రాదు" జాన్ అన్నాడు మళ్ళీ.

పాటిల్ కలవరపడ్డాడు.

జాన్ ఇంకా ఉత్సాహంగా అన్నాడు అతని కలవరం చూసి. "అవతల ఫోన్ ఎంగేజిలోవున్నా రెస్పాన్స్ రాదు—నెంబర్ త్రీ! చెప్పండి, ఈ మూడింట్లో ఏది కావచ్చు?"

"ఏమిటి మీ ఉద్దేశం? నా మీద ఏమారోపిస్తున్నారు?" అరిచాడతను.

ఈసారి జాన్ కలవరపడ్డాడు.

లాల్ కల్పించుకున్నాడు, "మీరు ఫోన్ చేసినప్పుడు అవతల ఎంగేజిలో వుందో లేదో బాగా ఆలోచించి చెప్పండి."

"లేదు, ఎంగేజిలోలేదు! అవతల ఎవరూ లేరు!"

"తప్పు. ఎంగేజిలో వుందనుకున్నారు. అంటే నాథ్ ఆఫీసులో వున్నాడనుకున్నారు. వెంటనే బయలుదేరి వచ్చి—"

"వచ్చి? వచ్చి ఏం చేశాను, మీ పిచ్చిగాని!"

"ఆఫీసుముందు నిఘా వేశారు" అన్నాడు లాల్. "ఇంతలో అతను కంగారుగా వచ్చి కారెక్కి బయలుదేరాడు. మీరు వెంబడించారు. అతను హోటలు మయూర్ చేరుకున్నాడు. మీరూ అక్కడికెళ్ళారు.... హత్య సరిగ్గా 7-20 కి జరిగింది....ఆ వెంటనే మీరక్కడ్నుంచి వెళ్ళిపోయి నాథ్ ఇంటికి ఫోన్ చేశారు రెండో

సారి, ఏడున్నరకి. పిల్లలు పలికారు. తర్వాత ఎనిమిది గంటలకి మీ పార్ట్‌నర్ భార్య పలికింది. ఆమెతో మీ నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవాలని ప్రయత్నించారు. అదంతా ఎలిబీ కోసం మీరు సాగించిన స్టంట్ మాత్రమే!"

"ఓ గాడ్!....హే భగవాన్!....హెల్ప్ మీ!"

"ప్లీజ్ వెళ్ళిపోండి! వెంటనే లాయర్‌ని నియమించు కోండి."

పాటిల్ ఆవేశంగా ముందుకి రాబోయాడు. కానీ మనసు మార్చుకొని, చటుక్కున వెనుదిరిగి అరుస్తూ వెళ్ళి పోయాడు.

# 9

కృష్ణన్ బ్రీఫ్‌కేసుతో రాకెట్‌లా మాసుకొచ్చాడు.

"గుడ్ గాడ్! ఫ్రెండ్స్, పొరపాటు జరిగింది!"

"ఏమిటా పొరపాటు?" లాల్ అడిగాడు.

"మనం అనుకోవడం—రాగిణి హతుడ్ని చంపిందను కోవడం!"

"మనం అనుకోవడంలేదు—ఆమె చెప్తోంది—కదూ?"

"ఆమె చెప్తున్నదంతా అబద్ధం!"

"వెల్, ఆమెకెందు కేర్పడిందా అగత్యం?"

"ఆమె మోటివ్ మీకే బాగా తెలుసు. ఈ రిపోర్ట్స్ చూడండి...."

"చూసే ఓపిక లేదు, ఫ్లాష్ పాయింట్స్ జీ గేలు మన్నించండి."

"ఆల్‌రైట్, అయితే వినండి: హత్యా సమయం 7-20. కత్తితో జరిగింది. కత్తి గుండెలో పిడివరకూ దిగింది. పిడిమీద రాగిణి వేలిముద్రలు వున్నాయి. శవభంగిమ

దాడి జరిపిన విధానానికి అనుగుణంగా వుంది. అతను తలుపు తీసిన వెంటనే ఆమె పొడిచింది ముందునుంచి.— అప్పుడతను వెల్లకిలా వెనక్కి పడ్డాడు గదిలో. కాని కాళ్ళు బయట కారిడార్‌లో వున్నాయి. అంటే అతను ఎక్కడ నిలబడ్డాడు? గది లోపలా? బయటా?

తలుపు తీసిన తక్షణం పొడిచిందంటే లోపలే వుండాలి. అలా స్పష్టంగా కనిపిస్తోంది ఆ సమయంలో గదిలో వున్న నీల. కానీ గది బయట కాళ్ళు అతను బయట నిల్చున్నాడని సూచించడంలేదూ?"

జాన్ అన్నాడు: "ఆమెని పట్టుకోనే ప్రయత్నంలో బయటకు జరిగి వుండవచ్చు."

"ఆల్రైట్, అయితే గాయం చూడండి, గుండెలో పైనుంచి ఏటవాలుగా క్రిందికి వుంది. దిశ కుడివేపుగానీ ఎడమవైపుగానీ వంపులేకుండా, సూటిగా క్రిందకివుంది.... లోతు అరంగుళాలు. కత్తికి ఇరువైపులా పదునుంది. చివర మొనదేలి, బ్లేడు అసలు మెరుగు కోల్పోకుండా తళతళ లాడుతోంది. సరిక్రొత్త కత్తి.

"అయితే ఈ గాయం లోపల, పైనుంచి సుమారు అంగుళం లోతులో, అడ్డంగా ఎడమవైపుకి చీలిక ఏర్పడింది. ఈ చీలిక అరంగుళం పొడవుంది. అంటే ఈ చీలిక ప్రధాన గాయానికి అంగుళం దూరం నుంచి లోపల 'Y' ఆకారంలో ఏర్పడిందన్న మాట. అర్థం చేసుకున్నారా?"

డిటెక్టివ్‌లు తలూపారు.

"ఈ ఎక్స్‌రే చూస్తే బాగా అర్థమవుతుంది. గాయంలోకి Radio paque ఇంజెక్షన్ చేసి.... డాక్టర్ ఏదో ప్రక్రియ చెప్పాడు.... ఈ ఎక్స్‌రే తీశాడట. ఇందులో

గాయం స్వరూప స్వభావాలు స్పష్టంగా అర్థమవు తాయి."

డిటెక్టివ్‌లు ఎక్స్‌రేను కిటికీ వెలుతురులో పరిశీలించారు.

"అవును, చీలిక అడ్డంగా స్పష్టంగా కనిపిస్తోంది" జాన్ అన్నాడు.

కృష్ణన్ తలూపాడు. "ఈ చీలిక మితులు లోతు మినహాయిస్తే—పొడవు, వెడల్పు, అడుగు భాగం ఆకృతి మొదలైనవి ప్రధాన గాయం కొలతలతో సరిపోతున్నాయి. అంటే ఈ రెండు గాయాల్ని ఒకే కత్తి చేసిందన్న మాట."

"ఐ సీ...." లాల్ అన్నాడు.

"ఇప్పుడు చెప్పండి, ఈ చీలిక కర్థమేమిటి? హతుడు రెండు పోట్లు తిన్నాడని కాదూ?"

"అవును, అవును.... కాని, షర్టుమీదా బనియన్ మీదా ఎన్ని పోట్లున్నాయి?"

"ఒక్కటే."

"వెల్, ఆమె ఒకేచోట రెండుసార్లు పొడిచి వుండవచ్చు" అన్నాడు జాన్.

"నో, ఒక్కసారే పొడిచిందని నిశ్చయంగా అంటోంది నీల! కానీ రాగిణి రెండుసార్లు పొడిచానంటోంది. ఈ ఇద్దరూ అబద్ధమాడుతున్నారు. రాగిణి ఒక్కసారే పొడిచింది. మరోసారి పొడిచే అవకాశం ఆమెకు లేదు! ఈ హత్యలో మరొకరి పాత్ర వుంది."

"వెల్, వెల్, కృష్ణన్! అదెలా?" లాల్ అడిగాడు కళ్ళు పెద్దవి చేసి.

"అదెలా జరిగింది—తలుపు తీసిన వెంటనే రాగిణి

పొడిచింది. అది వాస్తవమే. అయితే ఆ పోటు సూటిగా సరిగా దిగలేదు. చెయ్యి వణకడం వల్లనో, ఆమెకు బలం లేకనో అడ్డంగా వెళ్ళి గుచ్చుకుంది కత్తి. గుచ్చుకుంది, అంతే. దిగబడలేదు! అది గుండెని గాయపర్చలేదు, ఆ గాయం ప్రాణాంతకమైంది కాదు. ఆమె అక్కడ్నించి పరుగు తీసింది. అప్పుడు బరువయిన, బలిష్టమయిన పిడిగల కత్తి ఆ గాయంలో నిలవలేక జారి క్రింద పడింది— పడుతూ హతుని ఎడమకాలి బూటులోనికి చొచ్చుకు పోయింది. బొటన వేలికీ, రెండో వేలికీ మధ్యలో చర్మం తెగి రక్తం సాక్స్ పీల్చుకుంది—"

"ఓహో! ఇంకా చెప్పండి!" అర్చాడు జాన్ బల్ల మీద కొట్టి.

"అలా పడ్డ కత్తిని అందుకొని మళ్ళీ పొడిచే అవకాశం రాగిణికి లేదు. ఆ పని చేసేంతలో హతుడు ఆమెని నివారించగలడు. కాబట్టి ఆమె మళ్ళీ పొడవలేదు. ఆ పోటు చాలనుకొంది, పారిపోయింది. ఇంతలో అదే క్షణంలో, ఎవరో తెలివిగా అదే కత్తి అందుకొని అదే గాయంలోకి దింపారు. ఫ్రెండ్స్! అలా దింపిన మనిషి హతునికి బాగా తెలిసినవారై వుండాలి. అతని సహాయానికి వచ్చినట్టు వచ్చి పొడిచేశారు. రాగిణి వేలిముద్రలు చెడకుండా జాగ్రత్తగా, ఆమె చేసిన గాయంలోకి, హత్య ఆమెమీద కెళ్ళాలన్న ఆలోచనతో.

"ఇప్పుడు చెప్పండి! ఆ పని ఎవరు చేసి వుంటారు? ఈ హత్యలో ఇద్దరి పాత్ర వుందని తెలిశాక నీల అబద్దమాడుతోందని స్పష్టమవడం లేదూ? ఈ ఆధారంతో ఆ పని ఆమే చేసిందనిపించడం లేదూ?"

లాల్ నిటారుగా కూర్చుని జాన్ని చూశాడు, మెరు

స్తున్న కళ్ళతో. "వెల్, జాన్! వెళ్ళి అనితని ఓదార్చు! గండం తప్పిందని చెప్పు! గెటప్ అండ్ మూవ్ ఫాస్ట్. నేనింకా ఆమె నా సిత్తిలో చూళ్ళేను."

జాన్ లేచాడు. వేగంగా బయటికి దారి తీశాడు.

లాల్ కృష్ణన్ వైపు తిరిగాడు. "ఇన్‌స్పెక్టర్! మీ లాజిక్ చాలావరకు వాస్తవం కావచ్చు. కానీ రెండో పోటు నీల పొడిచిందనడానికి ఆధారం లేదు."

"ఎందుకు లేదు?"

"అప్పుడామె గది లోపల వుంది. హంతుడు ద్వారాని కడ్డంగా ఆమె వైపు వీపు పెట్టి నిల్చున్నాడు. పోటు తిని అదేపళంగా వెల్లకిలా వెనక్కిపడ్డాడు. వెల్, కాళ్ళు బయట వున్నాయి గనుక, రాగిణిని పట్టుకోనే ప్రయత్నంలో బయటకు అడుగు వేశాడనుకుందాం. ఆ అదను చూసుకొని నీల బయటకొచ్చి ముందు నుంచి పొడిచి వుంటే, అప్పుడు మీ లాజిక్ వాస్తవం కావచ్చు. కానీ మరొక చిక్కు వుంది. ఇందులో మరో అనుమానితు డున్నాడు...."

"ఎవరు?"

"హంతుడి పార్ట్‌నర్ పాటిల్. అతను నాథ్‌ని వెంటాడి హోటలు కొళ్ళాడు. నాథ్ కారుని ఒక గ్రీన్ అంబాసిడర్ వెంటాడ్డం రాగిణి చూసిందట....ఆ కారు పాటిల్ది. నాథ్‌ని రెడ్‌హేండెడ్‌గా లవర్‌తో పట్టుకోవాలని వెళ్ళివుంటాడు. అప్పుడే రాగిణి పొడిచి పారిపోతుండగా చూశాడు. ఆమె వెనుక రూమ్‌బాయ్ వురికాడు. కారిడార్‌లో మరెవరూ లేరు. కిందపడ్డ కత్తి తీసుకొని ఆ అవకాశంతో పొడిచేశాడు."

"పొడిచేశాడా?"

"వెల్, పొడిచి వుంటాడు. అయితే నీల ఏం చేస్తున్నట్లు? అతన్ని చూశ్శేదా? చూస్తే యెందుకు వూరుకుంది?"

"మీరు సాగదీస్తున్నారు. చిక్కులు సృష్టిస్తున్నారు"

"పలాయనవాదం ఇక్కడ పనికిరాదు. మరో విషయం, రాగిణి పొడిచి వుండదు...."

"ఆఁ!.... బాగుంది. ఆ తర్వాత నాథ్ చావలేదనండి."

"ముందు వినండి. నిజానికి ఆమెకు భయం ఎక్కువ. బాహాటంగా ఎన్ని హెచ్చరికలూ, సవాళ్ళూ చేసినా; ఆచరణకొచ్చేటప్పటికి భీరువు అయింది. అందుకే పారిపోవాలని ప్రయత్నించింది. ఆమె ఎవరి కంటబడకుండా పారిపోవాలనుకున్నప్పుడు, ధైర్యంగా గదిలో వున్న మరో మనిషి ముందు హత్య చేయదు కదా? ఆలోచించండి."

"అయితే ఏం చేసింది?"

"గది పక్కన మెట్లున్నాయి. అక్కడ చాటుగా నిలబడి కత్తి విసిరి వుంటుంది. ఆ తర్వాత పరుగు తీసింది."

చర్చ ఇలా సాగుతోండగా గంట తర్వాత ఫోన్ మోగింది.

అవతల జాన్ పలికాడు: "హలో లాల్, అక్కడ కృష్ణన్ వున్నాడా?"

"ఉన్నాడు.... దేనికి?"

"వెంటనే మీరిద్దరూ బయలుదేరి వచ్చేయండి."

"ఎక్కడికి?"

జాన్ అడ్రసుతోబాటు గబగబా కొన్ని సూచనలిచ్చాడు.

# 10

వాళ్ళు ముగ్గురు చప్పుడు గాకుండా పెరటి తలుపుల గుండా లోని కెళ్ళారు.

"ఆమె బెడ్‌రూమ్‌లో వుంది, బాగా తాగేసింది...." అన్నాడు జాన్ ముందుకు దారి తీసి, కిచెన్ తలుపు తెరుస్తూ.

లాల్, అతను వెనుక కృష్ణన్ అనుసరించారు.

జాన్ గుసగుసలాడాడు: "అవతల మరో గది వుంది. దానవతల బెడ్‌రూం వుంది.... మధ్య తలుపు అవతల నుంచి గొళ్ళెం పెట్టివుంది. అక్కడికి వెళ్ళాలి.... కాస్సేపట్లో అతనొచ్చేస్తాడు. రండి, అడుగులు జాగ్రత్త!"

నిశ్శబ్దంగా ముగ్గురూ ఆ గదిలో కెళ్ళి తలుపు దగ్గర నిలబడ్డారు. అవతల ఏమీ విన్పించలేదు. లాల్ కృష్ణన్ జాన్ ముఖం చూశారు ప్రశ్నార్థకంగా. జాన్ నోరు తెరవొద్దని వారించాడు.

ముగ్గురూ కొన్ని నిమిషాలు కాచుకున్నారు. కృష్ణన్‌కీ, లాల్‌కూ అసహనం ఎక్కువవుతోంది.... ఏమీ జరగటం లేదు. జాన్‌ని దీనంగా చూశారు.

అప్పుడే బయట తలుపు కొట్టిన చప్పుడయింది.

ముగ్గురూ వులిక్కిపడ్డారు.

మరోసారి చప్పుడయాక అరుపు విన్పించింది. "నీల!"

అది మగ గొంతు.

"అతనొచ్చేశాడు!" జాన్ అన్నాడు చెవులు రిక్కిస్తూ.

మళ్ళీ తలుపు చప్పుడూ అరుపూ విన్పించాయి. బెడ్‌రూమ్‌లో అలికిడైంది. చిన్న మూల్గు.... ఏదో కిందపడ్డ శబ్దం.

"ఎ....ఎ....యెవరది?" మెత్తగా పలికింది స్త్రీ కంఠం.

"నువ్వు తలుపు తీయ్!" అర్చింది బయటి కంఠం.

మళ్ళీ కొన్ని క్షణాలు నిశ్శబ్దం. ఆ తర్వాత చెప్పులు తొడుక్కుంటున్న సవ్వడి, నడుస్తున్న అలికిడి, తలుపుకి కొట్టుకున్న తాకిడి....

అప్పుడు తలుపు తెరుచుకున్న శబ్దం.

ఆ వెంటనే స్త్రీ కంఠం, "నువ్వా! ఇక్కడికెందుకొచ్చావ్?" అనర్చింది.

మగ కంఠం "నువ్వెందుకు పిలిచావ్?" అంది.

"నేనెప్పుడు పిలిచాను?" అడిగింది స్త్రీ కంఠం గాభరాగా.

"ఏడ్చావ్! ఒళ్ళు తెలియకుండా తాగేసి! ముందు పద లోపలికి!"

తలుపు ధడాలున మూసుకుంది. స్త్రీ కంఠం కేక పెట్టింది. భూమి కంపించేలా బరువయిన అడుగులు బెడ్ రూమ్‌లో కొచ్చాయి—వాటితో పాటు ఈడ్చుకు రాబడుతున్న స్త్రీ అరుపులు.

బెడ్‌రూంలో ఒక్కసారిగా పెద్ద పెట్టున చప్పుళ్ళు ప్రారంభమయ్యాయి.

"ఏమిటి .... ఏమిటిది....ఏయ్‌ః! .... నువ్వేం చేస్తున్నావ్? నన్నొదులు!" అరుస్తోందామె, "నన్నొదులు!.... నిన్నే! అబ్బా....నిన్నే! నిన్నే రాస్కెల్! వదిలిపెట్టు! ఓ—" చిన్న కేక వెలువడింది, "దుర్మార్గుడా! వెళ్ళిక్కడ్నుంచి! నిన్ను—నిన్ను—"

మగ కంఠం కెవ్వుమని కేక పెట్టింది.

"రాక్షసీ! నా చెయ్యి కొరికావు!"

"రాస్కెల్! నీ గొంతు నరుకుతాను. ఇక్కడికి కెందు కొచ్చావ్? నే నెప్పుడు రమ్మన్నాను? గెటవుట్! నా వొంటిమీద చేతులేయడానికెంత ధైర్యంరా నీకు."

"ఊరుకో బుజ్జీ. నీకు ఒళ్ళు తెలియడంలేదు. నే నెవ ర్ననుకున్నావు? నాతో ఏం చెప్పావప్పుడు? నీ మాట విని నేనా పని చేశాను. నాకో అవకాశం ఇస్తానని ఒప్పుకోక పోతే నేనా పని ఎందుకు చేస్తాను చెప్పు? నువ్వు చెప్పింది చేశాను, ఇప్పుడు తప్పించుకోలేవు. కమాన్!"

మళ్ళీ చప్పుళ్ళు ప్రారంభమయ్యాయి. ఇవతల ముగ్గురూ అసహనంగా నిలబడ్డారు.

"వెధవా! నిన్ను చంపమని అన్నానా? ఆ పని ఆమె చేస్తుందీ, పారిపోకుండా పట్టుకోమన్నాను! నామీద నీ ఆలోచనల్ని ఎప్పుడో పసిగట్టాను. నిన్ను పూరించి నా పబ్బం గడుపుకోడానికే అలా ఒప్పుకున్నాను. నీ దరిద్రపు చేతులు నన్ను తాకడం కలలో కూడా సహించను. డబ్బి స్తాను, ఎంత కావాలో అడుగు."

"నువ్వలా మోసగించలేవు బుజ్జీ. నీకోసం నువ్వు చెప్పిన దానికంటే ఎక్కువే చేశాను. అది ఆమెవల్ల అయివుండేది కాదు. మాట ఇచ్చి నువ్వు తప్పించుకో లేవు...."

"దూరంగా వుండు. అరుస్తాను. మందిని పిలుస్తాను-"

"ఈ అరుపులకంటేనా. కమాన్, మందు బిగించి మతి లేకుండా మాట్లాడుతున్నావ్."

ఈసారి అలజడిసాయి పెరిగింది. ఏవో క్రింద పడ్తు న్నాయి, దొర్లుతున్నాయి. మూల్గులు.... కేకలు....

జాన్, కృష్ణన్‌కి సైగ చేశాడు. కృష్ణన్ వెనక్కి జరిగి

విసురుగా భుజంతో తలుపుని నెట్టేసాడు. వంతుల వారీగా ముగ్గురూ నెట్టేసారు.

గొళ్ళెం వూడి భళ్ళున తెరుచుకుంది తలుపు.

ముగ్గురూ లోనికి జొరబడ్డారు.

నీలతో పెనుగులాడుతోన్న రూంబాయ్ నాగేష్ బెదిరి పోయి, ఆమెని వదలి దూరంగా దూకేశాడు. నీల భయం కరంగా కేకపెట్టింది.

"అరెస్ట్ దెమ్!" అన్నాడు జాన్, కృష్ణన్‌తో.

## 11

అనిత అయోమయంగా, కలవరంగా చూసింది: "చెప్పలేం? ఎలా జరిగింది! నమ్మలేకపోతున్నాను."

జాన్ నవ్వాడు: "నేనూ నమ్మలేదు, మీ చెల్లెలి మాటల్ని. ఆమె గొప్ప త్యాగం చేస్తున్నాననుకొని అబద్ధాలాడింది. కాని ఆమె నిర్దోషిత్వాన్ని ఎలా నిరూపించాలో నాకు బోధపడలేదు కేసులో మరికొన్ని విష యాలు బయటపడేవరకూ. పూర్ లిటిల్ థింగ్; ఎలాగూ పట్టుబడింది గనుక గత్యంతరంలేక అన్ని నిందలూ తనమీదే వేసుకుంది ఆత్మాభిమానంతో, బాహాటంగా హెచ్చరి కలూ, ప్రతిజ్ఞలూ చేసినందువల్ల.

"అసలు మీ చెల్లెల్ని, మిస్ అనిత, ఆ అఘాయిత్యా నికి పాల్పడేలోపు లాల్ చెప్పినట్లు ట్రాప్ చెయ్యాలను కున్నాను గానీ, నాథ్ అంగీకరించలేదు. అసలు నన్ను బాడీగార్డుగా పిలవటమే గొప్ప సాహసమట! బయట మీ చెల్లెలు అతని గుండెలో ఎలా పడకవేసిందో, అలాగే ఆఫీసులో మరో ఇద్దరు అతని పీకలమీద కూర్చుని వున్నారు: నీల, రజని. మీ సహోద్యోగినులు.

"నీలకు ఇదంతా తెలియదనుకుని అతను పొరబడ్డాడు.

ఆమెకంతా తెలుసు. ఎక్కడో వున్న నాథ్ పార్టనర్ కే తెలియగా లేనిది ఆఫీసులో వున్న ఆమెకెలా తెలియకుండా వుంటుంది? మీకేం జరిగిందో అంతా తెలుసామెకి. అయితే అది తెలిసి చావాలనుకోలేదు మునపటిలా. అతనితో పోట్లాడనూలేదు. ఆమె గుండెలో పగ రగిలింది. దాన్ని నిశ్శబ్దంగా అణిచిపెట్టింది. తన్ని మళ్ళీ మళ్ళీ మోసం చేస్తున్న నాథ్ కి తగిన శాస్తి జరపాలనుకుంది. అతను చచ్చిపోవాలని, కసిగా నిర్ణయించుకుంది. అతనితో తన పెళ్ళి కల్ల."

"ఏం చేసింది? అతన్నెలా...."

"ఆమె, నిర్ణయానికి పరిస్థితులు అనుకూలంగా ఉన్నాయి. మీ చెల్లెలు నాథ్ ని కనిపెట్టోందని ఆమెకి తెలుసు—"

"ఎలా తెలుసు?"

"చెప్తాను ఆగండి. నాథ్ క్షమాపణ చెప్పకోడని కూడా ఆమెకి తెలుసు గనుక మీ చెల్లెలు అతన్ని చంపడము ఖాయమని నమ్మకంగా తెలుసు. రాగిణి పారిపోయి కనిపెడ్తోందని నాథ్ కు ఫోన్ చేసి లాల్ మాట్లాడుతున్నప్పుడు అతనికి నాథ్ మాటలు సరిగా విన్పించలేదు.... గట్టిగా మాట్లాడమని నాథ్ కు పదేపదే చెప్పాడు. కానీ ఆ హడావిడిలో అసలు సంగతి లాల్ పసిగట్టలేదు. నేనూ పట్టించుకోలేదు. కానీ ఈ మధ్యాహ్నం పోస్టుమార్టమ్ లో హత్యలో ఇద్దరి పాత్ర వుందని తెలిసినప్పుడు-నా మెదడులో ఓ మెరుపు మెరిసింది—"

"ఏమిటది?"

"హత్యలో ఇద్దరి పాత్ర తెలిశాక నీలకున్న మోటివ్, అవకాశం ఆలోచించినప్పుడు; దాని బీజం ఎక్కడ వుందో

తెలిసిపోయింది! నిన్నటి లాల్—నాథ్‌ల ఫోన్ సంభాషణ అనుకోకుండా జ్ఞాపకమొచ్చింది. లాల్‌కు అవతలి మాటలు నార్మల్ స్థాయిలో విన్పించని కారణం అప్పుడు పసిగట్టాను. అవతల శబ్దాలేవీ లేవు. నాథ్ ఆఫీసు చాలా ప్రశాంత వాతావరణంలో వుంది. అందువల్ల అలా స్పీచ్ లో కావడం అవతల ఎవరో ఎక్స్‌టెన్షన్ ఎత్తడం వల్లేనని గ్రహించాను."

"అవును, ఆఫీసులో ఎక్స్‌టెన్షన్ వుంది."

"దటీజ్ రైట్. నీల ఎక్స్‌టెన్షన్‌లో ఆ మాటలు విన్నది. అప్పుడు రాగిణి గురించి తెలుసుకుంది.

"ఆఫీసునుంచి సాయంత్రం తిన్నగా హోటల్ కెళ్ళింది. అక్కడ తాను వెళ్ళడంలోని మోటివ్‌ని మరుగుపర్చడానికి, తన రాక అరవంతంగా కన్పించేలా స్నానం అదీ చేసి ముస్తాబయింది. అప్పుడు 'మామూలు'గా నాథ్‌కు ఫోన్ చేసి ఆశ్చర్యపర్చింది. అప్‌సెట్ చేసింది. రమ్మని అజ్ఞాపించింది.

"సరిగ్గా ఆమె అనుకున్నట్టుగానే నాథ్ నన్ను వదిలించుకుని వెళ్ళాడు. అంతే, అప్పుడంతా చకచకా జరిగిపోయింది.... అలా వచ్చే నాథ్‌ని ఆమె అనుకున్న ప్రకారం రాగిణి దార్లోనే చంపాలి. కానీ ఏ కారణంవల్లనైనా అవకాశం లేక అది జరక్కపోవచ్చు. హోటలు గదివరకూ ఆమె వెంటాడిరావచ్చు. అప్పుడెంత తెలివిగా చంపుతుందో ఎవరికి తెలుసు? ఆ నేరం తనమీదకే రావచ్చు. ఈ భయంతో, అనుమానంతో ఆమె రూంబాయ్ నెన్నుకుంది.

"ఈ రూంబాయ్ కామెపైన చాలారోజులుగా ఆలోచనలున్నాయి.... ఆమె పరిస్థితి వివరించి సహాయం కోరిన వెంటనే తన షరతుకూడా చెప్పి ఆమెని ఒప్పించాడు.

కానీ ఉదయం నాకిచ్చిన సాక్ష్యం సంగతి లక్ష్యపెట్ట
లేదు. ఆమె ఆ షరతు నిజంగా ఒప్పుకోలేదు. అలా నటించి
అతన్ని పురికొల్పింది.

"ఒకవేళ రాగిణి నాథ్‌ని పొడిచి పారిపోతే, అప్పు
డామె రెడ్‌హేండెడ్‌గా పట్టుబడితేనే తన కిలాటి
పోనీ, చిక్కులూ నిశ్చయంగా వుండవని ఆమె ఆలోచన.

"అలాగే రాగిణి ఆ గదివరకూ అనుసరించింది. బయట
బెల్ నొక్కి మెట్లదగ్గర వెళ్ళి దాక్కుంది. అది చివరి
అంతస్తు. చాలావరకు గదులు ఖాళీగా వున్నాయి. ఒకా
నొక గదిలో ఈ నాగేష్ వుండి, గమనిస్తున్నాడు. నాథ్
ఎప్పుడైతే తలుపు తెరిచి బయటకొచ్చాడో, రాగిణి గురి
చూసి కత్తి విసిరింది. బహుశా మొన్నసాయంత్రం అతని
బలం తెలిసి, దగ్గరికెళ్ళి పొడిస్తే అప్పటిలాగే విఫలమవు
తుందనుకుని వుంటుంది—అలా విసిరేసి అక్కడనుంచి
పరుగుతీసింది."

"అప్పుడు?"

"అది చూసిన నాగేష్ గాభరాచెందాడు. ఆ కత్తి
గుండెలో దిగబడలేదు. జారి కిందపడింది — నాథ్
బూటులో గుచ్చుకుంది. అలా జరగడం నాగేష్‌కు నచ్చ
లేదు. నాథ్ ప్రాణాలు పణంగా నీల ఒప్పుకున్న షరతు
గల్లంతవుతుందనుకున్నాడు. అలా జరగడం భరించలేదు.
ఆ అవకాశాన్ని అదృష్టాన్నీ ససేమిరా వదులుకోడు.
అందుకే తెగించి ముందుకొచ్చి, కత్తిని వేలిముద్రలు చెడ
కుండా కర్చీఫ్‌తో ఎత్తి నవ్వుతూనే పొడిచేశాడు—
రాగిణి చేసిన గాయంలోకి-బలంగా లోతుగా. వెంటనే
అక్కడనుంచి పరుగుతీసి రాగిణిని పట్టుకున్నాడు."

"వాడు! వాడెంతటి దుర్మార్గుడు."

"దుర్మార్గులకి దయ వుండదు. అలా జరిగి వుండవచ్చని వూహించాక మధ్యాహ్నం నీల ఇంటికి రహస్యంగా వెళ్ళాను. ఆమె బాగా తాగేసి పడుకుని వుంది. అదే సమయమనుకున్నాను నా అనుమానం తీర్చుకోడానికి. వెంటనే నాగేష్‌కు ఫోన్ చేసి, నా ఫ్రెండ్ సోనియాతో తాగిన గొంతుకతో నీలలా మాట్లాడించి, ఆమె ఇంటికి రప్పించాను. అంతే, వాళ్ళిద్దరు నేననుకున్నట్టుగానే నోళ్ళు పారేసుకుని సంకెళ్ళు తగిలించుకున్నారు."

"పాటిల్ గురించి చెప్పండి. అతనేం చేశాడు?"

జాన్ నవ్వాడు: "ఏమీ చేయలేదు. అతనికి కంపెనీ ప్రతిష్ట గురించి బెంగ ఎక్కువ. నాథ్‌ని రెడ్‌హేండెడ్‌గా పట్టుకోవాలన్న ఉబలాటంతో హోటలు కెళ్ళాడు. రిసెప్షన్‌లోనే తటపటాయిస్తూ వున్నాడు. ఇంతలో హత్య గురించి విని ఉబలాటం ఎగిరిపోయి అక్కడనుంచి ఉడాయించాడు. పైగా ఆఫీసుకొచ్చి మమ్మల్ని దబాయించాడు. వెల్, లాల్ శుభ్రంగా వాష్ చేసి పంపాడు. నిజంగా తనే హత్య చేశాడేమోనన్న భ్రమ కల్గించి వదిలాడు."

అనిత భారంగా నిట్టూర్చింది: "మరి రాగిణి....ఆమెనేలా....ఆమెనేం చేస్తారు?"

"అంతా జడ్జీ దయాదాక్షిణ్యాలపైన వుంది. హత్యాప్రయత్నంమీద స్వల్పంగా శిక్షించవచ్చు లేదా ఆమె మనోస్థితికి. జాలితలిస్తే క్షమించి వదిలేయనూవచ్చు.... మీరేమీ బెంగపడకండి. అసలు గండం తప్పింది."

"దాని సాహసబుద్ధీ, మొండిపట్టుదల వల్లనే ఇదంతా జరిగింది. నాథ్‌కా దుర్గతి పట్టిందంటే నాకు నిజంగా-"

"ఓ.కే! ఓ.కే! ఇంక బాధపడకండి. లాల్ మిమ్మల్నీ స్థితిలో చూడలేనన్నాడు. ఓదార్చి—కుదుటపర్చి రమ్మన్నాడు. స్త్రీలెవరైనా బాధపడితే అతను చూడలేడు. గజగజ వణికిపోతాడు" అన్నాడు జాన్.

"ఆనందంగా వుంటే కొయ్యబారిపోతాడా!" అంది అనిత బలవంతాన నవ్వు తెచ్చుకుంటూ.

—: ఐపోయింది :—

# దివాణంలో దొంగలు

## వసుంధర

"బెటర్ లేట్ దాన్ నెవ్వర్ అన్నాడో గొప్పవాడు. అందుచేత మనం పెళ్ళయిన మూడేళ్ళకు ఇప్పుడు హనీమూన్‌కు వెళ్ళటంలో తప్పులేదు. ఇంకా పిల్లలు లేక పోవటం మన అదృష్టం" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"హనీమూన్ అనకండి. తీర్థయాత్రలు అనండి. అప్పుడు మనకు త్వరగా పిల్లలయినా కలుగుతారు" అంది పద్మావతీదేవి నిట్టూరుస్తూ.

"దేవీ! నువ్వలా నిట్టూరిస్తే నాకు అవమానంగా వుంటుంది. ఈ హనీమూన్ ప్రోగ్రామ్ కోసమే మన పిల్లల కార్యక్రమం వాయిదా పడుతోంది. హనీమూన్ అంటే తీర్థయాత్ర అనే అర్థం. ఈ తీర్థయాత్ర దేవుడి కోసం కాదు. దేవుడితోటే జరుగుతుంది. దేవుడంటే నీ పతిదేవుడన్న మాట!" అన్నాడు వెంకన్న.

"అయితే మన ప్రయాణం యెప్పుడు?" అంది పద్మావతీదేవి.

"ఎప్పుడేమిటి? అప్పుడే టికెట్స్ బుక్ చేయటం కూడా అయిపోయింది. ఈనాటికి సరిగ్గా నాలుగో రోజు మనం నలుగురం బయల్దేరబోతున్నాం!" అన్నాడు వెంకన్న.

"నలుగు రెవరు?" అంది పద్మావతీదేవి కంగారుగా.

"నువ్వూ నేనూ నా అసిస్టెంటూ్స—" అన్నాడు వెంకన్న.

"ఆ సీతమ్మా, రాజమ్మానా—మధ్యలో వాళ్ళెందుకూ పానకంలో పుడకల్లాగా?"

"వాళ్ళు పానకంలో పుడకలు కారు దేవీ! ఎప్పుడైనా పానకంలో పుడకలు వస్తే ఏరి పారేయడానికే వాళ్ళను కూడా తీసుకు వస్తున్నాను—మరి నేను చాలా గొప్ప పేరున్న డిటెక్టివ్‌ను కదా! నా ఉనికి తెలిసిందంటే చాలు వందలాది కేసులు తగులుకుంటాయి. హనీమూన్‌లో అవన్నీ ఎక్కడ భరించగలను? అన్నీ వాళ్ళకు తోసేసి నేను నీతో గడుపుతాను. అర్థమైందా?" అనడిగాడు వెంకన్న.

పద్మావతీదేవి కళ్ళు చిట్లించి భర్తవంక అదోలా చూసి "నేను లేకపోయినా వుండగలరు కానీ మీరు వాళ్ళు లేక పోతే వుండలేరు. దారిలో మీ ప్రవర్తన హద్దు మీరిందంటే నేను సహించను" అంది.

"నీ సంగతి నాకు తెలియదా దేవీ! నేనంటే నీకున్నవన్నీ అపోహాలనే విషయం రుజువు చేయడానికి కూడా ఈ హనీమూన్ ట్రిప్ ఉపయోగపడుతుంది" అన్నాడు వెంకన్న.

"ఇంతకీ హనీమూన్ ట్రిప్ యెక్కడికి?" అంది పద్మావతీదేవి.

"రాజమండ్రి!" అన్నాడు వెంకన్న.

"ఏడిసినట్లుంది. ఈమాత్రం ప్రయాణానికి హనీమూన్ అన్న పేరు పెట్టటం కూడా ఎందుకు?"

"నువ్వు వద్దంటే ఇంకో పేరు పెడదాం. ట్రిప్ మాత్రం వద్దనకు" అన్నాడు వెంకన్న.

పద్మావతీదేవి అస్పష్టంగా ఏమో గొణుక్కుంది.

## 2

పద్మావతీదేవి కిటికీకి పక్కగా కూర్చుంది. వెంకన్న ఆమెకు పక్కగా కూర్చున్నాడు. వాళ్ళకు ఎదురుసీట్లలో సీతమ్మ, రాజమ్మ కూర్చుని వున్నారు.

పద్మావతీదేవి పరుగుడుతున్న రైల్లోంచి—పరుగెడుతున్నట్లు కనబడుతున్న జడపదార్థాల్ని చూసి ఆనందిస్తోంది. సీతమ్మ, రాజమ్మలకీ ప్రపంచం గుర్తున్నట్లులేదు. వాళ్ళిద్దరూ ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు.

వుంకన్న పక్కనే కూర్చున్న ఓ యువకుడు వాళ్ళిద్దర్నీ చూస్తూ మధ్యమధ్య తన చేతిలోని పుస్తకం వంక చూస్తున్నాడు. వెంకన్న ఆ పుస్తకం వంక చూశాడు. అది అపన.

"ఓసారి ఆ పుస్తకం ఇలా యిస్తారా?" అనడిగాడు వెంకన్న.

"ఇవ్వను. నేను చదువుతున్నాను" అన్నాడు ఆ యువకుడు. పుస్తకం తన దగ్గరున్నంతసేపూ అది చదువుతున్న వంకతో ఆడపిల్లల్ని చూడవచ్చునని అతడి ఆశ.

"నువ్వు చదువుతున్నట్లు లేదే?" అన్నాడు వెంకన్న.

"ఎందుకు చదవడంలేదు? నిక్షేపంలా చదువుతున్నాను" అన్నాడా యువకుడు.

వెంకన్నకింక తనను తాను పరిచయం చేసుకోవాలని

పించి—"నువ్వు అపనలు రెగ్యులర్‌గా చదువుతావా?" అనడిగాడు.

"అపన పుట్టినప్పట్నించీ ఇంతవరకూ ఒక్క పుస్తకం కూడా వదల్లేదు."

"అయితే నీకు డిటెక్టివ్ వెంకన్న తెలుసా?" అనడిగాడు వెంకన్న.

"వెంకన్నా—వాడెవరు?" అన్నాడు చిరాగ్గా ఆ యువకుడు.

వెంకన్న గతుక్కుమని—"వెంకన్న తెలియదా? ఓ గొప్ప డిటెక్టివ్!" అన్నాడు.

"నేనుండగా ఇంకెవడో గొప్ప డిటెక్టివ్ ఎలాగు ఔతాడు?" అన్నాడు ఆ యువకుడు.

"నువ్వు డిటెక్టివువా?" అన్నాడు వెంకన్న ఆశ్చర్యంగా.

"అవును. నా పేరు మార్తాండశాస్త్రి. తెలుగుదేశమంతా నా పేరు మార్మోగిపోతోంది" అన్నాడు ఆ యువకుడు.

అతడి దగ్గర తనగురించి చెప్పుకుని లాభంలేదని-"మీ గురించి నేనెప్పుడూ వినలేదు. మీరు పరిశోధించిన కేసులేమైనా వుంటే వివరాలు చెబుతారా?" అనడిగాడు.

"ఇంతవరకూ ఒక్క కేసుకూడా పరిశోధించలేదు. మొదటి కేసు పనిమీదనే ఇప్పుడు వెడుతున్నాను."

వెంకన్న నవ్వి—"ఒక్క కేసుకూడా పరిశోధించకుండా నీ పేరు తెలుగుదేశమంతా యెలా మార్మోగిపోతోంది?" అనడిగాడు.

"నాదంతా ముందుచూపు. నేను భవిష్యత్తులోకి చూసి మాట్లాడుతాను. ఇప్పుడు నేను చేపట్టిన కేసు రాజ

మండ్రీలో—ఒక జమీందారుకు సంబంధించినది—"
అన్నాడు మార్తాండశాస్త్రి.

"జమీందారుగారంటే - సుబ్బారాయుడుగారుగానీ కారుగదా" అన్నాడు వెంకన్న.

"అవును. సుబ్బారాయుడుగారే—నీకెలా తెలుసు?" అనడిగాడు మార్తాండశాస్త్రి ఆశ్చర్యంగా.

"నేనూ రాజమండ్రీయే వెడుతున్నాను. నా బస ఆ జమీందారు గారింట్లోనే" అన్నాడు వెంకన్న.

"జమీందారు సుబ్బారాయుడింటికి వెడుతున్నావా? ఎందుకు?" అన్నాడు మార్తాండశాస్త్రి.

"హనీమూన్!" అన్నాడు వెంకన్న.

మార్తాండశాస్త్రి చేయిజాపి — "విష్యూ బెస్టాఫ్ లక్!" అన్నాడు. వెంకన్న తనూ చేయిజాపాడు.

"ఇంతకూ జమీందారుగారికి డిటెక్టివులతో పనేమిటి" అన్నాడు వెంకన్న.

"అది రహస్యం. ఎవరికీ చెప్పకూడదు...." అన్నాడు మార్తాండశాస్త్రి.

ఈ సంభాషణ వింటున్న పద్మావతి ఉలిక్కిపడి భర్త కాలిమీద గిల్లింది. అది ఆమె పిలుపుగా గ్రహించి వెంకన్న ఆమెవైపు తిరిగాడు.

"మనం దిగే జమీందారు ఇంట్లోకే ఓ డిటెక్టివ్ వస్తున్నాడు. అంటే ఇదేదో నేర పరిశోధనకు సంబంధించిన విశేషమే! మీరు హనీమూన్ అన్నది అబద్ధం. ఆ డిటెక్టివులాగే మీరూ వెడుతున్నారు. అవునా?" అంటూ పద్మావతి భర్త చెవిలో కాస్త కోపంగా గొణిగింది.

వెంకన్న జవాబేం చెప్పకుండా కాస్త ఇబ్బందిగా మార్తాండశాస్త్రి వంక చూశాడు.

"ఏమిటి?" అన్నాడు శాస్త్రి.

"రహస్యం. చెప్పకూడదు" అన్నాడు వెంకన్న.

## 3

"జమీందారు గారూళ్ళో లేరు. మీకు మర్యాదలకు లోటు రావడానికి వీల్లేదని మరీ మరీ చెప్పి వెళ్ళారు" అన్నాడు దివాను రామన్న పంతులు.

వెంకన్నకు జమీందారుగారి దివాణంలో ఓ మంచి గది అన్ని సదుపాయాలూ వున్నది ఇవ్వబడింది. ఆ గది నానుకునే వున్న గదిలో సీతమ్మ, రాజమ్మల బస. రెండు గదులనూ కలుపుతూ ఒక తలుపుంది. ఆ తలుపును మూయడానికి వెంకన్న గదిలోంచే వీలవుతుంది.

"చూశారుగదా—మీరు అల్లరి చిల్లర వ్యవహారాలు చేయకండి. నే నెప్పుడు కావాలంటే అప్పుడు మీ గదిలోకి రాగలను" అంటూ వెంకన్న హెచ్చరించాడు తన అసిస్టెంట్సును.

"డిటెక్టివ్ వెంకన్నగారి అసిస్టెంట్లు అల్లరి చిల్లర పనులు చేస్తే అది మీకే అవమానం" అంది సీతమ్మ.

"డిటెక్టివూ, అసిస్టెంట్సూ అన్న మాట మరిచిపోండి. మన మిక్కడికి జాలిగా గడపడానికి వచ్చాం. మీరు నా అసిస్టెంట్సు కాదు, మరదళ్ళు" అన్నాడు వెంకన్న.

వాళ్ళు గదిలోంచి వెళ్ళిపోగానే పద్మావతీదేవి విసుగును ప్రదర్శించి "మీ అసిస్టెంట్సును మీరు చెల్లెళ్ళుగా భావించలేరా?" అనడిగింది.

"డిటెక్టివ్ వెంకన్న నిజం చెప్పే మనిషి. అతని పెదవులపై ఒక మాట, మనసులో ఒకమాట వుండదు. ఎప్పుడయినా నా మనసు చలిస్తే కనీసం దానికి సమాధాన మిచ్చుకోవాల్సిన అవసరముండదు. అందుకే ఈ

వరస. అయితే నువ్వు నా చుట్టూ గీసిన గీత వుండనే ఉంది. సీత గీత దాటింది కానీ నేను ఆ గీత దాటలేదు. అందువల్ల ఈ వరస నిన్ను బాధించదు. ఎంతసేపూ ఈ అనుమానాలు పెట్టుకోకు. హాయిగా కబుర్లు చెప్పు" అన్నాడు వెంకన్న.

"ఏం కబుర్లు చెప్పను?" అంది పద్మావతీదేవి.

"మన తొలి రాత్రుల గురించి మాట్లాడు...." అన్నాడు వెంకన్న.

"తప్పకుండా మాట్లాడతాను. కానీ అంతకు ముందు మీరు నా ప్రశ్నకు బదులివ్వాలి!" అంది పద్మావతీదేవి.

"నా సర్వస్వం నీకు అర్పించుకున్నాను. నీకామాత్రం బదులివ్వలేనా?" అన్నాడు వెంకన్న.

"అయితే నా కళ్ళల్లోకి చూసి నిజం చెప్పండి. మనమీ జమీందారుగారింటికి ఎందుకొచ్చాం?" అంది పద్మావతి.

"ఈ ప్రశ్నకు తప్పక బదులిస్తాను. అందుకు కాస్త వ్యవధి కావాలి!" అన్నాడు వెంకన్న.

"నేను వ్యవధి యివ్వను...." అంది పద్మావతీదేవి.

"అయితే నేను బదులు ఇవ్వలేను...." అన్నాడు వెంకన్న.

పద్మావతీదేవి అలిగింది. వెంకన్న బ్రతిమాలాడు. ఆమె లొంగలేదు. తన మంచాన్ని కాస్త దూరంగా జరుపుకుని పడుకుందామె.

## 4

ఒక రాత్రివేళ వెంకన్న లేచి టైము చూసుకున్నాడు టైము పన్నెండు దాటింది. అతను పద్మావతిని సమీపించాడు. ఆమె నిద్రపోతున్నట్లు గ్రహించాడు. అయినా

నమ్మకం కోసమో ఏమో-క్లోరోఫాంలో తడిపిన గుడ్డ ఆమెకు వాసన చూపి స్పృహ కూడా తప్పించి తలుపు తీసుకుని పక్క గదిలోకి వెళ్ళాడు.

అతను వెళ్ళేసరికి సీతమ్మ, రాజమ్మ చెరో మంచం మీదా వళ్ళు తెలియని నిద్రలో వున్నారు. వెంకన్న రాజమ్మను తట్టి లేపాడు. రాజమ్మ ఫులిక్కిపడి లేచి "మీరా?" అంది.

"నిద్ర పోతున్నా వేమిటి? టయిము పన్నెండు దాటింది" అన్నాడు వెంకన్న.

రాజమ్మ కింకా నిద్రమత్తు వదల్లేదు. మత్తుగా ఆవ లించి-"రాత్రి పన్నెండింటికి నిద్రపోకుండా మెలకువగా వుంటారా?" అంది. వాక్యం పూర్తి చేసేసరికి ఆమెకు మెలకువ వచ్చి "సారీ బాస్!" అని లేచి నిలబడింది.

రాజమ్మ వెంటనే బాత్రూమ్‌కు వెళ్ళి బట్టలు మార్చు కుంది. తర్వాత వెంకన్న, ఆమె కలిసి జమీందారు తోట లోకి విహారానికి వెళ్ళారు.

దివాణానాన్నానుకుని వున్న ఆ తోట చాలా పెద్దది. వెంకన్న, రాజమ్మ వుత్సాహంగా ఆ తోటంతా విహ రించారు. వారి వుత్సాహం చూస్తుంటే వాళ్ళిద్దరికీ అది రాత్రి అనిపిస్తున్నట్లు లేదు.

అలా ఇద్దరూ తిరుగుతూండగా వెంకన్నకు ఓ చెట్టు చాటున ఓ మనిషి నిలబడ్డట్లు అనిపించింది. అతను చటు క్కున ఒక్క అంగలో వెళ్ళి ఆ మనిషిని పట్టుకున్నాడు. ఆ మనిషి గుంజుకున్నాడు కానీ వెంకన్న పట్టునుంచి తప్పించుకోలేకపోయాడు. వెంకన్న అతణ్ణి కాస్త వెలుగులోకి లాగి "నువ్వా — మార్తాండశాస్త్రీ?" అన్నాడు.

మార్తాండశాస్త్రి అతణ్ని గుర్తుపట్టి—"ఈ సమయంలో నువ్విక్కడేం చేస్తున్నావు?" అన్నాడు.

"అదే నేనూ నిన్నడగాలనుకుంటున్నాను" అన్నాడు వెంకన్న.

"నేను డిటెక్టివును. మరి నువ్వు?"

"నేను ప్రేమికుణ్ని!" అన్నాడు వెంకన్న.

అప్పుడు మార్తాండశాస్త్రి రాజమ్మను చూసి "ఈమె ఎవరు? నీ భార్యలా లేదే?" అన్నాడు. ఆమె ఎవరో మార్తాండశాస్త్రి గుర్తుపట్టాడు. రైలు ప్రయాణంలో సీతమ్మ, రాజమ్మల రూపాలు అతని హృదయంలో ముద్ర వేసుకుపోయాయి.

"ఈమె నా మరదలు. మా ఇద్దరివీ ఒకేరకం అభిరుచులు. మేము మనసు విప్పి ఒకరితో ఒకరు మాట్లాడుకోవాలంటే ఇలాంటి స్థలమూ, సమయమూ కావాలి మాకు. మమ్మల్నిలా చూసినట్లు ఎవరికీ చెప్పకు. నీ డిటెక్షన్ జోలికి నేను రాను...."

మార్తాండశాస్త్రి అదోలా వెంకన్న వంక చూసి—"నీతి తప్పి చరించేవాళ్ళను నేను క్షమించను...." అన్నాడు.

"నేను నీతి తప్పినట్లు రుజువయితే అప్పుడు శిక్షించుదువుగాని. మేము కోరే అనుభవం వేరు. పారలౌకికమైనది. అది నీ కర్థంకాదు" అన్నాడు వెంకన్న.

ఏమనుకున్నాడో మార్తాండశాస్త్రి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోగానే వెంకన్నగానీ, రాజమ్మగానీ ఆ విషయమే మాట్లాడలేదు. వాళ్ళ చుట్టూ వున్న చెట్ల గురించీ, నేలమీది పచ్చిక గురించీ, ఆకాశంలో చుక్కల గురించీ ఏమేమో మాట్లాడుకుని ఆనందించారు. అలసట

అన్నది లేకుండా వనవిహారం చేశారు. తెల తెలవారుతున్న దనగా ఇద్దరూ తమ తమ గదులలోకి పోయి పడుకు న్నారు. రెండు గదులకూ మధ్య తలుపు గడియ వేయటం మాత్రం వెంకన్న మరిచిపోలేదు.

## 5

"ఇంకా ఎంత సేపండీ మొద్దునిద్దర.... లేవండి!" అంది పద్మావతీదేవి. అప్పటికామె లేచి స్నానంచేసి బట్టలు మార్చుకోవడం కూడా అయింది.

"నువ్వు నన్ను కరుణించలేదు. రాత్రి తెల్లవార్లూ నిద్రలేదు. నన్ను మరికాసేపు పడుకోనివ్వు" అన్నాడు వెంకన్న.

"రాత్రి దెబ్బలాడ్డానికీ—పగలు పడుకోడానికీ— ఇదేనా హనీమూన్ అంటే?" అంది పద్మావతి.

వెంకన్న చటుక్కున లేచి కూర్చున్నాడు. చక చకా కాలకృత్యాలు తీర్చుకున్నాడు.

టైము తొమ్మిదయ్యేసరికి దివాను రామన్న పంతులు వచ్చాడు. "టిఫిను గదికి పంపించమంటారా?" అన్నది ఆయన ప్రశ్న.

"మాకీ మర్యాద లేమిటండీ?" అన్నాడు వెంకన్న.

"ఏడు గంటలకోసారీ, ఎనిమిది గంటలకోసారీ మనిషి వచ్చి వెళ్ళాడు. మీరు లేవలేదని చూసి...." అని పద్మావతీదేవి భర్తవంక నిష్ఠూరంగా చూసి ఇంకా ఏదో అనబోతూండగా—

"ప్రయాణం బడలిక కదమ్మా-వారినేమీ అనకండి" అన్నాడు రామన్న పంతులు నవ్వుతూ.

"చూశావా, నువ్వు నన్నేదో అనబోతున్నావని

వారికూడా తెలిసిపోయింది" అన్నాడు వెంకన్న.

టిఫిన్లయ్యాక జమీందారుగారి కారులో వెంకన్న, పద్మావతీదేవి ఊరు చూడ్డానికి వెళ్లారు. చిత్రాంగి మేడ, సారంగధరుడి మెట్ట, కోటిలింగాల రేవు, పేపరు మిల్లు, విక్రమ మహలు, వగయిరాలన్నీ చూసేక గోదావరి ఒడ్డునే పయానించి మార్కండేయ గుడి, పుష్కరాల రేవు చూశారు. అందరూ చెప్పుకొనే గౌతమీ జీవ కారుణ్య సంఘం భవనాన్ని మొదటిసారిగా చూసింది పద్మావతి. కోట గుమ్మంవద్ద కొత్తగా వచ్చిన గంగ ప్రవహించే శివుడి విగ్రహం, ప్రకాశం విగ్రహం చూసింది.

పద్మావతికి రాజమండ్రి కొంత తెలుసు. ఆమె బంధువులు ఇన్నీసుపేటలో వుండేవారు. సినిమాహాళ్ళు, లాంచీల రేవు, మెయిన్ రోడ్డు బాగా తెలుసు ఆమెకు. రాజమండ్రి అంటే అంతేననుకున్నదామె.

"ఊళ్ళను మన వూరనుకుని చూడకూడదు. గైడ్సు చెప్పే కథల్లోంచీ, కెమేరా ఫ్రేముల్లోంచీ, కారు కిటికీల్లోంచీ జూడాలి. అప్పుడే వాటి అందాలు రెట్టింపవుతాయి" అన్నాడు వెంకన్న.

కార్లో ధవళేశ్వరం వెళ్ళి పాత ఆనకట్ట, కొత్తగా కడుతున్న బ్యారేజీ చూశారు. ఇవన్నీ చూసి ఇంటికి వెళ్ళేసరికి ఒంటి గంటయింది.

ఇంటికి వెళ్ళేసరికి అక్కడ సీతమ్మ ఒక్కర్తే వుంది.

"నన్నొకర్తెనూ వదిలేసి మీరంతా వెళ్ళిపోయారు. నాకు చాలా బోరు కొడుతోంది" అంది సీతమ్మ.

"రాజమ్మ ఏమయింది?" అన్నాడు వెంకన్న.

"ఎవరో మార్తాండశాస్త్రి—మనకు రైల్లో తగిలాడూ

అతనొచ్చి కంపెనీ అడిగాడు. తను రానంది. రహస్యం చెప్పేస్తానని బెదిరించాడు. వెళ్ళిపోయింది. నాకేం అర్థం కాలేదు" అంది సీతమ్మ.

"అతను డిటెక్టివ్! రాజమ్మ చేసిన ఏదో తప్పు అతనికి తెలిసి వుంటుంది. అందుకే ఆమెను బెదిరించాడు. ఇదే నీకూ గుణపాఠం. ఎప్పుడూ తప్పులు చెయ్యకు. లేకపోతే డిటెక్టివ్ లకు కంపెనీ ఇవ్వాల్సి వుంటుంది" అన్నాడు వెంకన్న.

"మీకు కంపెనీ ఇవ్వడానికి నాకేం అభ్యంతరం లేదు" అంది సీతమ్మ.

పద్మాదేవి ఆమె వంక గుడ్లురిమి చూసింది. ఈలోగా అందరికీ భోజనాలకు పిలుపు వచ్చింది.

ఆ రాత్రి భార్యాభర్తలు దెబ్బలాడుకోలేదు. ఇద్దరూ సరదాగా గడిపారు. తిరిగి తిరిగి అలసివున్న మీదట టైము తొమ్మిది దాటేసరికల్లా పద్మావతి నిద్రకు పడింది. వెంకన్న మాత్రం పన్నెండువరకూ పడుకుని లేచిపోయాడు. పద్మావతీదేవికి స్పృహ తప్పించి పక్కగదిలోకి వెళ్లాడు. అక్కడ ఈ రోజు సీతమ్మ మాత్రం వుంది.

వెంకన్న ఆమెను లేపి "అలా కాసేపు వెళ్ళి తోటలో తిరిగొద్దాం" అన్నాడు.

సీతమ్మ త్వరగానే సిద్ధపడింది. ఇద్దరూ తోటలోకి వెళ్లారు. కాసేపు అలా తిరిగేసరికి వారికి ఓ జంట ఎదురైంది. వాళ్ళు మార్తాండశాస్త్రి, రాజమ్మ.

మార్తాండశాస్త్రి తీవ్రంగా వెంకన్న వంక చూసి—"నిన్న ఆ మరదలితో తిరిగావు. అందుకు కారణం ఇద్దరి అభిరుచులూ ఒకటి కావడమని అన్నావు. ఈ వేళ

ఈ మరదళ్ళేసుకుని బయల్దేరావు. కట్టుకున్న దానికి అన్యాయం చేయడానికి నీకు బుద్ధి లేకపోతే పెళ్ళాడాల్సిన ఆడపిల్లలు—వీళ్ళబుద్ధేమయింది?" అన్నాడు.

"నా మరదళ్ళు. నా యిష్టం...." అన్నాడు వెంకన్న.

"సరే—ఈ ముక్కే రేపు నీ భార్య దగ్గర అనువుగాని" అన్నాడు మార్తాండశాస్త్రి.

"చూడు నాయనా! నువ్వు నామీద డిటెక్షన్ చేయడానికే ఇక్కడ తిరుగుతున్నావా?" అన్నాడు వెంకన్న.

"లేదు. నువ్వే నా పనికి అడ్డు తగులుతున్నావు" అన్నాడు శాస్త్రి.

"చూడు బాబూ! నీ పనేమిటో నాకు చెబితే అది నేనే చేసిపెడతాను. దయచేసి మా ఆనందానికి అడ్డు రాకు. మా వ్యవహారాల్లో జోక్యం చేసుకోకు" అన్నాడు వెంకన్న.

రాజమ్మ చటుక్కున వెంకన్న పక్కకు వచ్చి "ఇతను చాలా బోర్ బావా! రోజంతా నాకు శీలం పవిత్రత గురించి ఉపన్యాసం దంచాడు. కుర్రాడు కదా అని సరదాపడితే ఒక్క మంచి కబురయినా చెప్పలేదు" అంది.

"ఇదే ఆఖరి వార్నింగ్! మీరు వనవిహారానికీ రోజుతో స్వస్తి చెప్పాలి. లేకపోతే విషయం పద్మావతీదేవికి చెప్పాల్సి వుంటుంది" అన్నాడు మార్తాండశాస్త్రి.

"నా భార్య పేరు కూడా తెలుసుకున్నావా?" అన్నాడు వెంకన్న ఆశ్చర్యంగా.

"పరిశోధన నా వృత్తి" అంటూ గర్వంగా మీసం మెలేశాడు శాస్త్రి.

రాజమ్మ, సీతమ్మ వెంకన్న తిరుగుముఖం పట్టాక—"ఈ మార్తాండశాస్త్రి ఎవరో తెలియటంలేదు" అంది సీతమ్మ.

"అతనెవరయినా మనల్ని వనవిహారం చేయనిచ్చేలా లేడు! ఇందుకేదయినా ఉపాయం చూడాలి" అన్నాడు వెంకన్న.

## 6

"వీరు జమీందారుగారి బావమరిది. పేరు సూరపరాజు. మీ గురించి తెలుసుకోవాలనుకుంటున్నారు." అన్నాడు రామన్నపంతులు.

వెంకన్న సూరపరాజువంక పరీక్షగా జూశాడు. మనిషికి యాభై ఏళ్ళుండవచ్చు. బుర్రమీసాలు. కళ్ళలో ఎరుపు జీర వుంది. చూపులు ప్రసన్నంగా లేవు.

"నా పేరు వెంకన్న. ఆమె నా భార్య పద్మావతీదేవి. వీళ్ళు నాకు మరదళ్ళు సీతమ్మ, రాజమ్మ" అన్నాడు వెంకన్న.

"రాజమండ్రీ దేనికి వచ్చారు?" అన్నాడు సూరపరాజు.

"ఊరు చూడ్డానికి ..."

సూరపరాజు డబ్బాలో రాళ్ళు పోసి కుదిపినట్లు నవ్వి "ఇంకా ఎన్ని రోజులుంటారు?" అనడిగాడు.

"జమీందారుగారు వచ్చేదాకా...." అన్నాడు వెంకన్న.

"జమీందారుగారు వెంటనే రాకపోతే...." అన్నాడు సూరపరాజు.

"ఆయన వచ్చేదాకా మేము ఇక్కడే వుంటాం" అన్నాడు వెంకన్న.

మళ్ళీ సూరపరాజు నవ్వాడు. ఈసారి ఆ నవ్వు ట్రాక్టరు కంకరరోడ్డుపైన నడుస్తున్నట్లుంది "ఆయన ఏడాదిదాకా రాడుట. ఇప్పుడే వుత్తరం వచ్చింది" అన్నాడు.

"జమీందారుగారెంత ధర్మాత్ములు? ఏడాదిపాటు మాకిక్కడ ఆతిథ్యం ఇవ్వాలనుకోవడం ఈ రోజుల్లో చాలా పెద్ద విశేషం కదండీ—ఏమంటారు?" అన్నాడు వెంకన్న.

ఈసారి సూరపరాజు పకపకా నవ్వలేదు. "సరదా కన్నాను. ఏ ఉత్తరమూ రాలేదు. జోకులేయటం నాకు సరదా" అన్నాడు.

వెంకన్న యెన్నడూ లేనిది కొత్తరకంగా రాళ్ళు గల గలలాడించినట్లు నవ్వి—"జోకులేసే వాళ్ళచేత నిజాలు చెప్పించడం నాకు హాబీ. మీరూ నాలుగురోజు లిక్కడుండండి. మనిద్దరికీ మంచి కాలక్షేపం...." అన్నాడు.

సూరపరాజు ముఖం ముడుచుకుని అక్కణ్నించి లేచి వెళ్ళిపోయాడు.

## 7

ఆ రాత్రి పన్నెండు గంటలకు వెంకన్న భార్యను లేపాడు.

"ఏమిటండీ" అంది పద్మావతీదేవి చిరాగ్గా.

"సరదాగా వనవిహారం చేద్దాం—" అన్నాడు వెంకన్న.

"ఈ రాత్రివేళ మీకేమైనా మతిపోయిందా?" అంది పద్మావతి.

"మనం హనీమూన్ కెందుకొచ్చాం? ఇలా ఎంజాయ్ చేయడానికే!" అంటూ ఉత్సాహపరిచాడు వెంకన్న.

చివరకు ఆమె సిద్ధపడింది. ఇద్దరూ వనవిహారానికి బయల్దేరారు. కాసేపటికి మార్తాండశాస్త్రి వాళ్ళకి యెదురు పడ్డాడు.

"ఇతన్నెక్కడో చూసినట్లుందండీ!" అంది పద్మావతీ దేవి.

"నువ్వు నన్ను రైల్లో చూశావు. కానీ నేను నీ భర్తను రోజూ ఈ తోటలో చూస్తూనే వున్నాను" అన్నాడు మార్తాండశాస్త్రి. అతను కోపంగా వెంకన్న వంక చూశాడు.

వెంకన్న నవ్వి—"ఇంకానయం రోజుకొకరు చొప్పున ఇక్కడ నా మరదళ్ళతో తిరుగుతూండగా చూశానన్నావు కాదు" అన్నాడు.

"అదే అంటాను" అన్నాడు మార్తాండశాస్త్రి.

"ఇతనితో మనకేమిటి దేవీ! ఒకసారి ముఖం చూడగానే వాళ్ళు చెప్పబోయే అబద్దాలు కూడా చెప్పగలను నేను. అదే నన్ను కాపాడింది. లేకపోతే నా భార్యే నన్ను అనుమానించేది" అన్నాడు వెంకన్న.

"పద్మావతీదేవీ! నీ భర్త మోసగాడు. ఒకరోజు సీతమ్మతోటీ, ఒకరోజు రాజమ్మతోటీ నీ భర్త ఈ తోటలో తిరగడం నేను కళ్ళారా చూశాను" అన్నాడు శాస్త్రి.

"ఇతను మన రాజమ్మమీద కన్నేశాడు. ఇతడి సంగతి తేల్చుకోవాలని రాజమ్మ ఇతడితో వెళ్ళింది. తనకు లొంగకపోతే మనమీద అభాండం వేస్తానని బెదిరించాడుట. ఆమె లొంగలేదుట. మా పద్మావతీదేవి అలాంటి అభాండాలను నమ్మదని నవ్విందట. ఇతనిప్పుడు తన కసి తీర్చుకుంటున్నాడు" అన్నాడు వెంకన్న.

పద్మావతి అదోలా మార్తాండశాస్త్రి వంక చూసి—
“మనం పోదాం-పదండి!” అంది.

“అయితే వన విహారం మానవా?” అన్నాడు మార్తాండశాస్త్రి.

జవాబుకూడా ఇవ్వకుండా ఆ దంపతులు అక్కణ్నించి కదిలారు. వెంకన్న ఆమెనా విషయంనుంచి మరిపించడానికి ఏవో ఇతర విశేషాలు చెప్పసాగాడు. అలా ఇద్దరూ కాసేపు తిరిగాక ఉన్నట్లుండి పద్మావతీదేవి కెవ్వుమని అరిచి—భర్తకు బల్లిలా అంటుకుపోయింది. వెంకన్న ఆమె చూసిన దిక్కుగా చూశాడు.

అక్కడ పోతపోసిన కంచు విగ్రహంలా వున్న ఓ నల్లటి భయంకరాకారుడున్నాడు. అతడి ముఖంలోని పళ్ళు, చేతిలోని కత్తి—తళతళమని మెరుస్తున్నాయి.

“ఎవరది?” గద్దించాడు వెంకన్న.

ఆ వ్యక్తి నాలుగడుగులు ముందుకు వేసి — “నన్ను చూసి భయపడి పారిపోకుండా—యెవరది అని అడుగుతున్నావు. ప్రాణాలమీద ఆశ లేదా?” అన్నాడు. అతడి కంఠం రూపం వున్నంత భయంకరంగా లేదు.

“నువ్వు నాతో మద్రాసు వస్తావా? సినిమాలో వేషం ఇప్పిస్తాను” అన్నాడు వెంకన్న.

“వేళాకోళంగా వుందా?” అన్నాడా భయంకరాకారుడు.

“నేను వేళాకోళాలాడను. నీలాంటివాడికోసమే మన చిత్రసీమ యెదురుచూస్తోంది. శ్రీదేవిని రేప్ చేసే సీన్లో యాక్ట్ చేసే అవకాశం ఇప్పిస్తాను. వస్తావా” అన్నాడు వెంకన్న.

భయంకరాకారుడు కత్తి మొలలో దోపుకుని—“ఎవ

ర్నవ్వు? సినిమా నిర్మాతవా?" అన్నాడు.

"నిర్మాతను కాను కానీ చాలామంది నిర్మాతలకు నా మాట వేదవాక్కు. ఇంతకీ నువ్వెవరు? ఈ తోటలో కత్తి పట్టుకుని తిరుగుతున్నావు!" అన్నాడు.

"నేను పేరెవరికీ చెప్పను. కత్తిమాత్రం మనుషుల ప్రాణాలు తీయడానికి వాడతాను. నీకు ప్రాణాలమీద ఆశ వుంటే మళ్ళీ నాకు ఈ తోటలో కనబడకు" అన్నాడా భయంకరాకారుడు.

"నేను తోటలో తిరిగితే నీకేం? అది నా యిష్టం."

"ఇది నీ తోటకాదు" అన్నాడు భయంకరాకారుడు.

"నా తోట కాదు కానీ ఇది నీ తోటకూడా కాదు. ఇది జమీందారుగారి తోట. నేనాయన అతిధిని—" అన్నాడు వెంకన్న.

"తోట నాదైనా కాకపోయినా నేనున్నచోట కింకొకళ్ళు రావడం ఇష్టముండదు నాకు. నాలుగురోజుల దాకా నాకిక్కడ రాత్రిళ్ళు పని వుంటుంది. అంతవరకూ ఇక్కడకొచ్చి ప్రమాదాన్ని కొని తెచ్చుకోకు."

"ఏమిటి నీ పని?"

"అది నీకు చెప్పేదికాదు" అన్నాడు భయంకరాకారుడు.

"మనం పోదాం పదండి!" అంది పద్మావతీదేవి.

వెంకన్న వెనక్కు తిరిగాడు. కొంతదూరం నడిచాక- "భయపడ్డావా?" అనడిగాడు భార్యను.

"లేదు. కానీ ఆ మనిషిని యెక్కువసేపు చూడ్డం ఇష్టం లేకపోయింది" అంది పద్మావతీదేవి.

"నువ్వా మనిషని బాగా చూశావు కదూ?" అనడిగాడు వెంకన్న.

"మాతాను. ఏం?" అంది పద్మావతీదేవి ఆశ్చర్యంగా.

"అయితే గదికి వెళ్ళగానే వాడి బొమ్మ వెయ్యాలి నువ్వు" అన్నాడు వెంకన్న.

"ఎందుకు?" అంది పద్మావతీదేవి ఆశ్చర్యంగా.

"అలాంటి భయంకర రూపం అరుదు. ఏ సినిమావాళ్ళకైనా చూపిస్తే మేకప్‌కైనా పనికొస్తుంది" అన్నాడు వెంకన్న ఆలోచిస్తూ.

భర్త ఉద్దేశ్యం అది కాదని పద్మావతీదేవికి తెలుసు.

# 8

టిఫిన్‌లయ్యాక సూరపరాజు వెంకన్నతో—"మీతో ఓ పది నిముషాలు మాట్లాడాలి. అలా బైటకు వస్తారా?" అనడిగాడు.

"వెతకబోయిన తీగ కాలికి తగలడమంటే ఇదే కాబోలు. నేనూ మీతో మాట్లాడాలనుకుంటున్నాను" అన్నాడు వెంకన్న గంభీరంగా.

ఇద్దరూ దొడ్డివైపు నడిచారు.

"మీరు నాతో ఏం మాట్లాడాలనుకుంటున్నారు?" అనడిగాడు సూరపరాజు.

"ముందు మీరు చెప్పదలచినది చెప్పండి!"

సూరపరాజు ఇబ్బందిగా నవ్వి — "మీరు రాత్రిళ్ళు పడుకోరా?" అనడిగాడు.

"పడుకుంటాను. కానీ రాజమండ్రి వచ్చింది పడుకుందుకు కాదు. రాత్రిళ్ళు మెలకువగా వుండి వనవిహారం చేయడానికే! అందుకే జమీందారుగారిల్లు ఎన్నుకున్నాను. ఆయన దయతో అంగీకరించారు" అన్నాడు వెంకన్న.

"కానీ మా తోట వనవిహారానికి అనుకూలమైనది కాదు. రాత్రిళ్ళు మేమే అందులోకి వెళ్ళం. మీరు అందు

లోకి వెడుతున్నారని తెలిసింది. మీకేదైనా అయితే జవాబుదారీ మాదికదా! అందుకని....” అని ఆగాడు సూరపరాజు.

వెంకన్న నవ్వి — “ఈ విషయమే నేనూ మీతో మాట్లాడాలనుకుంటున్నాను. మీ తోట ప్రమాదకరంగా పరిణమించడానికి ప్రత్యేకమైన కారణమంటూ ఏమైనా వున్నదా?” అనడిగాడు.

“జమీందారుగారి అలక్ష్యం—” అన్నాడు సూరపరాజు.

“జమీందారుగారి అలక్ష్యంకంటే మరికొందరి అమిత శ్రద్ధ అందుకు కారణమని నాకు తోస్తోంది” అన్నాడు వెంకన్న.

సూరపరాజు చురుగ్గా వెంకన్నవంక చూసి—“అమిత శ్రద్ధ యెవరిదంటారు, దేనికంటారు?” అనడిగాడు.

“నిన్నగాక మొన్న వచ్చినవాణ్ని. ఆ విషయం నాకేం తెలుస్తుంది?” అన్నాడు వెంకన్న.

“మీరు నిన్నగాక మొన్న ఇక్కడకు వచ్చారు. రేపు కాక ఎల్లుండి వెళ్ళిపోతారు. ఆ విషయం గుర్తుంచుకుని మరీ రాత్రిళ్ళు వనవిహారాలు చేయండి” అన్నాడు సూరపరాజు.

“నా వనవిహారంపట్ల మీకింత అమిత శ్రద్ధ ఎందుకు?” అన్నాడు వెంకన్న అమిత శ్రద్ధ అన్న పదాన్ని ఒత్తి పలుకుతూ.

“నేనింక మీతో మాట్లాడవలసిన దేమీ లేదు—” అన్నాడు సూరపరాజు.

ఇద్దరూ మళ్ళీ లోపలకు వచ్చేశారు.

## 9

రాత్రి పన్నెండుగంటల సమయం.

వెంకన్న లేచి తలుపు తీసుకుని పక్కగదిలోకి వెళ్ళి సీతమ్మ, రాజమ్మలను లేపి—"పద్మావతి జాగ్రత్త!" అని చెప్పి బయటకు వెళ్ళిపోయాడు.

సీతమ్మ, రాజమ్మ ఇద్దరూ వెంకన్న గదిలోకి వచ్చి అక్కడున్న వెంకన్న మంచంమీద పడుకున్నారు. ఇద్దరికీ తొందరగానే మళ్ళీ నిద్ర వచ్చేసింది.

అలా యెంత సేపు పడుకున్నారో తెలియలేదు.

ఓ రాత్రివేళ యెవరో తలుపుతట్టిన శబ్దం వినిపించింది.

ముందు పద్మావతికే మెలకువ వచ్చింది. ఆమె కళ్ళు నులుముకుని లేచి పక్కలో వున్న సీతమ్మ, రాజమ్మలను చూసి ఆశ్చర్యపడింది. ఈలోగా వాళ్ళకూ మెలకువ వచ్చింది.

"అయ్యనేరీ? గదిలోకి మీరెలా వచ్చారు?" అంది పద్మావతి.

"ఆయన వనవిహారానికి వెళ్ళారు. మేం మీకు సాయం పడుకున్నాం" అంది రాజమ్మ.

తలుపు మళ్ళీ చప్పుడయింది.

"వెంకన్నగారే అయుంటారు" అంటూ రాజమ్మ వెళ్ళి తలుపు తీసింది.

గడియ తీయడమేమిటి — తలుపు ఒక్క ఉదుటున తెరుచుకుంది. రాజమ్మ వెనక్కి వెల్లకితలా పడింది. ఆమె లేచేలోగా తలుపుకు మళ్ళీ గడియపడింది.

గదిలోకి ఇద్దరు వస్తాదులు అడుగుపెట్టారు. వాళ్ళిద్దరూ కూడా చిన్న నిక్కర్లు వేసుకుని వున్నారు. చొక్కాల్లేవు. నూనెరాసినట్లు కండలు నిగనిగా మెరుస్తున్నాయి.

పద్మావతి వాళ్ళెవరని అడుగుదామనుకుంది. కానీ గొంతు పెగలలేదు.

"గదిలో మగవాళ్ళెవరూ లేరా?" అన్నాడో వస్తాదు మీసం మెలివేస్తూ.

"లేరు. మొత్తం అయిదుగురం ఆడవాళ్ళం వున్నాం" అంది సీతమ్మ.

వస్తాదు కోపంగా చేతులు కదిపి కండలు కదిలించి—"ఎంత పొగరు నీకు?" అన్నాడు.

అప్పటికి రాజమ్మ లేచి నిలబడి-"పొగరు నాక్కూడా వుంది" అంది.

"మీ పొగరుతో మాకు పనిలేదు—" అన్నాడు వస్తాదు.

"మీరీ గదిలోకి యెందుకొచ్చారు?" అంది సీతమ్మ.

"ఆడాళ్ళున్న గదిలోకి మగాళ్ళు యెందుకొస్తారు?" అన్నాడు వస్తాదు వెకిలిగా నవ్వి.

పద్మావతి కెవ్వుమని అరిచింది.

"అరవకు. అరిస్తే పొడిచి చంపేస్తాను" అంటూ చేతిలో కత్తి తళుక్కుమనిపించాడు వస్తాదు.

"మేముండగా అది నీకు సాధ్యంకాదు" అంది రాజమ్మ.

"ఈ రాజమండ్రీలో మమ్మల్నెదిరించి నిలబడగల మగాదేలేడు...." అన్నాడు వస్తాదు గర్వంగా.

"మాది రాజమండ్రీ కాదు" అంది సీతమ్మ.

వస్తాదు ముఖం ఎర్రబడింది. అతడు కండలు పొంగించి సీతమ్మమీదకు వెళ్ళాడు.

పద్మావతి మళ్ళీ కెవ్వుమని అరిచింది.

# 10

"ఈ రోజు మళ్ళీ వచ్చావేం?" అన్నాడు మార్తాండ శాస్త్రి.

"రోజూ వస్తాను" అన్నాడు వెంకన్న.

"నా హెచ్చరిక విననందుకు అనుభవిస్తావు. అవును. ఈరోజు ఆడవాళ్ళను తీసుకురాలేదేం?"

"తోటలోకి వచ్చినపుడల్లా నీ ముఖం చూడాల్సొస్తోందని వాళ్ళెవ్వరూ రానంటున్నారు. దేవుడు నిన్ను కాస్త అందంగా పుట్టించినా బాగుండేది. నేనిలా ఒంటరిగా వనవిహారం చేయాల్సిన అవసరం తప్పేది!" అన్నాడు వెంకన్న.

"చాలా తెలివిగా మాట్లాడుతున్నావ్" అన్నాడు మార్తాండశాస్త్రి.

"నిజం చెప్పాను. అది తెలివైన లక్షణం అనుకుంటే నువ్వుకూడా నీకు తెలిసిన నిజాలేమైనా వుంటే నాకు చెప్పు. నేనూ నీ తెలివి తేటల్ని మెచ్చుకుంటాను...." అన్నాడు వెంకన్న.

"ఏ నిజాలు కావాలి నీకు?"

"నువ్వు రాత్రిళ్ళు తోటలో యెందుకు తిరుగుతున్నావు?" అన్నాడు వెంకన్న.

మార్తాండశాస్త్రి చిరాగ్గా చూసి—"నీతో నాకేంటిలే!" అని వెళ్ళిపోబోయాడు.

వెంకన్న చటుక్కున అతడి చేయిపుచ్చుకుని ఆపి—"నిన్ను వెళ్ళనివ్వను. నీ మూలంగా నా హనీమూన్ కార్యక్రమం దెబ్బతింది. ఈ తోటలో హాయిగా రాత్రిళ్ళు వనవిహారం చేయడానికి నువ్వే అడ్డుగా వున్నావు. అసలు సంగతేవేళ తేల్చేయాలి. చెప్పు. నీ వ్యవహారమేమిటో

చెప్పు" అన్నాడు.

మార్తాండశాస్త్రి విడిపించుకోవాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు.

"నువ్వు....నువ్వు .... మామూలు మనిషివి కాదు. పోలీసుల మనిషివా?" అన్నా డతను కంగారుగా.

"నా సంగతి నీ కనవసరం. నీ సంగతి చెప్పు. నువ్విక్కడేం చేస్తున్నావ్?"

"చెయ్యి వదులు—చెబుతాను" అన్నాడు మార్తాండశాస్త్రి.

వెంకన్న అతడి చేయి వదిలాడు. వెంటనే మెరుపు వేగంతో మాయమయ్యారు మార్తాండశాస్త్రి.

వెంకన్న నిట్టూర్చి ముందడుగు వేశాడు. అతను తోటను శ్రద్ధగా పరిశీలిస్తూ చాలా సేపు తిరిగాడు. అలా కొంత సేపు తిరిగాక హఠాత్తుగా అతడి ముందుకు మార్తాండశాస్త్రి వచ్చాడు.

"నీ కోసమే వెదుకుతున్నాను. నేనడిగిందానికి జవాబు చెబుతావా?" అన్నాడు వెంకన్న.

"ఆ విషయం తర్వాత. ముందోసారి చుట్టూ జాగ్రత్తగా చూడు" అన్నాడు మార్తాండశాస్త్రి.

వెంకన్న చుట్టూ చూశాడు. మొత్తం పన్నెండుగురుంటారు వాళ్ళు. ఒకొక్కడూ ఉక్కుపిడుగులా వున్నాడు. వాళ్ళలో తను క్రితందినం చూసిన భయంకరాకారుడు కూడా వున్నాడు. అందరి చేతుల్లోనూ తళతళ మెరిసే కత్తులున్నాయి. అంతా తనవంకే చూస్తున్నారు.

"వీళ్ళు నా మనుషులు. అదృష్టం బాగుంటే నేను చెప్పేది తర్వాత వినే అవకాశం కలుగుతుంది. ఇప్పుడు నేనడిగిన వాటికి నువ్వు చెప్పు. లేకపోతే పన్నెండుకత్తులు

ఒక్కసారి....” అని నవ్వాడు మార్తాండశాస్త్రి.

“మైడియర్ గ్రేట్ డిటెక్టివ్....” అని వెంకన్న చిరాగ్గా చూశాడు. “నేను మహా మొండివాణ్ని. కత్తులకు లొంగను” అంటూ వెంకన్న చొక్కాజేబులోంచి ఓ కళ్ళజోడు తీసి పెట్టుకున్నాడు.

“నిన్ను కత్తులతోనే కాదు. ఇంకా ఇంకా యెలా లొంగదీయాలో నాకు తెలుసు. నీ భార్యనూ, మరదళ్ళనూ చెరబట్టడానికి ఇద్దరు వస్తాదుల్ని పంపాను” అన్నాడు మార్తాండశాస్త్రి.

వెంకన్న కాస్త కలవరపడ్డాడు కానీ ముఖంలో బయట పడనివ్వలేదు “నాకూ, నా ఆడవాళ్ళకూ నువ్వు చేసిన గౌరవం ఈ జన్మలో మర్చిపోలేను” అన్నాడు.

“గౌరవమా?” అన్నాడు మార్తాండశాస్త్రి ఆశ్చర్యంగా.

“ముగ్గురాడవాళ్ళను చెరబట్టడానికి ఇద్దరు వస్తాదులు. ఒక్క మగాణ్ని పట్టడానికి—మొత్తం పదముగ్గురు మనుషులు....అన్నట్లు చెప్పటం మరిచేను—పదమూడు నా లక్కీ నెంబర్!” అన్నాడు వెంకన్న.

“నో 'జోక్స్—లెటజ్ స్టార్టు బిజినెస్!” అన్నాడు మార్తాండశాస్త్రి.

“అలాగే” అంటూ వెంకన్న తన ఎడం చేతిలోని టార్చిని వెలిగించాడు.

అక్కడ ఒక్కసారి పట్టపగల్లా వెలిగి మళ్ళీ చీకటయి పోయింది. అక్కడున్న అందరికీ కళ్ళు మిరుమిట్లు గొలి పాయి. కాసేపు ఎవ్వరికీ అక్కడ ఏమీ కనిపించలేదు.

“డియర్ ఫ్రెండ్స్! ఇప్పుడు మీరు చూసిన వెలుగు నా ఆటోమెటిక్ టార్చి చేత సృష్టించబడింది. మీకింకో అర

గంటదాకా కళ్ళు సరిగా కనబడవు. తల్చుకుంటే నే నిప్పుడు మిమ్మల్నందర్నీ చంపగలను. కానీ చంపను...."
అన్నాడు.

"యూ బ్లడీ .... నీకు కళ్ళు కనబడుతున్నాయా?"
అన్నాడు మార్తాండశాస్త్రి కసిగా.

"నాకు కళ్ళజోడుందిగా...." అని నవ్వాడు వెంకన్న
"మరోసారి నా జోలికి వచ్చారంటే శాశ్వతంగా గుడ్డి వాళ్ళు కాగలరు. జాగ్రత్తగా వుండండి."

వెంకన్న తన పాంటుజేబులోంచి మినీ కెమెరాతీసి అక్కడున్న మనుషులందర్నీ ఫోటోలుతీసి అక్కణ్నించి బయల్దేరాడు. ఇప్పుడతనికి పద్మావతి గురించి బెంగగా వుంది.

వెంకన్న బంగళాలో అడుగుపెట్టి లోపలకు వెళ్ళేసరికి ఇద్దరు పోలీసు కానిస్టేబుల్సు కనిపించారు.

"ఏమయింది? అన్నాడు వెంకన్న.

"ఎవరో ఫోన్ చేశారు. ఇన్స్పెక్టర్ గారు పైకి వెళ్ళారు" అన్నాడు కానిస్టేబులు. వెంకన్న హడావుడిగా మెట్లు ఎక్కి పరుగువంటి నడకతో తన గదికి వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి గదిలోంచి ఇన్స్పెక్టర్ బయటకు వస్తున్నాడు. ఆయన వెనకే ఇద్దరు వస్తాదులున్నారు. వారి వెనుక నలుగురు కానిస్టేబుల్సు....

వెంకన్న తన దృష్టిని ఇంకా లోపలకు సారించాడు. లోపల మంచంమీద పద్మావతీదేవి కూర్చుని వుంది. పక్కనే సీతమ్మ, రాజమ్మ నిలబడి వున్నారు. అక్కడ ఇంకా సూరపరాజు....రామన్న పంతులు....

"ఇన్స్పెక్టర్—ఏమయింది?" అన్నాడు వెంకన్న

తృప్తిగా నిట్టూర్చి.

ఇన్‌స్పెక్టర్ ఆగి—"మీరేనా వెంకన్నగారు!" అనడిగాడు.

"అవునండి. నేనే వెంకన్నను...."

"మీ ఆడవాళ్ళ వస్త్రాదుల్ని పడగొట్టి మాకు ఫోన్ చేస్తే వచ్చి—ఇలాంటి వస్త్రాదుల్ని పడగొట్టిన ఆడవాళ్ళ చుట్టం మగవాడు ఎలా వుంటాడో చూడాలని కుతూహలమొంది. మీరు మామూలుగానే వున్నారు" అన్నాడు ఇనస్పెక్టర్.

వెంకన్న నవ్వి—"అదిసరే—మీరు అర్జంటుగా తోటలోకి వెడితే పదముగ్గురు మనుషులు దొరుకుతారు. అందరి చేతుల్లోనూ కత్తులున్నాయి. మీరు త్వరగా వెడితే దొరుకుతారు. వాళ్ళు నా ప్రాణాలు తీయబోతూంటే తప్పించుకుని ఇలా వచ్చాను" అన్నాడు.

ఇనస్పెక్టర్ హడావుడిగా కానిస్టేబుల్సుని ఉసికొల్పాడు.

## 11

"అసలేం జరిగిందిక్కడ?" అనడిగాడు వెంకన్న.

"అక్కడ పదముగ్గురు. ఇక్కడ ఇద్దరు. మొత్తం పదిహేనుమంది. అమ్మబాబోయ్ - మీరు మనుషులేనా?" అంటూ గుండెలు బాదుకున్నాడు రామన్నపంతులు.

నూరపరాజు కంగారు బాగా ఎక్కువగా వుంది—"ఆ దొరికిన వెధవలంతా దివాణం గురించి ఏం చెబుతారో ఏమో."

"ఆ భయం మీకెందుకండీ—పదహారో దొంగకు వుండాలి" అన్నాడు వెంకన్న.

"ఇంకా పదహారో దొంగకూడా ఒకడున్నాడు

అంటారా?" అన్నాడు రామన్నపంతులు.

"తప్పకుండా వుంటాడు. దివాణంలో దొంగలుకదా- అంత సులభంగా బయటపడరు...." అన్నాడు వెంకన్న.

"అసలిదంతా ఏమిటో నాకు అర్థంకావడంలేదు. ఆ తోటలో ఏముందని అంతమంది గూండా వెధవలక్కడికి చేరారు?" అనడిగింది పద్మావతీదేవి.

"ఈ ప్రశ్నకి సూరపరాజుగారే జవాబు చెప్పాలి" అన్నాడు వెంకన్న.

"జవాబు నాకు తెలియదుకానీ ఊహించగలను...." అన్నాడు సూరపరాజు.

"మీ ఊహ ఏమిటో చెప్పండి" అన్నాడు వెంకన్న నర్మగర్భంగా.

"జమీందారుగారింట్లో ఓ భూగృహం వుంది. దానికి ప్రవేశమార్గం ఒకటి ఇంట్లోనూ మరొకటి ఆ తోటలోనూ వుందని అంటారు. అయితే వాటి రహస్యం బావ సుబ్బారాయుడికి తప్ప ఇంకెవ్వరికీ తెలియదు. ఆ భూగృహంలో తరతరాల ఆభరణాలున్నాయని చెప్పుకుంటారు. వాటి విలువ కోట్లు దాటుతుందంటారు. ఈ మధ్య ఆ వదంతి భవనం దాటి వీధిలోకి వెళ్ళింది. అప్పట్నించీ తోట ప్రమాదకరంగా తయారయింది" అన్నాడు సూరపరాజు.

"అయితే జమీందారుగారు తోటనెలా అలక్ష్యం చేశారు? దాంట్లో ఎవరినో నిత్యం కాపలా వుంచవచ్చునే!" అన్నాడు వెంకన్న.

"ఆ మార్గాన్నెవరూ కనుక్కోలేరని ఆయనకు నమ్మకం" అన్నాడు సూరపరాజు.

"అలాంటి నమ్మకాలు చాలా ప్రమాదం. నేనాయన నమ్మకాన్ని వమ్ముచేస్తాను. రేపు మనమంతా కలిసి తోట

లోని రహస్యమార్గం తెలుసుకునేందుకు ప్రయత్నిద్దాం” అన్నాడు వెంకన్న.

సూరపరాజు కళ్ళు మెరిశాయి “అయితే రేపు ఆ పని చూద్దాం. ఇంతకీ మీరెవరు? డిటెక్టివ్‌లా?”

వెంకన్న బాధగా నవ్వి “నా పేరు వెంకన్న. అంతే మీకు చెప్పగలిగింది” అన్నాడు.

సూరపరాజు వెళ్ళిపోగానే వెంకన్న తలుపులు వేసి- “డిటెక్టివ్ వెంకన్న ఇంకా పాప్యులర్ కాలేదు. నా పేరు చెప్పగానే—మీరా అని ఒక్కరు కూడా ఇంత వరకూ అనలేదు!” అన్నాడు.

వెంకన్న ముఖంచూసి పద్మావతి కిలకిలా నవ్వింది. ఆమె అలుసు చూసుకుని సీతమ్మ, రాజమ్మకూడా నవ్వారు. వెంకన్న తన అసిస్టెంట్లువంక సీరియస్‌గా చూసి— “నవ్వు బాగానే వుంది. ముందు మనం పరిస్థితిని విచారించాలి. ఒక్కసారి సింహావలోకనం చేద్దాం” అన్నాడు.

సీతమ్మ, రాజమ్మ క్షణాలమీద పెన్సిలు, నోటుబుక్కు తీసుకుని వెంకన్నముందు నిలబడ్డారు.

“ఇంతవరకూ జరిగింది ఇద్దరూ చెప్పండి” అన్నాడు వెంకన్న.

సీతమ్మ, రాజమ్మ—ఇద్దరూ నోట్సు ప్రిపేర్ చేస్తారు వెంకన్న ఏదైనా కేసు పట్టినప్పుడు. ఇద్దరి నోట్సులో ఏమైనా తేడా వుంటే అది వెంకన్న మెదడుకు పదును పెడుతుంది. కానీ ఇద్దరి నోట్సుల్లోనూ తేడా రావడం ఇంతవరకూ జరుగలేదు.

“మనమంతా హనీమూన్ పేరిట ఇక్కడికి వచ్చి మకాం పెట్టాం. వచ్చేసరికి జమీందారు సుబ్బారాయుడు

గారూళ్ళోళ్ళేరు. మూడు రాత్రుళ్ళు తోటలోకి వెడితే మార్తాండశాస్త్రి అనే డిటెక్టివ్ అడ్డగించాడు. బెదిరించాడు. అయినా మనం వనవిహారం మానకపోగా దౌర్జన్యానికి దిగి పోలీసులకు ఈ బంగళాలో ప్రవేశం కలిగింది. తోటలో భూగృహానికి మార్గముందనీ అది ఎవరికీ తెలియదనీ సూరపరాజు అంటున్నాడు. సూరపరాజు సుబ్బారాయుడికి బావ అవుతాడు. మనమిక్కడుండడం ఆయన కిష్టంలేదు. తోటలో భూగృహామార్గం తెలుసుకోడం కోసమే కొందరు అక్కడ కృషి చేస్తున్నారని ఆయన అంటాడు. మార్తాండశాస్త్రిని ఆయనే పిలిపించాడని అనుమానం. ఇప్పుడు మనం తెలుసుకోవలసినవి:

తోటలోని దుర్మార్గుల నాయకుడెవరు?

భూగృహ మార్గం తెలిస్తే సుబ్బారాయుడి ప్రాణాలకు ప్రమాదమా?

దివాణంలో సుబ్బారాయుడికి వ్యతిరేకంగా ఏమైనా కుట్ర జరుగుతోందా."

అని ఆగింది సీతమ్మ.

తర్వాత రాజమ్మ తన నోట్సు చదివింది. ఇద్దరూ ఒకే విషయాలు రాశారు.

"ఒక ముఖ్యమైన విషయం మరిచిపోయారు" అంది పద్మావతీదేవి.

వెంకన్న కుతూహలంగా ఆమెవంక చూశాడు.

"మనమిక్కడకు ఎందుకు వచ్చాము?" అంది పద్మావతీదేవి.

"రెండు రోజులు ఓపికపడితే అన్నీ నీకే తెలుస్తాయి" అన్నాడు వెంకన్న.

## 12

మర్నాడు సూరపరాజు, రామన్నపంతులు, వెంకన్న తోటకు బయలుదేరారు.

"మీరు డిటెక్టివులా?" అన్నాడు సూరపరాజు.

"మీకు తెలిసిన ప్రముఖ డిటెక్టివుల పేర్లు కొన్ని చెప్పండి" అన్నాడు వెంకన్న.

సూరపరాజు చాలా పేర్లు చెప్పాడు. అందులో వెంకన్న పేరు లేదు. అతను నిట్టూర్చి—"నేను డిటెక్టివ్‌ని కానట్లే లెక్క" అన్నాడు.

ముగ్గురూ తోటంతా తిరిగారు. ఎక్కడా అనుమానాస్పదమైన స్థలం కనబడలేదు.

"సొరంగమార్గం రెండుమూడు చదరపు అడుగులకు మించదు. ఇంత పెద్ద తోటలో దానిగురించి వెతకడం— గడ్డిమేటులో సూదిగురించి వెతకడంలాంటిదే!" అన్నాడు వెంకన్న.

"ఆ విషయం నాకు తెలుసు. నిన్నరాత్రి మీరే అనవసరంగా ఆశపడ్డారు" అన్నాడు సూరపరాజు.

"ఆశ ఇప్పుడూ పడుతున్నాను. గడ్డిమేటులో సూది వెతకడం నాకు పల్లేరుపై బండినడక వంటిది" అన్నాడు వెంకన్న.

అంతా కబుర్లు చెప్పుకుంటూ నూతిదాకా వెళ్ళారు.

అది సామాన్యమైన నూయి కాదు. మూడడుగుల వెడల్పు వున్న గుండ్రటి ఇటుకగోడ దాని ప్రాకారం. వెంకన్న లోపలికి తొంగిచూసి "చాలా లోతుందే" అన్నాడు.

"సొరంగమార్గం మాత్రం ఇందులో లేదు, అన్ని పరీక్షలూ అయ్యాయి" అన్నాడు సూరపరాజు. వాళ్ళిద్దరూ అక్కడే నిలబడి వుండగా వెంకన్న ఓసారి నూతిచుట్టూ

ప్రదక్షిణం చేశాడు. ప్రదక్షిణం పూర్తయ్యేసరికి అప్రయత్నంగా ఈలవేశాడతను.

"చాలా హుషారుగా వున్నారు" అన్నాడు సూరపరాజు.

"సొరంగమార్గం దొరికింది" అన్నాడు వెంకన్న.

"ఏమన్నారూ?" అంటూ అరిచాడు సూరపరాజు.

"సొరంగమార్గం దొరికింది"అన్నాడు వెంకన్న మళ్ళీ.

"ఎక్కడ?"

"ఇప్పుడింకేమీ చెప్పను. ఇంటికివెళ్ళి ముందు పంచాంగం చూడాలి" అన్నాడు వెంకన్న.

"పంచాంగం ఎందుకు?"

"ఇది సామాన్యమైన భూగృహం కాదు. అందులో కోట్ల విలువచేసే ఆభరణాలున్నాయి. అలాంటిచోట ఎప్పుడుపడితే అప్పుడు అడుగు పెట్టకూడదు. అదీ కాక ఈ విషయాన్ని ముందు జమీందారుగారికి చెప్పాలి!" అన్నాడు వెంకన్న.

"జమీందారుగారెప్పుడొస్తారో ఏమో?" అన్నాడు సూరపరాజు.

"ఎప్పుడొచ్చినా ఇది ఆయన ఇంటి భూగృహం. దీని రహస్యం మరొకళ్ళకు తెలియడం ఆయనకిష్టమవునో కాదో నాకు తెలియదు. ఆయన వచ్చేదాకా ఆగక తప్పదు—" అన్నాడు వెంకన్న.

"మీతో నేను భోజనాలయేక మాట్లాడతాను—" అన్నాడు సూరపరాజు.

## 13

భోజనాలయేక సూరపరాజు, వెంకన్న ఏకాంతంగా కలిశారు.

"మీతో అబద్ధం చెప్పను. నేను పరమదుర్మార్గుణ్ని" అన్నాడు సూరపరాజు.

"మిమ్మల్ని చూడగానే అనుకున్నానండి" అన్నాడు వెంకన్న.

"వేళాకోళాలొద్దు. మిమ్మల్నిక్కడికెవరు, ఎందుకు రప్పించారో చెప్పండి" అన్నాడు సూరపరాజు.

"మీరడిగారని నేను చెప్పను. చెబుదామన్నా నాకు తెలియదు" అన్నాడు వెంకన్న.

"నేను పరమదుర్మార్గుణ్నని ముందే చెప్పాను."

"మీరు దుర్మార్గులైతే నేను అవతారపురుషుణ్ని. అది అప్రస్తుతం. నేనిక్కడికెందుకు వచ్చానో ఈ ఉత్తరం చూసి మీరు తెలుసుకోవచ్చు" అంటూ వెంకన్న సూరప రాజుకో ఉత్తరం అందించాడు.

"వెంకన్నగారికి నమస్కారాలు. మీ గొప్పతనం విన్నాను. మా జమీందారు సుబ్బారాయుడుగారు వున్నట్లుండి మాయమయ్యారు. ఈ విషయమై నాకు అనుమానం వుంది. నేనాయన శ్రేయోభిలాషిని. మీగురించి మా దివాను రామన్నపంతులుకు ముందుగా చెప్పి వుంచుతాను. మీరు దివాణంలో దిగండి. మీరు డిటెక్టివు అని ఎవ్వరికీ అను మానం రాకూడదు. ఏదో స్నేహితుడు వచ్చినట్లు రండి. జమీందారు బంగళాలో ఓ భూగృహముంది. అందులోకి రెండు ప్రవేశమార్గాలున్నాయి. ఒకటి దివాణంలోని తోటలో వుంది. మరొకటి బంగళాలో వుంది. ఆ భూగృహ మార్గాల గురించి సుబ్బారాయుడుగారికి తప్ప మరెవ్వరికీ తెలియదు. ఇటీవల ఎవరైనా తెలుసుకుని వారి నందులోనే బంధించారేమోనని అనుమానంగా వుంది. సుబ్బారాయుడిగారి దివాణంలో అంతా దొంగలే? ఈ

విషయాన్ని ఆయన చాలా ఆలస్యంగా తెలుసుకున్నారు. అందుకే అదృశ్యమయ్యారు. మీరు వెంటనే రావాలని కోరుతున్నాను."

క్రింద సంతకం లేదు. ఉత్తరం చివరన దివాణం గురించిన కొన్ని ఇతర వివరాలున్నాయి.

సూరపరాజు వెంటనే రామన్నపంతుల్ని పిల్చుకుని వచ్చాడు. ఉత్తరం చూపించి "ఈ వెంకన్నగారొస్తున్నట్లు నీకు చెప్పిందెవరు?" అనడిగాడు.

"మీ చెల్లెమ్మగారు" అన్నాడు రామన్న పంతులు తడుముకోకుండా.

సూరపరాజుగారి ముఖం వెలవెలబోయింది. రామన్న పంతులు వంక తీవ్రంగా చూసి "నువ్వుకూడా సుబ్బారాయుడు మాయమయ్యాడనుకుంటున్నావా లేక ఊరు వెళ్ళాడనుకుంటున్నావా?" అన్నాడు.

"ఈ ఉత్తరం చూసేదాకా నాకే అనుమానమూ లేదండి. చూసేక ఇప్పుడూ...." అని సూరపరాజువంక చూసి గుటకలు మింగుతూ—"అనుమానం లేదండి—" అన్నాడు రామన్నపంతులు.

సూరపరాజు నవ్వి—"నువ్వెళ్ళు!" అన్నాడు.

రామన్న పంతులు వెళ్ళిపోయాక సూరపరాజు వెంకన్నవంక అదోలాచూసి—"ఎవరేమనుకున్నా నిజం నాకు తెలుసు. సుబ్బారాయుడు మాయమయ్యాడు. మాయంచేసింది కూడా నేనే!" అన్నాడు.

వెంకన్న ఉలిక్కిపడి-"ఏమంటున్నారు?" అన్నాడు.

"సుబ్బారాయుడు మేధకుడు. ఈ దివాణాన్నేలుతున్నది నేను, నా చెల్లెమ్మ. అయితే ఇటీవల సుబ్బారాయుడి బుర్ర కాస్తపదును నెక్కింది. కారణం తెలియదు.

నా పెత్తనం సాగనివ్వడంలేదు. రెండు మూడుసార్లు హెచ్చరించాను కానీ లొంగలేదు. బాగా తెలివి మీరి పోయాడు. నన్ను బాగా ఎదిరించాడు. వాడు బ్రతికుంటే నా ప్రాణానికే ప్రమాదం. అలాగని చెల్లెమ్మ నుదుటి కుంకుమ తుడిచేయలేను కదా—అందుకని జమిందారీని వాడికే వదిలిపెట్టి—భూగృహంలోని ఆస్తి నా స్వంతం చేసుకుని ఇక్కణ్ణించి పోవాలనుకున్నాను. అయితే వాడసలు భూగృహం సంగతే తనకు తెలియదు పొమ్మన్నాడు. అప్పుడు వాణ్ని మాయంచేశాను. యమకింకరుల వంటి నా భటుల మధ్య ఉంచాను. వాడు బాధలన్నీ సహిస్తూ కూడా భూగృహం సంగతి తెలియదనే అంటున్నాడు. తండ్రి వాడికది చెప్పకుండానే పోయాడట—" అన్నాడు సూరపరాజు.

"నీ నేరాలన్నీ బయటపెట్టి కథ నాకు చెప్పి చాలా సాహసం చేశావు—" అన్నాడు వెంకన్న.

"నీచేత భూగృహ మార్గం చెప్పించడానికి ఈ సాహసం చేయాల్సివచ్చింది—" అన్నాడు సూరపరాజు.

"నేను చెప్పకపోతే...."

"నిన్నైతే చంపేస్తాను. పద్మావతి నా చెల్లెలు కాదు కదా—ఆమె నొసటి కుంకుమ గురించి నాకు బెంగలేదు—"

వెంకన్న దిగులుగా సూరపరాజువంక చూసి—"నాకు కాస్త ఆలోచించుకునేందుకు టైమివ్వండి—" అన్నాడు.

"పోలీసులకు ఫోన్ చేసి లాభంలేదు. వాళ్ళంతా నా డబ్బు తింటున్నవాళ్ళే?" అన్నాడు సూరపరాజు.

"మీరూ, నేనూ, పోలీసులూ అంతా తింటున్న డబ్బు ఒకరిదే....అది ప్రజల డబ్బు...." అన్నాడు వెంకన్న.

వెంకన్న రామన్న పంతుల్ని కలుసుకుని—"నాకంతా అయోమయంగా వుంది. దివాణం గురించి నాకు మరికొన్ని వివరాలు చెప్పగలరా?" అన్నాడు.

"ఏం దివాణమో—దిక్కు దివాణం లేకుండా వుంది. ఒక్క ప్రాణిని. నేనేమీ చెప్పలేను—" అన్నాడు రామన్న పంతులు.

"సుబ్బారాయుడిగారి భార్య, సూరపరాజు చెల్లెలు-అయిన ఆమె ఇప్పుడెక్కడుంది? ఆమె కోరికపైనేకదా నేనిక్కడకు వచ్చింది! ఆమెను నేను కలుసుకోవాలి...." అన్నాడు వెంకన్న.

"అన్నగారి చేతిలో కీలుబొమ్మ ఆవిడ. భారతదేశంలో పుట్టడంవల్ల ఎలాగో ధైర్యంచేసి మీకా ఉత్తరం రాసినట్లుందావిడ. అదే పెద్ద ఆశ్చర్యం—ఆవిడ మీకు దొరకదు. ఈమధ్య అన్నా చెల్లెళ్ళకేదో పేచీవచ్చినట్లుంది. సూరపరాజుగారు తల్చుకుంటే తప్ప ఆవిణ్ని మీరు కలుసుకోలేరు—" అన్నాడు రామన్న పంతులు.

"మీకు చాలా తెలుసు. మీరు నాకు సహకరించక తప్పదు. లేకపోతే తర్వాత చాలా ప్రమాదంలో పడతారు—" అన్నాడు వెంకన్న వీలైనంత తీవ్రంగా.

"తెలియడానికేముంది? మీరు రావడానికి పది రోజులకుముందు సుబ్బారాయుడుగారదృశ్యమైపోయారు. ఆ తర్వాత నాలుగు రోజులకు ఆయన భార్య రమాదేవి నాకు మీ రాక గురించీ చేయవలసిన ఏర్పాట్లగురించీ చెప్పారు. ఆ తర్వాత రెండ్రోజులకు ఆవిడ మాయమయ్యారు. దివాణంలో వాళ్ళూరుకెళ్ళారని చెప్పమని సూరపరాజుగారన్నారు. ఇంతకుమించి నేనేమీ చెప్ప

లేను....”

“ఏమైతేనేం? సొరంగ మార్గం తెలుసుకోగల్గడం నా అదృష్టం—సూరపరాజు నా దారికి వస్తున్నాడు—” అన్నాడు వెంకన్న ఉత్సాహంగా.

“త్వరగా దాని వివరాలు సూరపరాజుగారికి చెప్పెయండి—” అన్నాడు రామన్న పంతులు.

“మీకు తెలుసో తెలియదో కానీ సుబ్బారాయుడు గారు సూరపరాజుకు బందీగా వున్నాడు. భూగృహానికి మార్గం చెప్పమని నానావిధాలుగా హింసలు పెడుతున్నా చెప్పలేదట. అలాంటప్పుడు నేను చెప్పడం మాత్రం న్యాయంగా వుంటుందా మీరే చెప్పండి—అయినా మీ జమిందారుగారిని రక్షించుకోవాల్సిన బాధ్యత మీకు లేదా? సుబ్బారాయుడిగారిని నేను రక్షిస్తానంటే మీరు నాకు సాయపడరా?” అనడిగాడు వెంకన్న.

“జమిందారుగార్ని రక్షించడం నాకూ యిష్టమే! కానీ నేను అసహాయుణ్ని. అయితే మీరు చెప్పిన విషయాలు నన్ను చాలా కలవరపరుస్తున్నాయి. నేనోసారి సూరపరాజుగారితో మాట్లాడతాను-”అన్నాడు రామన్న పంతులు.

“మాట్లాడి చూడండి!” అన్నాడు వెంకన్న.

## 15

రాత్రి ఎనిమిది గంటలవరకూ ఎదురు చూశాడు సూరపరాజు.

పరివారంతో బయటకు వెళ్ళిన వెంకన్న మళ్ళీ వెనక్కు రాలేదు.

సూరపరాజులో అసహనం పెరిగింది. పారిపోలేదు కదా అన్న అనుమానం కూడా వచ్చింది.

ఆ సమయంలో రామన్న పంతులు అక్కడకు వచ్చాడు.

"ఏమండీ వెంకన్న పారిపోయాడా?" అన్నాడు సూరపరాజు.

"భూగృహం కోట్లాది సంపదకు నిలయం. దాని రహస్యం తెలుసుకున్నవాడు మీకూ నాకూ ఎందుకు చెబుతాడు? మీ చెల్లెలుగారు చాలా తెలివితక్కువగా ప్రవర్తించారు? ఈ వెంకన్న అవులిస్తే పేగులు లెక్కపెట్టేవాడిలాగున్నాడు. ఎప్పుడో భూగృహంలో ప్రవేశిస్తాడు. ఒకవేళ ఇప్పటికే ప్రవేశించాడేమో!" అన్నాడు రామన్న పంతులు.

సూరపరాజు, రామన్న పంతులు వంక తీవ్రంగా చూసి—"నువ్వబద్ధం చెబుతున్నావు. ఆ ఉత్తరం నా చెల్లెమ్మ రాయలేదు. దస్తూరీ కూడా పోల్చిచూశాను. అది దానిదికాదు—" అన్నాడు.

"కానీ సత్తెయ్య నాకు అమ్మగారు చెప్పారనే చెప్పాడే!" అన్నాడు రామన్న పంతులు.

"ఎవరూ—సత్తెయ్యా—సరే—నీ అబద్ధాలకేంగానీ ఇంక ఆ సుబ్బారాయుణ్ని బ్రతకనివ్వను. నా చెల్లెమ్మ కూడా ఒప్పుకుంది. సుబ్బారాయుడుపోతే రెండో పెళ్ళి చేసుకుని హాయిగా ఇంత ఆస్తినీ అనుభవిస్తుంది—" అన్నాడు సూరపరాజు.

"జమిందారుగారిని చంపేస్తావా?" ఆశ్చర్యంగా అడిగాడు రామన్న పంతులు. స్వరంలో ధ్వనించిన ఆశ్చర్యంకంటె—కళ్ళలో భయం ఎక్కువ కనిపించింది.

"ఆ భూగృహమార్గం చెప్పనని మొండికేశాడు. ఇంకేం చెయ్యను?" అన్నాడు సూరపరాజు.

రామన్న పంతులు దీనంగా సూరపరాజువంక చూసి-"ఆయన్ను చంపకు. ఆయనకు నిజంగా భూగృహమార్గం తెలియదు—" అన్నాడు.

"ఆయనకు తెలియకపోతే నీకు తెలుసా?" అన్నాడు సూరపరాజు.

"నాకూ తెలియదు. చచ్చిపోయిన జమీందారు సుబ్బారాయుడిగార్కి భూగృహ మార్గం చెప్పలేదు. ఆ సంగతి నాకు తెలుసు—" అన్నాడు రామన్న పంతులు.

"ఎలా తెలుసు? అది ఆ తండ్రీ కొడుకుల రహస్యం" అన్నాడు సూరపరాజు.

"జమీందారు చనిపోయినప్పుడు సుబ్బారాయుడిగారి వయస్సు మూడేళ్ళు—"

"అయితే రహస్యం తనతోనే చావాలనుకున్నాడా ఆ జమీందారు—"

"అదేంకాదు—సుబ్బారాయుడు చిన్నవాడైతే నమ్మకస్తుడికెవరికైనా దానిగురించి చెప్పివుండేవారాయన. కానీ ఆయనకు సుబ్బారాయుడు తన కొడుకు కాదన్న అనుమానం వచ్చింది—"

"అదెలా?"

"ఎలాగో నాకు తెలియదు. కానీ మరణశయ్యమీద ఉండగా ఆయన అన్నమాటలు నాకింకా గుర్తున్నాయి-" అన్నాడు రామన్న పంతులు.

"ఏమన్నాడు?"

"భూగృహ రహస్యం నాతోనే అంతమవుతోంది—జరిగిన మోసం నాకు తెలుసు—అన్నాడాయన—" అన్నాడు రామన్న పంతులు.

"మోసమేమైనా జరిగిందని నీకూ తెలుసా?"

"తెలియడానికేముంది? చేసిందే నేను. జమిందారుకు బిడ్డపుట్టిన రోజునే నాకూ బిడ్డపుట్టాడు. పిల్లల్ని మార్పించాను. జమిందారు బిడ్డడిని చంపించాను...." అంటూ నవ్వాడు రామన్న పంతులు. అంతలోనే అతడి ముఖం దీనంగా అయిపోయింది—"సుబ్బారాయుడు నా బిడ్డ. చిన్నతనంనుంచీ గారాబంగా పెంచాను. వాడికి పదేళ్ళు వచ్చాక జన్మరహస్యం కూడా చెప్పాను. వాడికి నా తెలివితేటలు రాలేదు. విలాస జీవితాన్ని కోరాడు. అందుకే మీ చెల్లెల్నిచ్చి వాడికి పెళ్ళిచేశాను. నీవంటి వాడి అండ వాడికివుంటే మంచిదని అభిప్రాయపడ్డాను. నా బిడ్డ అమాయకుడు. వాడినేమీ చేయకండి. మన మిద్దరం కలిసి ఆ వెంకన్నను పట్టుకుని నిజం కక్కిద్దాం. భూగృహమార్గం తెలుసుకుందాం. సుబ్బరాయుణ్ని వదిలిపెట్టండి—" అన్నాడు రామన్న పంతులు.

నూరపరాజు ఆశ్చర్యంగా రామన్న పంతులువంక చూసి—"పంతులూ—ముఖం చూసి నువ్వొత్త అమాయకుడివి అనుకున్నాను. అసాధ్యుడివే!" అన్నాడు. ఒక్క క్షణం ఆలోచించి—"ఈ రహస్యం ఇంకెవరికైనా తెలుసా?" అనడిగాడు.

"సత్తెయ్య నా నమ్మినబంటు. జమిందారు బిడ్డను చంపింది వాడే. వాడికీ నాకూ తప్ప ఈ విషయం ఇంకెవ్వరికీ తెలియదు—" అన్నాడు రామన్న పంతులు.

"చివరిదశలో జమీందారుకు రహస్యం తెలిసిపోయింది గదా — అది సత్తెయ్యే ఆయనకు చెప్పాదేమో—" అన్నాడు నూరపరాజు.

"సత్తెయ్య నా నేరంలో భాగసుడు. అలాంటి పని చేయడు—నాకూ ఓ అనుమానం వచ్చింది. పసివాణ్ని

చంపడానికి మనసొప్పక సత్తెయ్యే తన దగ్గర పెంచా డేమోనని. అందుకే వాడిగురించి ఆరాతీశాడు. ఆ ఆరాలో వాడికో భార్య వుందనీ వాళ్ళకొక బిడ్డడున్నాడని తెలిసింది. సత్తెయ్య మాత్రం తన పెళ్ళాం తనను వదిలేసిందని చెప్పాడు. వాడు దివాణం వదిలి కూడా ఇంతవరకూ ఎక్కడకూ పోలేదు. అందువల్ల వాణ్ని నేను నమ్మాను—" అన్నాడు రామన్న పంతులు.

"నీ కొడుకు ప్రాణాలమీదికి రావడంతో ఇప్పుడు నువ్వు నిజంచెప్పావు. కానీ నాకు భూగృహ రహస్యం తెలిసేదెట్లా? ఆ బాధ్యత నీకే వదిలిపెడుతున్నాను—" అన్నాడు సూరపరాజు.

"ఇది మనం వెంకన్న ద్వారానే సాధించాలి—" అన్నాడు రామన్న పంతులు.

సరిగ్గా అప్పుడే అక్కడ వెంకన్న ప్రవేశించి— "ఈ దాసుడు మీ ఆజ్ఞకై వేచివున్నాడు —" అన్నాడు.

"మీరా? ఎంత సేపైందిక్కడకు వచ్చి...?" అన్నాడు సూరపరాజు ఆశ్చర్యంగా.

"ఇప్పుడే వచ్చాను. భూగృహ మార్గం మీకు చూపించాలనే నిర్ణయం చేసుకున్నాను...." అన్నాడు వెంకన్న.

"మంచి నిర్ణయం—పద, పోదాం—" అన్నాడు సూరపరాజు.

"పోయేముందో చిన్న మనవి. నేను చెప్పేది ముందు వినండి. తర్వాత మీకింకా మనసుంటే భూగృహానికి వెడదాము—" అన్నాడు వెంకన్న.

"ఏమిటి మీరు చెప్పబోయేది?" అన్నాడు సూరపరాజు.

"మీకు రామన్న పంతులు కొంత కథ చెప్పాడు. మిగతా కథ నేను చెబుతాను...." అన్నాడు వెంకన్న.

"అదంతా నువ్వు విన్నావా?" అన్నాడు సూరప రాజు సంబోధన మారుస్తూ.

"విన్నాను. కానీ వినకముందే నాకు తెలుసు. సత్తెయ్య నాకు ఉత్తరంలో అన్నీ రాశాడు-" అన్నాడు వెంకన్న.

"నీకు త్తరం రాసింది సత్తెయ్యా?" అన్నాడు సూరప రాజు ఆశ్చర్యంగా.

వెంకన్న డబ్బాలో రాళ్ళు గిలకరించినట్లు నవ్వాడు- "చెప్పేది పూర్తిగా విను. సత్తెయ్యకు దివాణంలో ఉద్యోగం. జమిందారు అతడి ఆరవ ప్రాణం. కానీ జమిందారు అతణ్ని దరిదాపులకు కూడా రానిచ్చేవాడు కాదు. సత్తెయ్యలాంటి నమ్మకస్థుణ్ని దూరంగా వుంచి రామయ్య పంతులులాంటి దుర్మార్గుణ్నే నమ్మేవాడు జమిందారు. రామన్న పంతులు జమీందారు బిడ్డని చంపతలపెట్టినపుడు సత్తెయ్య వణికిపోయాడు. జమిందారు బిడ్డని ఎలాగైనా రక్షించాలనుకున్నాడు. అందుకొక్క టే దారి కనిపించిందతనికి. ఫలితంగా రామన్న పంతులుకు నమ్మినబంటయ్యాడు.

జమిందారు దగ్గర రామన్న పంతులు బిడ్డ పెరుగుతున్నాడు. జమిందారుకు బిడ్డలో రామన్న పోలికలు కనిపించాయి. ఆయన భార్యను అనుమానించాడు. ఆవిడ ఆత్మహత్య చేసుకుంది అవమానంతో. పాము కరిచి పోయిందని అబద్ధమాడారు. జమిందారు జబ్బుపడ్డాడు. దివాణం వ్యవహారాలు రామన్న పంతులు చేతిలోకి

పూర్తిగా వచ్చేశాయి. జమిందారు తన అనుమానాన్ని భార్య దగ్గర అన్నాడు కానీ—రామన్న పంతులు దగ్గర అనలేదు.

జబ్బుపడ్డ జమిందారుకు సత్తెయ్య సేవలు చేసేవాడు. ఆ సమయంలో అతను జమీందారుకు రామన్నపంతులు కథ చెప్పాడు. జమీందారు షాక్ తిన్నాడు. సత్తెయ్య దగ్గర తన బిడ్డ పెరుగుతున్నాడని తెలిసి ఆయన చాలా సంతోషించాడు. సత్తెయ్యలో మోసంలేదని ఆయన తెలుసుకున్నాడు. ఒకసారి రహస్యంగా ఆయన సత్తెయ్య బిడ్డని చూశాడు. వాడిలో తన పోలికలు కనబడ్డాయి.

ఆ బిడ్డను తన బిడ్డగా దివాణంలో ప్రవేశపెడితే— వాడి ప్రాణాలకు రక్షణలేదని ఆయనకు తోచింది. జమీందారీలో తన బిడ్డకు రక్షణ వుండదని తెలిసి ఆయన సత్తెయ్యకు భూగృహమార్గం చెప్పాడు. వాడు పెద్దవాడయ్యాక అందులోని సంపదను ఉపయోగించుకోనిమ్మన్నాడు. అంతవరకూ బయట పెరగనివ్వమన్నాడు— తర్వాత ఆయన జబ్బు ముదిరింది. రామన్న పంతులు ఎంత ప్రయత్నించినా భూగృహం గురించి చెప్పలేదు. చివర్లో ఆగలేక సుబ్బారాయుడు తన కొడుకు కాదని కూడా చెప్పేశాడు. అప్పుడు రామన్నపంతులికి అనుమానం కలిగింది తన రహస్యం ఎలా తెలిసిందని. ఆయన సత్తెయ్యను నిలదీయడమేకాక అతడికి అయినవాళ్ళందరి ఇంటా పసిబిడ్డలను మట్టుపెట్టించాలనే స్థితికి వచ్చాడు.

అప్పుడు సత్తెయ్య తన భార్యనూ, జమిందారు కొడుకునూ భూగృహంలోనే దాచాడు. జమిందారు కుటుంబం కోసం సత్తెయ్య చేసిన త్యాగం అపూర్వం. పాతికేళ్ళుగా బయటి ప్రపంచం తెలియకుండా అతడి భార్య భూ

గృహంలో వుండిపోయింది. జమిందారు కొడుకు కోసం సత్తెయ్య తను చదువు నేర్చుకుని భూగృహంలోకి వెళ్ళి రోజూ చదువు చెప్పేవాడు. భూగృహంలో వారికి అన్ని సదుపాయాలూ ఉన్నాయి. కొత్త పుస్తకాలు, వార్తాపత్రికలు అన్నీ వారికి లభ్యమవుతున్నాయి. అతడి ఈ భూగృహ జీవితం గురించి ఎవ్వరికీ తెలియదు. ఎందుకంటే బంగళాలోంచిగానీ, తోటలోంచిగానీ భూగృహానికి వెళ్ళేదారి అతడికొక్కడికే తెలుసు. పాతికేళ్ళుగా అతడీ రహస్యాన్ని ఎంతో తెలివిగా కాపాడుకుంటూ వస్తున్నాడు.

ఇటీవల సూరపరాజు ఆసక్తి భూగృహంవైపు మళ్ళగానే సత్తెయ్య భయపడ్డాడు. రామన్న పంతులు జమిందార్ వైభవంతో తృప్తిపడ్డాడు. కానీ సూరపరాజు ధనదాహం గొప్పది. ఈ పరిస్థితుల్లో ఏం చేయాలా అని ఆలోచిస్తూండగా అతడికి నా గురించి తెలిసింది. తను పోలీసుల దగ్గరకు వెళ్ళి ఏం చెప్పినా దాన్ని సూరపరాజు వమ్ము చేయగలడు. సంఘంలో తనకు పలుకుబడిలేదు. కాబట్టి సూరపరాజు, రామన్న పంతుల కథంతా నాకు వ్రాసి—అసలు వారసుడికి తెలివిగా న్యాయం చేకూర్చమని కోరుతూ సత్తెయ్య నాకు త్తరం రాశాడు. నేను వచ్చాను. సత్తెయ్య చెప్పింది మీ విషయంలో నిజమని ఋజువుచేసే మీ మాటలు రేపు అయ్యాయి. జమిందారు అసలు కొడుకును చూడ్డానికి సత్తెయ్యతో కలిసి పోలీసులు భూగృహంలోకి వెళ్ళారు. మీరూ వస్తానంటే తీసుకువెడతా....” అని ఆగాడు వెంకన్న.

సూరపరాజు, రామన్న పంతులుల ముఖాల్లో కత్తి

వాటుకు నెత్తురుచుక్క లేదు. నిశ్చేష్టులై అలా నిలబడి పోయారు.

"త్వరగా ఆలోచించుకోండి. ఎంతో వ్యవధి లేదు. రేపు నేనిక్కడ వుండను. ఈ రోజుతో నా హనీమూన్ ప్రోగ్రాం ముగుస్తోంది" అన్నాడు వెంకన్న.

అంతలోనే పోలీసులు అక్కడికి వచ్చారు. సూరప రాజుని, రామన్న పంతులుని కస్టడీలోకి తీసుకున్నారు. డిటెక్టివ్ వెంకన్న జేబులోంచి పాకెట్ టేప్ రికార్డర్ తీసి ఇన్స్పెక్టర్ చేతిలో పెట్టాడు.

—: ఐ పో యిం ది :—

# అమృతంలో విషం!

వాణిశ్రీ

శరభయ్య గూడు రిక్షాని హుషారుగా తొక్కుకుంటూ వస్తున్నాడు.

పగలంతా రిక్షా తొక్కి తొక్కి రోజూ ఆ సమయానికి నీరసపడిపోయి వుండేవాడు. వుసూరుమంటూ రిక్షాని యజమానికి అప్పజెప్పి ఇంటికి పోయేవాడు.

కాని ఈ రోజు శరభయ్య భార్య చేపలపులుసు చేసింది. మధ్యాహ్నం భోజనంచేసి వస్తుంటే తొట్టి ప్రక్కన బండమీద పెద్ద బొచ్చచేపను రుద్దుతూ "పెందలాడే కొంపకిరా!" అంది అతని భార్య.

చేపలపులుసంటే శరభయ్యకి ఎంతో ఇష్టం. సారాయి త్రాగిన తర్వాత చేప తినడం చెప్పలేనంత ఇష్టం.

ఆ రోజు సంపాదన కూడా బాగానే వుండడం అతనికి మరింత హుషారుగా వుంది. రిక్షా అద్దెపోను పది రూపాయలు మిగులాయి. ఐదురూపాయలు దానికిచ్చినా ఐదురూపాయలు సారాయి త్రాగొచ్చు అనుకున్నాడు.

కోడూరునుంచి టౌన్‌కి, టౌన్‌నుంచి కోడూరుకి సరుకుల్ని మనుషుల్ని గూడు రిక్షామీద చేరవేసి సంపాదిస్తున్నాడు శరభయ్య. టౌన్‌లోకంటే ఇక్కడే బాగుంటుంది బేరం. పోటీ తక్కువ.

కోడూరునుంచి చీకటిపడిన తర్వాత లాస్టు ట్రిప్ ఖాళీగా వస్తున్న శరభయ్యకి హోటలు మధువనం దగ్గర బేరంతగిలింది. హోటలు మధువనం టౌన్ చివర విశాలమైన ఆవరణలో వుంది.

పొడుగ్గా తెల్లటి బట్టలువేసుకున్న అతను ఎవరో బండి ఆపమన్నట్లు చెయ్యి ఎత్తాడు. అతనికి గడ్డం కూడా వుంది.

"హాస్పటల్‌కి వస్తావా?"

తలవూపాడు శరభయ్య వస్తానన్నట్టు.

తనవెంట రమ్మనమని సైగచేసి దారితీశాడు అతను. షార్టికోలోంచి ప్రక్క సందులోకి వెళ్ళాడు. హోటలు రూమ్‌ముందు ఆగింది రిక్షా. శరభయ్య తలెత్తి చూశాడు. తలుపుమీద 26 నెంబరు ఇత్తడి అక్షరాలు వున్నాయి. అతను తలుపు తెరిచాడు.

"లోపలకు రా!" అన్నాడు.

శరభయ్య లోపలకు వెళ్ళాడు. బెడ్ మీద ఆడమనిషి పడుకొని ఆయాసపడుతోంది విపరీతంగా.

"ఈమె ఆస్మా పేషెంటు. జాగ్రత్తగా నెమ్మదిగా తీసుకెళ్ళాలి."

తలవూపాడు శరభయ్య.

"ఏమివ్వమంటావు?"

"రూపాయిన్నర ఇవ్వండి బాబూ!" అన్నాడు శరభయ్య. రూపాయిన్నర అడిగితే కనీసం రూపాయి

అయినా ఇస్తాడని అతని ఆశ.

ఆ గడ్డం అతను రెండు కాగితం ఇచ్చాడు.

"నువ్వు అడిగిన దానికన్నా అర్థరూపాయి ఎక్కువ ఇచ్చాను. ఆమెను జాగ్రత్తగా తీసుకెళ్ళాలి."

"అలాగే బాబూ! నాకా మాత్రం తెలీదా!" అన్నాడు శరభయ్య హుషారుగా. అనుకోకుండా రెండు రూపాయల బేరం తగిలినందుకు ఆనందంగా వుంది.

"కొంచెం కాళ్ళదగ్గరపట్టు రిక్షాలో పడుకోబెడదాం" అన్నాడు అతను.

శరభయ్య ఆమెను కాళ్ళదగ్గర పట్టుకున్నాడు. ఇద్దరూ కలిసి రిక్షాలో పడుకోబెట్టారు ఆమెను. అతను దుప్పటి తెచ్చి కప్పాడు ఆమెకు. ఆమె స్పృహలో లేదు.

"మాది ఈ వూరుకాదు. ఏలూరు. అనుకోకుండా ఆమెకు జబ్బుచేసింది" అన్నాడు అతను విచారంగా.

"సరే! నువ్వుమాత్రం జాగ్రత్తగా పోతూవుండు. నేను సైకిలుమీద వచ్చి నిన్ను కలుసుకుంటాను" అన్నాడతను.

శరభయ్య బయల్దేరాడు.

"జాగ్రత్త. ఆమెకు చలి గాలి తగలగూడదు. ఉబ్బసం రోగికదా! దుప్పటి తొలిగిపోతుందేమో అప్పుడప్పుడూ చూస్తూ వుండు."

శరభయ్య తల వూపుతూ రిక్షా లాగించాడు. అతను చెప్పినట్లు అప్పుడప్పుడూ రిక్షాలో పడుకున్న ఆమెవంక చూస్తూనే వున్నాడు దుప్పటి తొలిగిపోతే సరిచేద్దామని. కాని అతనికా అవసరం రాలేదు.

ఆమెను చూస్తే నిండా పాతికేళ్ళు లేవు. నిమ్మపండులా నిగనిగలాడుతూ అందంగా వుంది. ఇంత చిన్న

వయసులోనే ఆ జబ్బు ఏమిటో అనుకున్నాడు శరభయ్య. ఆమెమీద ఎందుకో జాలికలిగింది. పాపం! ఏం మాయదారి రోగమో అనుకున్నాడు.

టౌన్‌లోకి వెళ్ళేసరికి పూర్తిగా చీకటి పడింది. చలికాలం ఏమో ఆరున్నరకే చీకట్లు క్రమ్ముకునిపోయాయి. దారిలో రిక్షా ఆపి లైటు వెల్గించి బయల్దేరాడు శరభయ్య.

హాస్పిటలులో పోర్టికోలో రిక్షా ఆపాడు. తిరిగి చూశాడు ఆ గడ్డంబాబు కనిపిస్తాడేమోనని. వుహూఁ.. ఎక్కడా కనిపించలేదు. వస్తూ వుంటాడులే అనుకుని బీడీ ముట్టించాడు. పావుగంట గడిచింది. అతను రాలేదు.

క్యాజువాల్టీ వార్డు దగ్గర నిల్చున్న వార్డుబాయ్ అడిగాడు శరభయ్యని.

"పేషెంటుకి ఏం జబ్బు?"

"ఉబ్బసం" అన్నాడు శరభయ్య.

"తీసుకొచ్చి లోపల పడుకోబెట్టు. బైట చలిగాలి" అన్నాడు.

"కొంచెం సాయం రా అన్నా!" అన్నాడు శరభయ్య.

వార్డుబాయ్ మెట్లు దిగివచ్చాడు.

"ఏం నడవలేదా?" అన్నాడు.

"వుహూఁ....చాలా ఎక్కువగా వుంది" అన్నాడు శరభయ్య.

వార్డు బాయ్ దుప్పటిలాగి ఆమెను ముట్టుకుని చూశాడు. శరీరం చల్లగా వుంది. కూర్చోబెట్టాలని ప్రయత్నించాడు కాని శరీరం బిగుసుకుపోయి వుంది. అతనికి అనుమానం వచ్చింది, ప్రాణం పోయిందని.

అప్పుడే అటుగా పోతున్న డాక్టర్ లతీఫ్ కనిపిం

చాడు వార్డు బాయ్‌కి.

"సార్!" అన్నాడు వార్డుబాయ్.

డాక్టర్ దగ్గరికి వచ్చి "ఏమిటి వెంకటయ్యా?" అన్నాడు.

"కొంచెం పేషెంటుని చూడండి సార్!"

"లోపలకు తీసుకువెళ్ళు. డ్యూటీ డాక్టర్ వున్నాడుగా?"

"అదికాదు సార్!" అంటూ తన అనుమానం వెల్లడించాడు వార్డుబాయ్ వెంకటయ్య.

డాక్టర్ లతీఫ్ ఆమెను చూసి "చచ్చిపోయిందయ్యా!" అన్నాడు.

శరభయ్య గుండె గుభేలుమంది.

డాక్టర్ చరచర నడిచివెళ్ళిపోయాడు.

"పోయిందట. ఇక ఇంటికి తీసుకెళ్ళు!" అన్నాడు వార్డుబాయ్ వెంకటయ్య.

"ఎక్కడికి తీసుకెళ్ళను? ఈమె ఎవరో నాకు తెలీదు" అన్నాడు శరభయ్య ఆందోళనగా.

"మరి తెలీకుండా ఇక్కడికి ఎలా తీసుకొచ్చావ్?"

"నేను కోడూరునుంచి వస్తుంటే మధ్యలో మధువనం హోటలు దగ్గర ఒకాయన బండి ఆపి ఎక్కించాడు. వెనక సైకిలేసుకుని వస్తానన్నాడు. ఇంతవరకూ రాలేదు" అన్నాడు శరభయ్య.

"రిక్షా ఎక్కించినప్పుడు బ్రతికుందా?"

"ఆఁ.... బాగా ఆయాసపడుతూ వుంది."

"ఏం చేస్తాం? వెనక్కి తీసుకెళ్ళు" అన్నాడు వార్డు బాయ్.

"ఎక్కడికి తీసుకెళ్ళమంటావు? ఆయన ఇంకా

రాలేదే?" శరభయ్యకి కంగారు ఎక్కువైంది.

"ఎక్కడ్నుంచి తీసుకొచ్చావో అక్కడికే తీసుకెళ్ళు. ఆయనెవరో వస్తూవుంటాడులే!" అన్నాడు వార్డుబాయ్.

"నాకిప్పుడు అనుమానంగా వుంది."

"ఎందుకు?"

"ఆయనెవరో నా కొంప ముంచడానికి ఈ రోగిష్టి దాన్ని నా బండిలో ఎక్కించాడు" ఏడుపు ముఖం పెట్టి అన్నాడు శరభయ్య.

శరభయ్య అవస్థచూసి వార్డు బాయ్‌కి నవ్వువచ్చింది.

"భలేవాడివే. ఎందుకలా భయపడతావ్?"

"నీకు అలాగే వుంటుందిలే అన్నా! అరగంటయింది వచ్చి. ఆ మనిషేమో అంతూ దరీ లేదు. నే నిప్పుడేం చెయ్యాలి. ఈ శవం ఎంతసేపు వుంచను బండిలో. కొంచెం సాయంపట్టు అన్నా! నీకు పుణ్యం వుంటుంది. ఇక్కడ పడేసి నా దారిన నేను పోతా!" అన్నాడు శరభయ్య.

"చాలు....చాల్లే సామీ! శవాన్ని ఇక్కడ పడేసి పోతావా? మొనగాడివే లెద్దూ! పోలీసులొచ్చి మా ప్రాణం తింటారు. అంతగా తొందరగా వుంటే పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి శవాన్ని వాళ్ళకి ఇచ్చిపో" అన్నాడు వార్డు బాయి.

"వాళ్ళు నన్ను ఏమీ....అనరుగా!"

"నీకెందుకు భయం. జరిగిందంతా చెప్పు" అన్నాడు.

## 2

శరభయ్య దిక్కులు చూస్తూ రిక్షా లాగుతున్నాడు ఆ గడ్డంమినిషి ఎక్కడన్నా కనిపిస్తాడేమోనని చూస్తూ. హాస్పటల్లోంచి బైటపడ్డాడుగాని పోలీస్ స్టేషన్‌కి

వెళ్ళాలంటే గుండె ధైర్యం చాల్లేదు. ఎందుకైనా మంచిది మళ్ళీ ఆ హోటలుకే తీసుకెళ్తే సరి అనుకున్నాడు.

అంత దూరం రిక్షా తొక్కాడు వుసూరుమంటూ. పోయేటప్పుడున్న ఉత్సాహం లేనేలేదు. భయం.... భయంగా వుంది లోపల. ఆ గడ్డంవాడు తనని మోసం చేశాడేమోనని అనుమానంగా వుంది.

అసలు వెంటమనిషి లేకుండా రిక్షా పోనివ్వడం తనదే తప్పు. ఇలా జరుగుతుందని ఎవడనుకున్నాడు? అర్ధ రూపాయి ఎక్కువిచ్చాడని పరిగెత్తాడుగాని శవాన్ని మోసుకుని తిరగాల్సి వస్తుందని కలకన్నాడా ఏం?

హోటలు మధువనం మెయిన్ గేటులో వాచ్ మెన్ అతని రిక్షా ఆపేశాడు.

"నువ్వు పోయిరా కావాలంటే" అన్నాడు.

శరభయ్య కౌంటర్లో కూర్చున్న వ్యక్తిని అడిగాడు.

"గడ్డం బాబు ఎక్కడున్నాడు బాబు?"

కౌంటర్లో వ్యక్తి చిరాకుగా చూసి "ఏ గడ్డం బాబు? పేరూ ఊరూ లేదా?" అన్నాడు.

"నాకు పేరు తెలీదు బాబూ! ఇరవై ఆరో నెంబరు గదిలో వున్నాడు ఆ బాబు. గదిలో లేడు. తాళం వేసి వుంది. చూసొచ్చాను" అన్నాడు శరభయ్య.

కౌంటర్లో వ్యక్తి రిజిష్టర్ ఎత్తిచూసి "అందులో గడ్డంవాడెవడయ్యా? అమృతం అనే ఆవిడ గది తీసుకుంది" అని ముఖం చిట్లించాడు. అతనికి అప్పుడు జ్ఞాపకం వచ్చింది. అంతకు క్రితమే గడ్డంమనిషి రూమ్ ఖాళీ చేసిన సంగతి. అవును ఆ గడ్డం మనిషి తను ఆమె భర్తనని చెప్పు కున్నాడు.

"ఆ గది ఖాళీ అయిపోయిందోయ్! ఎవరూ లేరు" అన్నాడు.

ఆ మాట వినగానే శరభయ్యకి పిడుగు నెత్తిన పడ్డట్లయింది. వణుకుపుట్టింది భయంతో. అతని ముఖం వెలా వెలా పోయింది.

"అయ్యబాబోయ్! ఇప్పుడు నే నేం చెయ్యాలి? ఆ గడ్డపోడు నా కొంపముంచాడు దేవుడోయ్!" అని కేకలు పెట్టాడు శరభయ్య.

"ష్!....ష్!....ఏయ్!....ఏమిటా కేకలు? ఆ గడ్డ పాయన నీకేమైనా డబ్బులివ్వాలా ఏం?"

"డబ్బులు కాదు నా బొందా కాదయ్యా! ఇందాక ఒక ఆడమనిషిని రిక్షాలో ఎక్కించాడు హాస్పిటలుకు తీసుకెళ్ళమని. ఉబ్బసం జబ్బని నెమ్మదిగా తీసుకెళ్ళమనీ తను వెనుక సైకిలేసుకుని వస్తానని చెప్పాడు. నేను హాస్పిటలికి తీసుకెళ్లేసరికి ఆ మనిషి చచ్చిపోయిందయ్యా!"

కౌంటర్లో వ్యక్తి సీట్లోంచి ఎగిరిపడ్డాడు ఆ మాట వినగానే.

"ఏమిటీ చనిపోయిందా?"

"అవునయ్యా బాబూ! వాళ్ళేమో పోలీస్ స్టేషన్ కి తీసుకెళ్ళమన్నారు. ఆ గడ్డపాయన రాక పోయె! ఇక్కడ వుంటాడేమోనని తీసుకొచ్చాను శవాన్ని."

"ఏమిటీ శవాన్ని తీసుకొచ్చావా? ఎక్కడుంది?" కంగారుగా అన్నాడు.

"బైట రిక్షాలో వుంది."

"హమ్మయ్యా! అక్కడేవుంచు. లోపలకు మాత్రం తీసుకురామాక పాడు పీడ. అట్నుంచటే తీసుకెళ్ళి పోలీసుల కివ్వు. ఆ తర్వాత సంగతి వాళ్ళు చూసు

కుంటారు."

"అక్కడికి నేను పోను. వాళ్ళు నన్ను చంపుతారు. నేను ఇక్కడున్నించి తీసుకెళ్ళాను. ఇక్కడే పారేసి పోతాను" అన్నాడు శరభయ్య.

"ఇక్కడ పారేసిపోతావా? ఇక్కడెవరున్నారని, ఆ గడ్డంమనిషి లేనే లేడు గదా!"

"అవన్నీ నాకు తెలీదు. ఆ గది ముందు పారేసి పోతాను."

"నీకేమన్నా మతిగాని పోయిందా ఏమయ్యా? ఇది హోటలనుకున్నావా ఇల్లనుకున్నావా? శవాన్ని ఇక్కడ పడేస్తే ఎట్లాగయ్యా?"

"నన్నేం చెయ్యమంటారైతే?" శరభయ్య అసహనంగా కేకపెట్టాడు.

"నా మాట విని పోలీస్ స్టేషన్ కెళ్ళి చెప్పు. వాళ్ళేదో చేస్తారు. ఇదుగో ఈ పది వుంచుకో" అంటూ ఆ వ్యక్తి కౌంటర్ దిగివచ్చి పదిరూపాయలు శరభయ్యకి ఇచ్చాడు.

పదికాగితం చేతిలోపడ్డాక శరభయ్య శాంతించాడు. రిక్షాలాక్కుని బయల్దేరాడు. పోలీస్ స్టేషన్ కి వెళ్ళాలంటే మాత్రం ధైర్యం చాలడంలేదు. గుండె ధైర్యానికని ఊరి చివర సారాయి త్రాగాలని నిశ్చయించుకున్నాడు.

టౌన్ చివర గుడిసెలమధ్య గవర్నమెంట్ సారాయి దుకాణం వుంది. శరభయ్య రిక్షా ఆ ప్రక్కన ఆపాడు చీకట్లో.

గ్లాసులో సారాయి పోసుకుని మిరపకాయ బజ్జీల పొట్లాం పట్టుకుని కూర్చున్నాడు శరభయ్య.

"ఏరోయ్! శరభా! పెందలాడే వచ్చావ్? గిరాకీ బాగుందా?"

"రారా రోసిగా!" అంటూ జరిగిన కథంతా చెప్పాడు శరభయ్య. తను చెప్పిన గొడవంతా వింటున్నందుకు రోశయ్యకి సారా తనే పోయించాడు శరభయ్య. హోటలాయన ఇచ్చిన పది ఖర్చయిపోయింది.

"రోసిగా! పోలీస్ స్టేషన్‌కి పోవాల. కాస్త తోడు రా....రా!" అని రోశయ్యను అభ్యర్థించాడు, శరభయ్య.

"ఆ మనిషి ఎవరో సూడనియ్యి...." అని రోశయ్య రిక్షా లైటుతీసుకుని దుప్పటి తొలగించి ఆమెను చూశాడు.

"ఎవల్రా ఆ మనిషి నీకు తెలుసా?"

"ఎక్కడా చూసినట్టు లేదు. ఏ కంపెనీ మనిషే మోనని చూశా!.... అది సరేగాని ఈ శవం పోలీసోళ్ళకి ఇస్తావా?"

"ఆఁ... ఇయ్యక మనవేం సేసుకుంటాంరా ఎర్రి నాయాలా?" అని నవ్వాడు శరభయ్య.

"అళ్ళుమాత్రం ఏం చేస్తారేం! ఆ మనిషి మెళ్ళో బంగారం కాస్తా కాజేసి పూడ్చిపెడ్తారు. మనమే ఆ పనిచేస్తే పోలా?" అన్నాడు రోశయ్య.

శరభయ్య మనసులో ఆశ మొలకెత్తింది. ఆ సంగతి తనకెందుకు తట్టలేదు? అని విచారించాడు. రోశయ్య దేవుడిలా కనిపించాడు. లేకపోతే తను ఈ బంగారమంతా పోలీసోళ్ళ మొఖాన పోసివుందేవాడు గదా! అనుకున్నాడు.

"అట్టాగే కానీయ్! బంగారం అమ్మి చెరిసగం పంచుకుందాం. పాపం ఎవరోగాని మన దరిద్రం వదలడానికి వచ్చింది" అని రోశయ్య చెప్పినట్లు చెయ్యడానికి ఒప్పుకున్నాడు శరభయ్య.

# 3

"సార్! ఇరవైఆరో నెంబర్ గదిలో దిగిన అమృతం చచ్చిపోయింది" అన్నాడు.

మధువనం ప్రొప్రయిటర్ నారాయణరావు ఆ మాట విని అదిరిపడ్డాడు. తెల్లబోతూ రిసెప్షనిస్టు వంక చూశాడు.

"ఏమిటీ నిజమేనా? ఎందుకు చచ్చిపోయింది?" అన్నాడు.

"ఆమె దిగింది మొన్న రాత్రిగదా! ప్రొద్దున్నే ఆవిడ మొగుడు దిగాడు. పేరేమిటో తెలియదు. గడ్డం పెంచుకుని వున్నాడు. నిన్న సాయంకాలం ఆవిడకు వుబ్బసం ఎక్కువైందని రిక్షా ఎక్కించి హాస్పిటలుకు పోనివ్వమన్నాడట. ఆక్కడికి పోయేటప్పటికి ఆవిడ పోయిందట."

"అయ్యో! పాపం...." అన్నాడు నారాయణరావు సానుభూతి చూపిస్తూ.

"కాని ఆవిడ మొగుడు హాస్పిటలుకు పోలేదు."

"మరి! ఎటు పోయాడు?"

"ఏమో సార్! ఆవిడ్ని రిక్షా ఎక్కించి తను రూమ్ ఖాళీచేసి వెళ్ళిపోయాడు. గంటతర్వాత రిక్షావాడు శవాన్ని తీసుకుని ఇక్కడికి వచ్చాడు.

"ఏమిటీ?"

"నిజం సార్! వాడొచ్చి ఒకటే న్యూసెన్సుచేశాడు. శవాన్ని ఇక్కడ పారేసి పోతానంటాడు. పదిరూపాయలు వాడి మొఖానకొట్టి శవాన్ని పోలీసులకు అప్పగించమన్నాను సార్!"

"చంపేశావు పోవయ్యా! అంతకంటే ఒక వంద వాడికిచ్చి శవాన్ని పాతిపెట్టిస్తే పోయివుండేది. ఇప్పుడా

పోలీసుల నోటీస్ కిపోతే ఎంత గొడవ జరుగుతుందో? ఛ....ఛ....ఏం పని చేశావయ్యా? అసలే మనం బ్రోతల్స్‌కి రూమ్స్ ఇస్తున్నామని ఒకటే ఏడుస్తున్నారు పోలీసులు" అన్నాడు నారాయణరావు.

"ఇటువంటి కేసులు పోలీసుల నోటీసుకి వెళ్ళకపోతే ఎలా సార్?"

"వెళ్తే ఎలా? వాళ్ళొచ్చి వేసే యక్ష ప్రశ్నలకు ఎవరు సమాధానం చెప్తారయ్యా! మీరంతా బాగానే వుంటారు. మధ్యలో నా చావు కొచ్చింది" అని విసుక్కున్నాడు నారాయణరావు.

అతను తప్పు చేసిన వాడిలా నిల్చున్నాడు.

"సరే నువ్వుపో. నా తిప్పలు నేను పడతాను" అన్నాడు.

అతను వెళ్ళిపోయాడు.

అమృతం ఆటోలో వచ్చి దిగినప్పుడు నారాయణరావు కౌంటర్లోనే వున్నాడు. రిసెప్షనిస్టు విజిటర్స్ రిజిష్టర్లో ఆమెతో సంతకం చేయించుకుని 26 నెంబర్ రూమ్ ఇచ్చాడు.

ఒంటరిగా వచ్చిన ఆడది. మంచి వయసులో వుంది. బ్రోతలు కాదుగదా అనే సందేహం వచ్చింది. ఆమెని కనిపెట్టమని బాయ్‌కి చెప్పి వుంచాడు. అటువంటిదైతే తనూ ఒక చూపు చూద్దామని అనుకున్నాడు.

ఇంతలో ఈ ఘోరం జరిగింది.

అసలా అమృతం జబ్బుతో చచ్చిపోయిందా! లేక మొగుణ్నని వచ్చినవాడు 'చంపి రిక్షాలో పంపించి పోయాడా అనే అనుమానం వచ్చింది నారాయణరావుకి.

ఏమైనా మంచిది పోలీసులు వచ్చి అడిగేవరకూ

వుండటం ఎందుకు? ముందే వివరాలన్నీ వాళ్ళకి చెప్తే గొడవలేకుండా పోతుంది. తను లేనప్పుడొస్తే ఇక్కడున్న మేనేజర్ భయపడి ఏదేదో వాగుతాడు అనుకున్నాడు.

టెలిఫోన్ రిసీవర్ ఎత్తి పోలీస్ సూపరింటెండ్ కి రింగ్ చేశాడు.

"గుడ్ మాణింగ్ సార్! నేను నారాయణరావుని హోటలు మధువనం నుంచి మాట్లాడుతున్నాను సార్!"

"వెరీ గుడ్ మార్నింగ్ మిష్టర్ నారాయణరావ్! హౌ ఆర్ యూ?"

"ఓ.కే. సార్!"

"ఏమిటి విశేషాలు."

"చిన్న విశేషం సార్!"

"అయితే పెద్దదే నన్నమాట. చెప్పండి" నవ్వు వినిపించింది.

"పెద్దదేం కాదు సార్! చిన్నదే. మా హోటల్లో అమృతం అనే ఆవిడ గది తీసుకుంది సార్!"

"ఎప్పుడు?"

"డిసెంబర్ మూడో తారీఖున."

"ఆఁ.... చెప్పండి. ఏం జరిగింది?"

"ఐదో తారీఖు వుదయం....అంటే నిన్న వుదయం ఆమె భర్త వచ్చాడు. నిన్న సాయంకాలం ఆమెకు ఉబ్బసం యెక్కువైందని రిక్షా మాట్లాడి అందులో పడుకోబెట్టి హాస్పిటలుకు తీసుకెళ్ళమనీ, తను వెనుక సైకిలు మీద వస్తానని చెప్పి పంపాడు. ఆ రిక్షావాడు ఆవిడను హాస్పిటలుకు తీసుకెళ్ళేసరికి చనిపోయింది. రిక్షా

వాడిని పింపించి ఆవిడ మొగుడు రూమ్ ఖాళీచేసి వెళ్ళి పోయాడు."

"ఏం యెందుకని? అసలు వాడు మొగుడేనా?"

"ఏమో సార్! అర్థం కావడంలేదు,"

"తర్వాత ఏం జరిగింది?"

"ఆ రిక్షావాడు శవాన్ని ఇక్కడకు తీసుకొచ్చి గోల పెట్టాడు. మా మేనేజర్ శవాన్ని పోలీస్ స్టేషన్‌కి తీసుకెళ్ళమని రిక్షావాడికి చెప్పి పంపాడట. ఇదంతా ఇప్పుడే నాకు తెలిసింది సార్!"

"ఇందులో ఏదో గొడవ వుంది. వాడెవడో ఆవిడ మొగుడై వుండడు."

"నేనూ అదే అనుకుంటున్నాను సార్!"

"సరే నేను కనుక్కుంటాలెండి. అవసరమైతే రిటెన్ కంప్లెంట్ ఇవ్వండి."

"థాంక్స్ సార్!"

నారాయణరావు రిసీవర్ క్రెడిలు చేసి ఊపిరి పీల్చుకున్నాడు.

## 4

యస్.పీ, డి.ఎస్పీని, డియస్పీ సర్కిలు ఇన్స్పెక్టర్లనీ అమృతం శవం ఏం చేశారని వివరాలు అడిగారు. కాని ఏ రిక్షావాడూ అమృతం శవాన్ని పోలీసులకు అప్పగించ లేదని తెలిసింది.

అమృతం శవాన్ని రిక్షావాడు ఏం చేసుకుంటాడు? హోటలునుంచి పోలీస్ స్టేషన్‌కి అమృతం శవాన్ని తీసుకెళ్తుంటే మధ్యలో ఆమె భర్త కన్పించి శవాన్ని స్వాధీనం చేసుకుని వుండొచ్చు.

లేదా శవం మీద విలువైన వస్తువులు తీసుకుని రిక్షా

వాడే యెక్కడైనా పూడ్చిపెట్టి వుండొచ్చు.

రెండువిధాలా జరగడానికి ఆస్కారం వుంది. అసలు ఏం జరిగిందో తెలుసుకోవడానికి క్రైమ్ ఇన్స్పెక్టర్ వినయ్‌కి కేసు అప్పగించారు.

వినయ్ కేసుని హోటలు మధువనం నుంచి పరిశోధిం చాలని నిర్ణయించుకున్నాడు.

ఇన్స్పెక్టర్ వినయ్ వెళ్ళేసరికి హోటలు ప్రొప్రయి టర్ నారాయణరావు ఆఫీస్‌రూమ్‌లో వున్నాడు. సాద రంగా ఆహ్వానించి టీ తెప్పించాడు.

అమృతం తను స్వయంగా వ్రాసిన వివరాలు విజిటర్స్ రిజిష్టర్‌లో చూశాడు వినయ్. అమృతం వైఫ్ ఆఫ్ కాశీనాథ్, ఖమ్మం అని వుంది అందులో. పర్పస్ ఆఫ్ విజిట్‌లో బిజినెస్ అని వుంది. అక్షరాలు పొందికగా వున్నాయి.

"బిజినెస్ అంటే ఏమిటో మీరు అడిగారా?" ప్రశ్నించాడు వినయ్!

"అవన్నీ మేం యెలా అడుగుతాం చెప్పండి. వచ్చే వాళ్ళంతా గౌరవనీయులైన కస్టమర్స్ మాకు. గుచ్చి, గుచ్చి అడిగితే బాధపడతారు" అన్నాడు నారాయణ రావు.

"గౌరవనీయులుగా కన్పిస్తూ స్మగ్లర్స్, దొంగలు కూడా వస్తుంటారు."

"నిజమే సార్! అవన్నీ జరుగుతూనే వుంటాయి" నవ్వాడు నారాయణరావు.

"ఈ రిజిష్టర్‌లో ఆమె రైటింగ్ ఫోటో తీసు కుంటాను. మీకేమైనా అభ్యంతరమా?"

"నో.... నాట్‌టాల్!" అన్నాడు.

ఇన్స్పెక్టర్ వినయ్ అమృతం స్వయంగా వ్రాసిన వివరాలు ఫోటో తీశాడు.

"పోతే అమృతం భర్తనని చెప్పుకున్న వ్యక్తి యెలా వుంటాడో చెప్పగలరా?"

"నేనతన్ని చూళ్ళేదు. అప్పుడు మా మురహరి కౌంటర్లో వున్నాడు. పిలిపిస్తాను" అని నారాయణరావు బజ్జర్ నొక్కాడు.

కాసేపటికి మురహరి వచ్చి ఇన్స్పెక్టర్‌కి విష్ చేశాడు.

"అమృతం భర్తను మీరు చూశారు గదా! యెలా వుంటాడో వివరంగా చెప్పగలరా?"

"పొడుగ్గా వున్నాడు సార్!"

"ఎంత పొడుగుంటాడు? ఆరడుగులు వుంటాడా?"

"అంత పొడుగు వుండడు సార్. అయిదూ తొమ్మిది వుండొచ్చు. సన్నగా వుండటంవల్ల పొడుగని అని పిస్తాడు."

"ఐ. సీ...."

"తెల్లటి బట్టలు వేసుకున్నాడు."

"వూఁ...."

"చామనచాయగా వుంటాడు. గడ్డం పెంచుకున్నాడు సార్!"

"ఎంత గడ్డం? రవీంద్రనాథ ఠాగూర్‌కి వున్నంత వుందా?" నవ్వాడు ఇన్స్పెక్టర్.

"అంతలేదు సార్! రాఘవేంద్రరావుకి వున్నంత వుంటుంది."

"ఆయనెవరు?"

"సినిమా డైరెక్టర్ సార్!"

"ఓ....ఐ.సీ.... నేను ఆయన్నెప్పుడూ చూళ్ళేదు.

నువ్వు చూశావా?"

"నేనూ చూళ్ళేదు సార్! సినిమా పత్రికలలో చూస్తుంటాను. ప్రతి ఫోటోలోను ఆయనకి గడ్డం వుంటుంది. ఆయన నా ఫేవరెట్ డైరెక్టర్ సార్! మీరు అడివిరాముడు, వేటగాడు...."

"సరే! ఇక ఆ గడ్డం సంగతి వదిలెయ్! మనిషిని గుర్తుపట్టడానికి వుపయోగపడేవి వుంటే చెప్పు."

"సార్! ఇప్పుడు గుర్తొచ్చింది. ఆయనగారి ముఖం మీద కాలిన మచ్చవుంది సార్!"

"దట్సాల్! మళ్ళీ ఆ మనిషిని చూస్తే గుర్తుపడతావా?"

"తప్పకుండా!"

"ఇకపోతే ఆ రిక్షావాడి సంగతేమిటి? వాడు ఎక్కడుంటాడు? ఎలా వుంటాడు?"

"నల్లగా దున్నపోతులా వున్నాడు సార్! తలపాగా చుట్టుకున్నాడు...."

"తెలిసినవాడేనా?"

"నాకు తెలీదు సార్!"

"అతన్ని మీరు తప్ప ఇంకెవరైనా చూశారా?"

"గేటుదగ్గర వాచ్‌మాన్ చూశాడు సార్! రిక్షా లోపలకు రావడానికి వీల్లేదని అడ్డుపెడితే అక్కడ ఆపి తను వచ్చాడు."

"ఆ వాచ్‌మాన్‌ని పిలిపించండి."

తర్వాత వాచ్‌మాన్ వచ్చాడు. అతను గూడా తను ఆ మనిషిని అప్పుడప్పుడూ చూస్తుంటానని చెప్పాడు గాని తెలిసినవాడు మాత్రం కాదన్నాడు. ఇకపోతే ఒక కొండ గుర్తు చెప్పాడు.

ఆ రిక్షా గూడు రిక్షా. దానికి రెండువేపులా సినిమాల పేర్లు రాసివున్నాయి. ఒక వేపు సరదా రాముడు, మరొక వేపు సర్దారు పాపారాయుడు. రెండువేపులా యన్ టి ఆర్ బొమ్మలు కన్పిస్తాయి.

"26 నెంబర్ రూమ్‌లోకి ఎవరైనా వచ్చారా?"

"లేదుసార్ ఖాళీగా వుంది" అన్నాడు మురహరి.

ఇన్స్పెక్టర్ వినయ్ రూమ్ తెరిచి చూశాడు.

డస్టుబిన్‌లో ఆర్.టీ.సి. బస్ టిక్కెట్లు దొరికాయి. నాలుగు ముక్కలుచేసి పారేసిన కరపత్రం వుంది. ఆ ముక్కలన్నీ జాయింట్ చేసి చూశాడు.

అదొక నాటకం తాలూకు కరపత్రం. కురుక్షేత్రం నాటకం డిసెంబర్ ఆరో తారీఖు రాత్రి పదిగంటలకు టౌన్ హైస్కూల్లో అని క్రింద రేట్లు వేసివున్నాయి. ఆ నాటకం గుంటూరులో జరగబోతున్నది. అంటే అతను గుంటూరునుంచి వచ్చివుంటాడా?

## 5

సరదారాముడు, సర్దార్ పాపారాయుడు సినిమాల పేర్లు పెయింట్ చేసిన గూడు రిక్షా పోలీసులు సులభంగానే ట్రేస్ చేశారు.

కాని ఆ బండిని శరభయ్య నడపడంలేదు. ఆ రోజు శరభయ్య రాలేదు. యజమాని దాన్ని గోపయ్యకి ఇచ్చాడు.

తన బండిని పోలీసులు చుట్టుముట్టగానే గోపయ్య భయంతో బిగుసుకు పోయాడు. నేనేమీ ఎరగనని మొత్తుకున్నాడు. నిన్న ఈ బండి తను తోలలేదని చెప్పాడు.

రిక్షాల యజమాని చెప్పిన సమాచారంబట్టి శరభయ్య

నిన్న ఈ బండిని తోలినట్టు పోలీసులకు తెలిసింది.

శరభయ్య సారాయి తాగి పడుకున్నాడు. గుర్రుపెట్టి హాయిగా నిద్రపోతున్నాడు. గుడిసెలోకి పోలీసులు రాగానే శరభయ్య పెళ్ళాం గుడ్లు తేలేసి చూస్తుండి పోయింది. శరభయ్యని నిద్రలేపి పోలీస్ స్టేషన్‌కి తీసుకు పొయ్యారు.

ముందు తనకేమీ తెలియదని బుకాయించాడుగాని నాలుగు తగలనిచ్చాక నిజం చెప్పాడు. రోశయ్య సలహా మీద అమృతం వంటిమీదున్న బంగారం అంతా తీసుకుని స్మశానంలో పూడ్చిపెట్టామన్నాడు.

కాని వాళ్ళు అనుకుంటున్నట్లు ఆమె వంటిమీదున్నది అంతా బంగారం కాదు. చెవులకున్న దుద్దులమాత్రమే బంగారం. మెడలో నెక్లెస్, చేతులకున్న గాజులు రోల్డు గోల్డువే. ఆమె కాళ్ళకున్న వెండిపట్టీలు, దుద్దులు అమ్మితే మూడొందలు వచ్చాయి. వాటిని ఇద్దరూ పంచుకున్నారు.

పోలీసులు శరభయ్యతో పాటు, రోశయ్యనుగూడా అరెస్టుచేశారు. ఇద్దరూ కటకటాలు లెక్కపెడుతూ ఏడుస్తూ కూర్చున్నారు ఒకరొన్నొకరు తిట్టుకుంటూ. పూల్‌చంద్‌కి అమ్మిన దుద్దులు, పట్టీలు తెచ్చి స్టేషన్‌లో పెట్టారు. రోల్డుగోల్డు నెక్లెస్, గాజులు శరభయ్య పెళ్ళాం తెచ్చి ఇచ్చింది.

స్మశానంలో అమృతం శవాన్ని బైటికితీసి ఫోటోలు తీయించాడు ఇన్స్పెక్టర్. తర్వాత పోస్టుమార్టమ్ రిపోర్టు కోసం హాస్పిటలుకు పంపించాడు.

అమృతం విషప్రయోగంవలన మరణించివుండొచ్చునని డాక్టర్ అభిప్రాయం వ్యక్తంచేశాడు. తుది నిర్ణయం కోసం విసిరా తీసి కెమికలు ఎగ్జామినర్‌కి పంపించారు.

# 6

"వెల్కమ్ మిస్టర్ వినయ్!" అంటూ ఆహ్వానించాడు ఇన్స్పెక్టర్ అజీజ్.

ఇన్స్పెక్టర్ వినయ్ విష్ చేసి కూర్చున్నాడు.

ప్రక్కనే కూర్చున్న యువకుణ్ని పరిచయం చేశాడు అజీజ్.

"మీట్ మిస్టర్ ప్రవీణ్, ప్రైవేట్ డిటెక్టివ్."

"గ్లాడ్ టూ మీట్ యూ!" అని ప్రవీణ్ వినయ్‌తో చెయ్యి కలిపాడు.

ముగ్గురూ కాసేపు మాట్లాడుకున్నారు.

"వినయ్! ఏమిటి విశేషాలు? మా ఊరు ఎందుకొచ్చావు?" అడిగాడు ఇన్స్పెక్టర్ అజీజ్.

"డ్యూటీ మీదనే" అన్నాడు వినయ్.

"ఏమిటి సంగతి?"

"ఒక మర్డర్ కేసు ఇన్వెస్టిగేట్ చేస్తున్నాను. హంతకుడు మీ ఊరు వాడని అనుమానం మీద వెతుక్కుంటూ వచ్చాను."

టెలిఫోన్ గణగణ మ్రోగింది.

"మర్డర్ కేసు అనగానే ఫోన్ రింగైంది. ఏదో మర్డర్ కేసు పిలుస్తున్నట్లే వుంది మనల్ని" అంటూ ఇన్స్పెక్టర్ అజీజ్ నవ్వుతూ రిసీవర్ ఎత్తాడు.

"ప్రొద్దున్నే మర్డర్ కేసేమిటి? వేళాపాళా లేకుండా" అన్నాడు వినయ్.

"మర్డర్ ఏ రాత్రో జరుగుతుంది. తెలిసేది ప్రొద్దున్నే గదా!" అన్నాడు డిటెక్టివ్ ప్రవీణ్ నవ్వుతూ.

"మొత్తానికి డిటెక్టివ్ అనిపించుకున్నావు గదా!" అన్నాడు అజీజ్.

"ఇన్స్పెక్టర్ అజీజ్ స్పీకింగ్ ప్లీజ్!"

"సార్! నేను విమల్ ప్లాస్టిక్ ఫ్యాక్టరీనుంచి మాట్లాడుతున్నాను. మా ప్రొప్రయిటర్ గారిని ఎవరో మర్డర్ చేశారు సార్!"

"ఎవరు నువ్వు?"

"నేనిక్కడ ఎక్కౌంటెంట్ కమ్ టైపిస్టుని సార్!"

"నీ పేరేమిటి?"

"నా పేరు మునుస్వామినాయుడు సార్!"

"సరే మీ ఫ్యాక్టరీ అడ్రస్ చెప్పు."

ఇన్స్పెక్టర్ అజీజ్ విమల్ ప్లాస్టిక్ ఫ్యాక్టరీ అడ్రస్ నోట్ చేసుకున్నాడు.

"నేను ఇప్పుడే వస్తున్నాను. అక్కడ ఎవర్నీ ఏమీ ముట్టుకోనివ్వకు" అని రిసీవర్ పెట్టేశాడు అజీజ్.

"ఎక్కడ చూసినా మర్డర్ కేసులే!" అని నవ్వాడు వినయ్.

"ఇక మనం హత్యజరిగిన ప్రదేశానికి వెళ్దాం. ముగ్గురం కలిస్తే కేసు తొందరగా తేలిపోతుంది" అన్నాడు అజీజ్.

"ముగ్గురం కలిస్తే కేసు ముందమోస్తుందేమో!" అని నవ్వాడు ఇన్స్పెక్టర్ వినయ్.

విమల్ ప్లాస్టిక్ ఫ్యాక్టరీ విజయవాడ రోడ్డులో టౌన్ చివరవుంది. పోలీస్ వ్యాన్ వెళ్లేసరికి గుంపులుగా వున్న జనం బెదిరిపోయారు. కానిస్టేబుళ్లు జనాన్ని దూరంగా పంపించివేశారు.

మునుస్వామినాయుడు తనను పరిచయం చేసుకున్నాడు. హత్య జరిగిన ప్రదేశానికి తీసుకెళ్ళారు. హత్య ఆఫీసు రూంలోనే జరిగింది.

"మీ ప్రొప్రయిటర్ పేరు ఏమిటి?" ప్రశ్నించారు అజీజ్.

"హనుమంతరావు" అన్నాడు మునుస్వామినాయుడు.

సోఫా కమ్ బెడ్ మీద వెల్లకిలా పడుకుని వున్నాడు హనుమంతరావు. తల క్రింద దిండువుంది. వంటిమీద బనీనుమాత్రమే వుంది. లుంగీ కాళ్ళమీద కప్పివుంది. గుండెల్లో కత్తిని దించినట్లు గాయం కనిపిస్తోంది. కత్తితో పొడిచినందువల్లే చనిపోయి వుండొచ్చు.

ఇన్స్పెక్టర్ వినయ్‌కుమార్ ఆశ్చర్యంగా చూశాడు హనుమంతరావుని. అమృతం భర్త పోలికలు అన్నీ అతనికి వున్నాయి. పొడుగ్గా వున్నాడు. గడ్డం వుంది. ముఖాన కాలిన మచ్చ. రంగు గూడా చామనచాయే.

'ఇతడు అమృతం భర్త కాదు గదా!' అనే సందేహం మనసులో కుమ్మరిపురుగులా తొలుస్తోంది.

తన జేబులోవున్న డైరీ తిరగేశాడు. అతను హోటలు మధువనం వచ్చిన తేదీ చూశాడు. డిసెంబర్ అయిదో తేదీన వచ్చాడు. అమృతం మీద విషప్రయోగం జరిగింది అదే రోజున సాయంకాలం.

మునుస్వామిని ప్రక్కకు పిలిచి "డిసెంబర్ ఐదో తేదీ మీ ప్రొప్రటర్ ఊళ్ళో వున్నాడా?" అని అడిగాడు ఇన్స్పెక్టర్ వినయ్.

మునుస్వామి గాద్రేజ్ బీరువా తెరిచి ఫైల్లో కాగితాలు తిరగేసి "ఆ రోజు వుదయం హైదరాబాద్ వెళ్ళారు సార్! మళ్ళీ మర్నాటి రాత్రికి తిరిగివచ్చేశారు" అన్నాడు.

"మీ ప్రొప్రయిటర్‌కి ఎవరైనా శత్రువులు వున్నారా?" ప్రశ్నించాడు అజీజ్.

మునుస్వామి తనకేమీ తెలియదని చెప్పాడు.

హత్యకు ఉపయోగించిన కత్తి దొరకలేదు. అది హంతకుడే తీసుకుని పారిపోయి వుంటాడు.

"మీ ప్రొప్రయిటర్ రాత్రిపూట ఇక్కడే పడుకుంటాడా?"

"ఏమోసార్! నేసెప్పుడూ నోటీస్ చెయ్యలేదు" అన్నాడు మునుస్వామి.

"రాత్రిమాత్రం ఇక్కడే పడుకున్నాడు" అన్నాడు డిటెక్టివ్ ప్రవీణ్.

"మీ ప్రొప్రయిటర్‌కి పెళ్ళికాలేదా?"

"అయింది సార్! ఇద్దరు పిల్లలుగూడా! ఆ యమ్మకు ఇప్పుడే కబురు పంపాను" అన్నాడు మునుస్వామి.

వినయ్ జేబులోంచి అమృతం ఫోటోతీసి "ఈమె నీకు తెలుసా?" అని అడిగాడు.

మునుస్వామి తల అడ్డంగా వూపి, ఆవిడను ఎన్నడూ చూడలేదని చెప్పాడు.

ఫోటోగ్రాఫర్ ఫోటోలు తీస్తున్నాడు. ఫింగర్ ప్రింట్స్‌కోసం వెతుకుతున్నాడు వేలిముద్రల నిపుణుడు.

"డిటెక్టివ్‌గారూ మీ వుద్దేశ్యం ఏమిటి? పరిశోధన మొదలు పెట్టండి" అన్నాడు ఇన్స్‌పెక్టర్ అజీజ్.

"నా పరిసోధన ఎప్పుడో పూర్తి చేశాను" అన్నాడు ప్రవీణ్.

"ఏమిటి అంత క్విక్‌గానా?" ఆశ్చర్యంగా అన్నాడు అజీజ్.

"మనం తీరిగ్గా చెట్టుక్రింద కూర్చుందాం రండి. మర్డర్ చేసిన వాళ్ళని అక్కడికే రప్పిద్దాం" అన్నాడు డిటెక్టివ్ ప్రవీణ్ ఆఫీసు రూంలోనుంచి బైటపడుతూ.

వేపచెట్టుక్రింద కుర్చీలు వేయించాడు మునుస్వామి. ముగ్గురూ అక్కడ కూర్చున్నారు.

"ఈ హత్యచేసింది ఒక ఆడది" అన్నాడు ప్రవీణ్ సిగరెట్ వెలిగిస్తూ.

"ఎలా చెప్తారు? ప్రశ్నించాడు అజీజ్.

"మీరు గమనించలేదేమో! సోఫాక్రింద చిన్న చిన్న గాజు ముక్కలు వున్నాయి. బంతిపూల రేఖలు సోఫాలో ఇరుక్కుపోయి కనిపిస్తున్నాయి. తర్వాతి హనుమంతరావు ఆఫీసురూమ్‌లో పడుకోవడానికి కారణం ఏమిటి? అవసరం ఏమిటి? సింపుల్. అతను పరాయి ఆడదానితో గడపడానికి మాత్రమే అని మనం అనుకోవచ్చు. అది గూడా అతని ఫ్యాక్టరీలో పనిచేసే ఆడమనిషి కూడా అయివుంటుంది" అన్నాడు డిటెక్టివ్ ప్రవీణ్.

ఇన్స్‌పెక్టర్ అజీజ్ తల వూపాడు.

"హంతకురాలు ఎవరో ఇప్పుడే తేల్చివేస్తాను. మునుస్వామినాయుడ్ని పిలిపించండి" అన్నాడు ప్రవీణ్.

అజీజ్ కానిస్టేబులుతో మునుస్వామినాయుడికి కబురు చేశారు.

అతను వచ్చి చేతులు కట్టుకుని నిల్చున్నాడు. అతనిలో అంతులేని ఆందోళన కనిపిస్తోంది.

"చూడండి నాయుడుగారూ! మీకు తెలిసిన విషయాలు దాచకుండా చెప్పాలి" అన్నాడు ప్రవీణ్.

అతను తల వూపాడు.

"మీ ప్రొప్రయిటర్ లేనప్పుడు అన్ని వ్యవహారాలూ మీరే చూస్తారుగదూ?"

"అవును సార్!"

"మీ ప్రొప్రయిటర్‌కి స్త్రీ వ్యసనం వుంది గదూ?"

మునుస్వామి తల వూపాడు నిజమేనన్నట్లు.

"వెరీగుడ్! పోతే మరొక్క సంగతి. మీ ఫ్యాక్టరీలో యెంతమంది ఆడవాళ్ళు పని చేస్తున్నారు?"

చెప్పాడు మునుస్వామి.

"అందులో మీ ప్రొప్రయిటర్ కి యెవరితోనన్నా సంబంధం వుందా?"

"నాకు అంతగా తెలియదు సార్! నేను అవన్నీ పట్టించుకోను" అన్నాడు అతను.

"పోనివ్వండి మీకు తెలియకపోతే. నైట్ వాచ్ మాన్ వున్నాడా?"

"వున్నాడు సార్!"

"రాత్రి డ్యూటీ చేసిన అతను ఎవరు?"

"కొండయ్య సార్!"

"ఇప్పుడు వున్నాడా?"

"వున్నాడు సార్! అతనే ముందు శవాన్ని చూసింది" అన్నాడు మునుస్వామినాయుడు.

"పిలిపించండి" అన్నాడు ప్రవీణ్.

ఖాకీ బట్టల్లో లావుగా, పొట్టిగా వున్న కొండయ్యకి ఏభై ఏళ్ళు పయినే వుంటాయి. బట్టతల. పిల్లికళ్ళు. భయం భయంగా వచ్చాడు.

"నీ పేరు కొండయ్య కదూ?" ప్రశ్నించాడు ప్రవీణ్.

"అవునయ్యా!...." వినయంగా వంగుతూ చెప్పాడు కొండయ్య.

"కొండయ్యా! మీ అయ్యగారి శవాన్ని అందరికంటే ముందు చూసింది నువ్వే కదూ?"

"అవునయ్యా!.... తెల్లవారాక అయ్యగారి ఆఫీసు తలుపులు తీసివుంటే ఏమయినా కావాలేమో అడగడానికి

వెళ్ళానయ్యా! వెళ్ళేసరికి చచ్చిపోయి వుండారు. భయం వేసి పారిపోయి వచ్చాను. ఆ సంగతి నాయుడిగారింటికి వెళ్ళి చెప్పాను" అన్నాడు కొండయ్య.

"మీ అయ్యగారితో పాటు రాత్రి వున్న ఆడమనిషి యెవరు?"

కొండయ్య ఆ ప్రశ్నకు అదిరి పడ్డాడు.

"ఆడమనిషా?....ఎవరూ లేరు బాబూ!" అన్నాడు బుర్ర గోక్కుంటూ.

"వున్నారు. ఎవరో నీకు బాగా తెలుసు" అన్నాడు ప్రవీణ్.

"లేదయ్యా!....ఆడోళ్ళెవరూ లేరు. అయ్యగారే పొద్దుపోయేదాకా పని చేసుకుని పడుకున్నారు" అన్నాడు కొండయ్య.

"చూడు కొండయ్యా! నన్ను అనవసరంగా వాగించకు. మర్యాదగా చెప్పు!"

ఎంత అడిగినా యెవరూ లేరనే చెబుతూ వచ్చాడు కొండయ్య.

"ఇన్‌స్పెక్టర్ గారూ! కొండయ్య దగ్గరే వుంది కథ. తగిన విధంగా సత్కరిస్తే తెలుస్తుంది" అని నవ్వాడు ప్రవీణ్.

ఇన్‌స్పెక్టర్ అజీజ్ కొండయ్యను దూరంగా ఫ్యాక్టరీ షెడ్‌లోకి తీసుకెళ్ళి బెల్టుతో నాలుగు తగలనిచ్చాడు.

ఆ దెబ్బలకు తట్టుకోలేక కొండయ్య నిజం చెప్పాడు. రాత్రి తన యజమానితో మాలతి అనే ఆవిడ వుందని, కాని యెవరికీ చెప్పవద్దని కొండయ్యకి వందరూపాయిలు లంచం యిచ్చింది.

మంగళదాస్ నగర్లో ఒక పెంకుటింట్లో వుంటోంది మాలతి.

పోలీసులు తన ఇంటికి వస్తారని ఆమె వూహించలేదు. అందుకే నిర్భయంగా ఇంట్లోనే వుంది.

పోలీస్ వ్యాన్ కొండయ్యతోసహా వస్తున్న పోలీసుల్ని చూసి స్థాణువైపోయింది మాలతి. ఎటూ పోవడానికి దారిలేక నిలబడిపోయింది. ఆమెను పట్టుకుని వ్యాన్లో యెక్కించి స్టేషన్కి తీసుకుపోయారు.

శ్రమ పడకుండానే తను చేసిన నేరం ఒప్పుకుంది మాలతి. హత్య చేయడానికి కారణం పగ. ఆమె తన కథ చెప్పింది.

మాలతి భర్త ధర్మారావు. మాలతి అతని రెండో భార్య. ఏభై సంవత్సరాల వయస్సులో భార్య చనిపోతే మాలతిని పెళ్ళి చేసుకున్నాడు. మాలతికి పెళ్ళినాటికి పాతికేళ్ళు. ఆమె పెళ్ళి అప్పటివరకూ జరగకపోవటానికి కారణం పుట్టింటి దరిద్రమే.

ధర్మారావు మొదటి భార్యకు ఇద్దరు కొడుకులు. పెద్దబ్బాయి డాక్టర్. రెండో కొడుక్కి చదువు అబ్బలేదు. బిజినెస్లో వున్నాడు. ధర్మారావుకి హోల్ సేలు మెడికలు షాపు వుంది.

హనుమంతరావు ఆ షాపులో పని చేసేవాడు. ధర్మారావు ఆరోగ్యం సరిగా వుండేది కాదు. షుగర్ కంప్లయింట్తో బాధపడుతూ వుండేవాడు. అప్పుడప్పుడూ నర్సింగ్ హోమ్లో ఇన్ పేషెంట్గా వుండాల్సొచ్చేది.

పరిస్థితులకు రాజీపడి మాలతి ధర్మారావుని పెళ్ళి చేసుకుంది కాని, ఆమెకు ఏమీ సుఖం లేకుండా పోయింది.

రోగిష్టి భర్తకు సేవలు చెయ్యటం, కోరికలతో మండి పోతూ నిద్ర పట్టక నరకం అనుభవించటం ఆమె ఎక్కువ రోజులు భరించలేకపోయింది.

హనుమంతరావుతో ఆమెకు సంబంధం కలిగింది. దొంగతనం, రంకుతనం యెక్కువ రోజులు దాగవు.

ధర్మారావు చిన్న కొడుకు పిన్నిగారి రహస్య ప్రేమ కలాపం గ్రహించాడు. తండ్రికి చెప్పి పిన్నిని అల్లరిపాలు చెయ్యటం బాగుండదనీ అందువల్ల ప్రయోజనమూ వుండదనీ తెలుసుకుని, హనుమంతరావుకి వుద్వాసన చెప్పి ఒక వయసు మళ్ళినవాడిని పనిలో పెట్టుకున్నాడు.

పనిలోనుంచి తీసివేసినా వాళ్ళమధ్య సంబంధం నిరాటంకంగా కొనసాగుతూనే వుంది. హనుమంతరావుకు తనే కావలసిన డబ్బు యిస్తూ ఇబ్బంది లేకుండా చూస్తూ వుంది మాలతి. కాని ఇదివరకటిలా ఆమె అతనితో సుఖం అనుభవించడానికి వీల్లేకుండా వుంది.

హనుమంతరావు ఆమె అవస్థ గ్రహించి ఒక వుపాయం చెప్పాడు. అది ధర్మారావుని గుట్టుచప్పుడు కాకుండా పైకి పంపించి వెయ్యడం.

ఈ లోపల ఆమె తన నగలన్నీ తెచ్చి ఇవ్వాలి. వీలైనంత డబ్బు గూడా చేర్చాలి. దినవారాలైన తర్వాత ఆమె కొన్నాళ్ళు పుట్టింట్లో గడుపుతుంది. ఈ లోపల హనుమంతరావు తన స్వస్థలమైన గుంటూరులో ఆ డబ్బుతో ఏదోక బిజినెస్ చేపడతాడు. కొన్ని రోజులు గడిచాక ఇద్దరూ పెళ్ళిచేసుకుని హాయిగా వుంటారు. అదీ పథకం.

మాలతి అందుకు సంతోషంగా ఒప్పుకుంది. తన నగలన్నీ హనుమంతరావుకి ఇచ్చింది.

కాని ధర్మారావుకి విషం ఇచ్చి చంపడం బైటికి పొక్కింది. పోలీసులు ఆమెమీద నేరాన్ని రుద్దారు. చిన్న కొడుకు సాక్ష్యం చెప్పాడు. ఆమె అక్రమ ప్రవర్తన వెల్లడైంది. ఆమే విషం ఇచ్చి చంపినట్లు రుజువైంది. ఏడేళ్ళు జైలుశిక్ష వేశారు. హనుమంతరావుకి ఏ ప్రమాదమూ జరగలేదు.

గుంటూరులో హనుమంతరావు ప్లాస్టిక్ ఫ్యాక్టరీ పెట్టుకున్నాడు. పెళ్ళిచేసుకున్నాడు.హాయిగా వున్నాడు. మాలతి జైలునుంచి తిరిగివచ్చేసరికి అతనికి ఇద్దరు పిల్లలు పుట్టారు.

హనుమంతరావు, మాలతికి ఇచ్చిన మాట నిలబెట్టుకోలేదు. ఆమె జైలునుంచి తిరిగివచ్చేవరకూ పెళ్ళిచేసుకోకుండా బ్రహ్మచారిగా వుంటాననీ ఆమెను తప్ప ఎవర్నీ పెళ్ళిచేసుకోననీ మాలతిని నమ్మించాడు.

ఆమె జైలులో ఎన్నో కలలుకంది. ఏడేళ్ళ తర్వాత ఆమె తన జీవితం సుఖంగా గడిచిపోతుందనీ, హనుమంతరావు తనను పెళ్ళిచేసుకుంటాడనీ ఆశతో కాలం గడిపింది.

జైలునుంచి తిరిగివచ్చాక తనను హనుమంతరావు మోసంచేశాడని గ్రహించింది. మాలతికి అతను ఏదో నచ్చజెప్పాడు. తన తల్లి రోగంతోవుండి చనిపోయేలోపల పెళ్ళిచేసుకోమని కోరిందనీ అందువల్ల పెళ్ళిచేసుకోక తప్పలేదనీ చెప్పాడు.

అయినా సరే తననుగూడా పెళ్ళిచేసుకోమని మాలతి అతన్ని కోరింది. కాని హనుమంతరావు అందుకు ఒప్పుకో

లేదు. ఆమెను వుంపుడుగత్తెగా మాత్రమే వుంచాడు. తన నగలన్నీ కాజేసి వాటిని అమ్మి ఇంతవాడైన హనుమంతరావు తనకు ద్రోహంచెయ్యడం ఆమె భరించలేక పోయింది. అందుకే సమయం చూసి అతన్ని హత్య చేసింది.

ఇన్స్పెక్టర్ వినయ్ హనుమంతరావు డెడ్ బాడీ ఫోటో ఒకటి తీసుకుని డైరీలో పెట్టుకున్నాడు. తను వచ్చిన పని చెప్పేసరికి ఇన్స్పెక్టర్ అజీజ్ గూడా ఆశ్చర్యపోయాడు. హనుమంతరావు అమృతం అనే ఆవిడని విషప్రయోగంతో చంపి, తప్పించుకుని వచ్చిన కథంతా శ్రద్ధగా విన్నాడు.

"అమృతాన్ని చంపిన వ్యక్తి ఇతనేనిని అనుమానిస్తున్నాను. వాళ్ళు చెప్పిన పోలికలన్నీ ఇతనికి సరిపోయాయి. పైగా డిసెంబర్ ఐదో తారీఖున తను హైదరాబాద్ వెళ్తున్నానని చెప్పి ఆ మర్నాడు తిరిగి వచ్చాడట" అన్నాడు వినయ్.

"వీడు నిజంగా దేవాంతకుడే. ఆడవాళ్ళను వలలో వేసుకుని డబ్బు సంపాదించడంలో మొనగాడిలా వున్నాడు. ఆ అమృతం కథ గూడా ఇదే ననుకుంటా. పెళ్ళిచేసుకుంటానని మోసం చేసి డబ్బులాగి వుంటాడు దుర్మార్గుడు" అన్నాడు ఇన్స్పెక్టర్ అజీజ్.

"ఇది అమృతం డెడ్ బాడీ ఫోటో. మీ దగ్గర వుంచండి. అవసరమైతే నన్ను పిలవండి. మెసేజ్ ఇస్తే వస్తాను. ఆమెను హత్యచేసిన వ్యక్తి హత్యచేయబడ్డాడు. కాబట్టి, మాకు ఇబ్బందిలేదు. ఇక అమృతం ఎవరో తెలుసుకోవాలి" అన్నాడు ఇన్స్పెక్టర్ వినయ్.

# 8

హనుమంతరావు డెడ్ బాడీ ఫోటో చూపిస్తే హోటలు మధువనంలో రూం బాయ్, మురహరి అతనే అమృతం భర్తనని చెప్పిన మనిషి అని గట్టిగా చెప్పారు. రిక్షా పుల్లర్ శరభయ్య కూడా హనుమంతరావుని గుర్తు పట్టాడు.

అమృతం మీద విషప్రయోగం చేసిన వ్యక్తి మర్డర్ కావించబడినప్పుడు కేసు పెట్టే పనిలేదు. కేసు తేలిపో యిందని పోలీసు అధికారులు భావించారు.

అయితే అమృతం ఎవరో తెలుసుకునేందుకు ఆమె డెడ్ బాడీ ఫోటోలు అన్నీ పోలీస్ స్టేషన్ లకీ పంపించారు ఎవరైనా గుర్తుపడితే తెలియజేయమని. అదొక మంచి పనే అయ్యింది.

అమృతం తను ఖమ్మంనుంచి వచ్చినట్లు రిజిష్టర్లో రాసింది. అది తప్పు. పైగా తను కాశీనాథ్ భార్యనని రాసిందీ శుద్ధ తప్పే. ఆమెకు పెళ్ళికాలేదు. ఆ గడ్డం మనిషి రిక్షా శరభయ్యతో తాము ఏలూరునుంచీ వచ్చా మని చెప్పిందీ అబద్ధమే. అసలు అమృతం పేరు అమృతమే కాదట.

ఆమె అసలు పేరు అరుంధతి. రెండేళ్ళ క్రితం ఆమె నొక వ్యభిచార గృహంలో చూశాననీ, రెయిడింగ్ లో ఆమెను పట్టుకుని కోర్టులో హాజరుపెట్టాననీ ఇన్స్పెక్టర్ కుమార్ కాకినాడనుంచి తెలియచేశాడు.

ఇన్స్పెక్టర్ వినయ్‌కి మళ్ళీ ప్రయాణం తగిలింది. కాకినాడ వెళ్ళి ఇన్స్పెక్టర్ కుమార్ ని కలుసుకున్నాడు.

"ఆమె అరుంధతే. సందేహంలేదు" అన్నాడు కుమార్.

ఇద్దరూ కలిసి కాంతమ్మ ఇంటికి వెళ్ళారు. చంద్రకాంతం ఏభై ఏళ్ళు పైబడిన వారకాంత. లావుగా కదల్లేకుండా వుంది. పాన్‌లు నవుల్తూ గారపట్టిన పళ్ళను బైటికి పెట్టి ఏడవలేక నవ్వింది. పోలీసుల్ని చూసి ఎక్కడి వాళ్ళక్కడ సర్దుకున్నారు గప్‌చిప్‌గా. అప్పుడు మధ్యాహ్నం ఒంటిగంట దాటింది.

"కంగారుపడకు రైడింగ్‌కి రాలేదులే" అని అభయ మిచ్చాడు కుమార్.

చంద్రకాంతం ముఖంలోకి కాస్త కళవచ్చింది. ఇద్దర్నీ మెత్తటి సోఫాల్లో కూర్చోబెట్టింది. కూల్ డ్రింక్స్ తెప్పించి టీపాయ్‌ముందు పెట్టింది. భోజనంచేసే వేళ యిందని ఇద్దరూ తీసుకోలేదు.

"మర్యాదాలకేమిలే. ముందు ఈ సంగతి చెప్పు? నీ ఇంట్లో అరుంధతి అనే అమ్మాయి వుండాలి ఏమైంది? ఇప్పుడు వుందా?" అని ప్రశ్నించాడు కుమార్.

"ఎక్కడ అరుంధతి బాబూ! ఎప్పుడో వెళ్ళిపో యింది" అంది చంద్రకాంతం.

"ఎక్కడికి పోయింది?"

"ఎవరో ఒక బాబొచ్చాడు. దాన్ని బాగుసేస్తానని వెంట తీసికెళ్ళాడు."

"ఎన్నాళ్ళయింది?"

"సంవత్సరన్నర పైనే అయ్యింది."

"ఎవరా బాబు?"

"ఏమో! నాకు పేరు తెలీదు."

"ఈ వూరేనా?"

"కాదు. బెజవాడని చెప్పాడు."

"ఇంకా ఏం చెప్పాడు?"

"ఎందుకు బాబూ ఇయ్యన్నీ అడుగుతున్నారు?" తన అనుమానం బైటపెట్టింది చంద్రకాంతం.

ఇన్స్పెక్టర్ వినయ్ అమృతం డెడ్ బాడీ ఫోటో చంద్రకాంతానికి అందించాడు. అది చూసి చంద్ర కాంతం లబలబ కొట్టుకుంది. బంగారంలాంటి పిల్లను చంపాడని ఏడ్చింది. దానికి చావు రాసిపెట్టి తన దగ్గ ర్నుంచి వెళ్ళిపోయిందని విచారించింది.

"అరుంధతిని తీసుకెళ్ళాడని చెప్పిన అతనికి గడ్డం వుందా?"

"గడ్డం లేదు ఏమీలేదు. కుర్రాడే బాబూ! దాన్నేం మాయ చేశాడోగాని వెళ్ళిపోతానని కూసుందా తెలివి తక్కువ ముండ. అది నాకియ్యాల్సిన డబ్బంతా కట్టి తీసుకపొయ్యాడు."

"బెజవాడలో ఏం చేసేవాడో చెప్పాడా?"

"ఆ కుర్రాడు నాకేం చెప్పలేదు బాబూ! అదే చెప్పింది అన్నీ."

"ఏం చెప్పింది."

"ఏదైనా పని నేర్పిస్తానని చెప్పాడంట. చదువు కుంటే చెప్పిస్తానన్నాడంట."

"అది సరే! అతనేం చేసేవాడో చెప్పాడా?"

"అతనికి ఏదో వ్యాపారం అని చెప్పింది. అంత కంటే నాకేం తెలీదు" అంది చంద్రకాంతం.

ఇన్స్పెక్టర్లు ఇద్దరూ ముఖాలు చూసుకున్నారు. అతని అడ్రస్ ట్రేస్ చెయ్యడం ఎలాగో అర్థంకాలేదు.

వినయ్ మనసులో ఒక మెరుపు మెరిసింది.

"అరుంధతితో బాగా స్నేహంగా వున్న అమ్మాయితో అన్నీ చెప్పివుంటుంది. ఆమెతో స్నేహంగా తిరిగిన

అమ్మాయి ఎవరైనా వుంటే పిలిపించండి. ఆమెకు అన్నీ తెలిసివుంటాయి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ వినయ్.

చంద్రకాంతం వనజని పిలిపించింది. వనజకి పాతికేళ్లు వుండొచ్చు. సన్నగా రివటలా వుంది. మనిషి ఎరుపుగానే వుంది గానీ ముఖంలో కళ లేదు. పాలిపోయినట్లు వుంది.

"నీ పేరు ఏమిటి?"

"వనజ."

"అరుంధతి నీతో స్నేహంగా వుండేదా?"

అవునన్నట్లు తలవూపింది.

"ఆమె ఇక్కడ్నుంచి ఎవరితోనో వెళ్ళిపోయింది కదూ? ఎవరతను?"

"అతని పేరు బాబూరావు."

"అతనితో ఎందుకెళ్ళిందో నీకేమైనా చెప్పిందా?"

ఆమె ఇబ్బందిగా ముఖంలవంక చూసింది.

"చెప్పమ్మా ఫర్వాలేదు" అన్నాడు వినయ్.

"బాబూరావు చాలా మంచివాడట. అరుంధతి పది వరకు చదువుకుని ఇటువంటి పాడుపని చేస్తున్నందుకు విచారించాడట. అరుంధతి చాలా బాగుంటుంది. ఆమె అందం అతన్ని ఆకర్షించిందట. తనవెంట బెజవాడ వచ్చేస్తే ఆమెను శాశ్వతంగా పోషిస్తానని చెప్పాడు. ఆమె స్వతంత్రంగా బ్రతకడానికి ఏదైనా పని నేర్పిస్తానన్నాడట. చదువుకుంటానంటే చదువుగూడా చెప్పిస్తానన్నాడట. ఇంత చిన్న వయసులో ఈ నరకంలో జేరి నాశనమై పోతావని హెచ్చరించాడట. అరుంధతికి అతనూ నచ్చాడు. అతనితో వెళ్ళిపోయింది" అంది వనజ.

"బాబూరావు బెజవాడలో ఏం వ్యాపారం చేసే

వాడు?"

"అతను మోటారుసైకిళ్ళూ, కార్లు బాగుచేసేవాడట" అంది వనజ.

"బాబూరావుని నువ్వు చూశావా?"

"చూశాను."

"మనిషి ఎలా వుంటాడు?"

"సన్నగా పొడుగ్గా వుంటాడు."

"ఇంకా?"

వనజ ఆలోచిస్తోంది.

"ముఖం మీద మచ్చ ఏదైనా వుంటుందా?"

"నాకంత గుర్తులేదు."

"అరుంధతి నీతో బాగా స్నేహంగా వుండేది కదా! బెజవాడ వెళ్ళాక నీకు వుత్తరాలు రాసేదా?"

వనజ తల అడ్డంగా వూపింది.

## 9

బెజవాడ మోటార్ వర్క్‌షాపులో బాబూరావు, షేక్ పార్టనర్స్. దాన్ని కనుక్కోవడం ఏమంత కష్టంకాలేదు పోలీసులకు.

పెద్ద రేకుల షెడ్‌లో రిపేరులో వున్న లారీలు, మోటారుసైకిళ్ళు వున్నాయి. మెకానిక్‌లు నిర్విరామంగా ఏకాగ్రతతో పనిచేస్తున్నారు.

బాబూరావు షెడ్‌లో లేడు. షేక్ ఆఫీసురూమ్‌లో కూర్చుని టెలిఫోన్ ముందు జపం చేస్తున్నాడు.

ఇన్స్‌పెక్టర్ వినయ్ తనను పరిచయం చేసుకుని బాబూరావు కోసం వచ్చానని చెప్పాడు.

"బాబూరావు కోసం వచ్చారా! పాపం వాడి లైఫ్ ఒక ట్రాజెడీ అయిపోయింది సార్!" అన్నాడు షేక్.

"ఏం జరిగింది?"

"వాడి భార్య ఇద్దరు పిల్లలు చనిపోయారు. ఇక వాడికి ఎవరున్నారు?"

"అవును. అదంతా విన్నాను. మావాళ్ళు చెప్పారు ఆ కథంతా. ప్రమాదవశాత్తు విషాహారం తిని అతని భార్య పిల్లలు మరణించారని చెప్పారు."

"మీవాళ్ళు చెప్పినదంతా నిజంకాదు సార్!"

"మరి నిజం ఏమిటి?"

"ఇదంతా వాడి తలరాత. చేతులారా తన జీవితం నాశనం చేసుకున్నాడు. అరుంధతివల్ల జరిగింది."

"అరుంధతి అంటే కాకినాడనుంచి తీసుకొచ్చిన అమ్మాయే గదా!"

"అవును సార్! అదో రాక్షసి. దాన్ని అమాయకంగా నమ్మి బాబూరావు మోసపోయాడు. ఆ కంపెనీ ముండని బాగుచేద్దామని దానికొక కుట్టుమిషను కొని పెట్టి, ప్రత్యేకంగా ఒక మనిషిని బట్టలు కుట్టడానికి ఏర్పాటు చేశాడు. ఎంతో డబ్బు ఖర్చుపెట్టాడు. కాని దానికి విశ్వాసం అనేది లేకుండాపోయింది" అన్నాడు షేక్.

"అరుంధతి ఏం చేసింది?"

"అదే చెప్పబోతున్నాను సార్! వీడి మంచితనం చూసి దానికి దురాశపుట్టింది. వాడిని ఎట్లాగైనా పెళ్ళి చేసుకోవాలని ఆ ముండ వాళ్ళు తినే ఆహారంలో విషం కలిపింది. ఆ రోజు బాబూరావు ఇంటికి వెళ్ళేసరికి ఏముంది? అంతా అయిపోయింది."

"మీరు ఎలా చెప్పగలుగుతున్నారు అరుంధతి వాళ్ళకి విషం పెట్టిందని?"

"తర్వాత నమ్మకంగా తెల్సింది సార్! అరుంధతి

బాబూరావు భార్య పిల్లలు తిన ఆహారంలో విషం కలిపిందని. కాని అది రుజువు కాలేదనుకోండి. బాబూరావు మాత్రం తను అరుంధతికి సహాయం చేసినందుకు విచారించాడు. దాని అంతు చూస్తానని నాతో అన్నాడు."

"అరుంధతి అమృతం అనే పేరుతో హోటలు గదిలో దిగింది. దానికి కారణం ఏమిటో తెలుసా?"

షేక్ నవ్వాడు.

"దాని వేలుతో దాని కన్నే పొడిచాడు బాబూరావు. తను ఆమెను తిరపతిలో పెళ్ళిచేసుకుంటానని నమ్మించాడు. కాని ఈ సంగతి తన బంధువులకు తెలిస్తే అడ్డుపడతారనీ అందుకు ఆమెను పేరు ఊరు మార్చుకుని హోటల్లో దిగితే తను తర్వాత వచ్చి కలుసుకుంటానని చెప్పి పంపాడు."

"ఆ తర్వాత జరిగిందంతా మాకు తెలుసు. తన భార్య పిల్లలికి అరుంధతి విషం యిచ్చిందనే కసితో ఆమెకూ అదే గతి పట్టించాడు బాబూరావు. ఎంత తెలివిగా చేసినా మా దృష్టినుంచి తప్పించుకోలేదు. ఇంతకీ బాబూరావు ఎక్కడున్నాడో మీకు తెలుసా?" అన్నాడు ఇన్స్పెక్టర్ వినయ్.

"తెలుసు" అన్నాడు షేక్.

"తెలిస్తే చెప్పండి. ఎప్పటికైనా హంతకుడు శిక్షించబడాలిగదా!"

"వాడికి జీవితంమీద విరక్తి కలిగింది. అందుకే హిమాలయాలకు వెళ్ళిపోయాడు. మళ్ళీ రాననీ సాధువుల్లో కలిసిపోతానని చెప్పాడు" అన్నాడు షేక్.

"హిమాలయలకు వెళ్ళినా, అమెరికా వెళ్ళినా మా

నుంచి తప్పించుకోలేదు! మీ పార్ట్‌నర్‌ని రప్పిస్తాను చూడండి" అన్నాడు ఇన్స్‌పెక్టర్ వినయ్.

విచిత్రం ఏమిటంటే హనుమంతరావులో, బాబూ రావు పోలికలు చాలా వుండటంవల్ల అతనే అమృతం భర్తగా అందరూ పొరబడటం జరిగింది.

—: ఐపోయింది :—

## (పదిహేనవ భాగం)

వాన్ తలుపులు తెర్చుకుంటుండగా అక్కడికి చేరాడు రాణా.

శరీరమంతా కప్పివేస్తూ లోహపు దుస్తులు ధరించిన ఓ వ్యక్తి క్రిందకు దిగాడు చేతిలోని ప్రత్యేకమైన రైఫిల్‌తో.

ఆ రైఫిల్కి మూడంగుళాల పొడవైన ట్రిగ్గర్ ఉంది.

ఆ వ్యక్తి తలను కప్పేస్తూ హెల్మెట్—

కళ్ళముందు—హెల్మెట్‌ను కలుపుతూ మాస్కుకు ఫిట్ చేయబడ్డ అద్దం చూడ్డానికి వీలుగా.

ఆ వ్యక్తి వాన్ దిగి—బరువుగా తలతిప్పుతూ ఉలిక్కి పడ్డాడు.

అతని చేతిలోని రైఫిల్ చటుక్కున పొజిషన్‌లోకి వచ్చింది. ట్రిగ్గర్ మీద నాలుగు వేళ్ళు బిగుసుకున్నాయ్.

"కదలకు!"

"ఇట్సాల్‌రైట్ .... నేను రాణాని."

మరో బూడిదరంగు సూట్ ధరించిన ఆకారం వాన్ దిగుతూ పల్కింది. "యస్. కాప్టెన్! అతనే రాణా! రైఫిల్ దించండి!"

"సారీ సర్" రైఫిల్ వ్యక్తి అన్నాడు "దార్లో ఎదురైన కొన్ని సంఘటనలు చూసాక చీమచిటుక్కు మన్నా కంగారుపడక తప్పడంలేదు."

"ఇట్స్ ఓ. కే. ఆ సంగతి అర్థం చేసుకోగలను." రెండో ఆకారం కాప్టెన్‌ని తోసుకుంటూ రాణావైపు వచ్చింది.

"వెల్డన్ మిస్టర్ రాణా!" పల్కింది ఓ పరిచిత కంఠం హెల్మెట్ స్పీకర్‌లోంచి. "నీ ప్లాన్‌ని అమలు

పర్చడాన్కి మా రాక ఆలస్యం కాలేదని ఆశిస్తాను."

అతని హిందీ భాషలో దక్షిణాది యాసని గుర్తించాడు రాణా. "ప్రొఫెసర్ అశ్వత్థామ?" అడిగాడు.

"ఎస్" జవాబొచ్చింది. "మైకోప్లాస్మాని మనం కొండలో సీలు చేయకముందు దాన్నోసారి తాజాగా చూడాలని నిర్ణయించుకున్నాను. గుండెకాయలాంటి ఆ విషపదార్థాన్ని మనం ట్రాప్ చేయగలిగినప్పుడు మిగిలిన పొగమంచుని చెదరగొట్టడం అతి సులభం.

ఆ శాంపిల్‌ని మనం సేకరించిన తర్వాత అతి త్వరగా విరుగుడు ముందు కనుక్కోడాన్కి తప్పక వీలవుతుంది. తద్వారా వేలాదిమంది ఉన్మాదుల్ని కాపాడవొచ్చు. మనం దాన్ని భూగర్భ సమాధి చేయకముందు ఆ శాంపిల్‌ని గ్రహించాలి....ఎందుకంటే ఆ మైకోప్లాస్మాని ప్రొఫెసర్ విశ్వామిత్ర ఏ విధమైన విషపూరిత మార్పులు చేసాడో యిప్పటికీ నాకు తెలియదు." తను అప్పుడే దిగిన స్పెషల్ వాహనాన్ని చూపిస్తూ అన్నాడు అశ్వత్థామ "మనం వెంటనే ఆ టన్నెల్‌కు చేరుకోవాలి. మాట్లాడుతూ టైం వృధా చేసే అవకాశంలేదు."

రాణాని చేయిపట్టుకుని నడిపిస్తూ స్పెషల్ వాన్ వైపు తీసుకెళ్ళాడు అశ్వత్థామ. "ఇతను కాప్టెన్ నగర్వాలా. బాంబులు, డైనమెట్లు గురించి యితన్కి తెలియని విషయంలేదు. అవర్ కంట్రీస్ టాప్—ఎక్స్‌ప్లోజివ్స ఎక్స్‌పర్టు!"

అంటూ స్పెషల్ రైఫిల్ ధరించిన వ్యక్తిని రాణాకు పరిచయం చేసాడు అశ్వత్థామ.

"సర్! మీరు బేస్‌కి రిపోర్టు చేసినపుడు డోగ్రా విషయం ప్రస్తావించలేదు" అన్నాడు అనుమానంగా

నగర్వాలా.

రాణా దూరంగా రోడ్డు పైపడి వున్న రెండు ఆకారాల వైపు చేత్తో చూపించాడు.

"వారిలో ఒకడు డోగ్రా. వాన్ యాక్సిడెంట్లో అతనికి తీవ్రమైన గాయాలు తగిలాయి. పిచ్చివాళ్ళ మధ్యకు నడిచాడు అలాగే. వాళ్ళు అతన్ని ప్రాణం పోయేవరకూ...."

నగర్వాలా లాలోపల తిట్టుకుంటూ వాన్ అధిరోహించాడు.

వాన్ లోపల లోహపు దుస్తులు ధరించిన, మరో వ్యక్తివైపు ఆశ్చర్యంగా చూసాడు రాణా.

"దిసీజ్ సుబేదార్ సైలో! ప్రేలుడు సామగ్రికి సంబంధించిన ఎస్సయిన్మెంట్స్ తగిలితే నాకు అసిస్టెంట్‌గా పనిచేస్తాడు. క్లెవర్ హెడ్" నగర్వాలా పరిచయంచేసాడు రాణాకి—అతని వెనకగా కూర్చుంటూ.

సైలో—హెల్మెట్ తల పంకించాడు.

"ప్రేలుడు పదార్థాలు తీసుకురావడాన్కి—ఈవాన్‌లో చోటు సరిపోయిందా?" అడిగాడు రాణా.

చిన్నకాబిన్‌లో ఆ నలుగురూ ఇరుగ్గా కూర్చున్నారు. రాణా తప్ప మిగతావారు లోహపు దుస్తులు ధరించడంవల్ల వాళ్ళ ఆకారాలు లావుగా అయ్యాయి.

"మేం తీసుకొచ్చిన క్వాంటిటీ సరిపోతుందని మా నమ్మకం సర్" చెప్పాడు సుబేదార్. "బ్లాసింగ్ జెలటిన్ తీసుకువచ్చాం. మీరు యిప్పుడు ఆ బాంబుల మీదే కూర్చున్నారు."

రాణా సీట్లో యిబ్బందిగా కదిలాడు.

"డోంట్‌వర్రీ సర్!" నగర్వాలా అన్నాడు. "ప్రస్తు

తాన్కి అది ప్రమాదకరం కాదు."

"ఎవరైనా దాన్ని బలంగా కొట్టేవరకూ" పొడిగా అన్నాడు సుబేదార్ సైకో.

"ఎస్" ఒప్పుకున్నాడు కాప్టెన్. "ప్రస్తుతాన్కి రాణా డ్రైవ్ చేయడం మంచిదని నా సలహా. మనకంటే స్పష్టంగా ఆయన చూడగలుగుతారు. ఒకసారి తలుపు తీసాం కాబట్టి—మా హెల్మెట్స్ తీసి డ్రైవ్ చేయడం క్షేమం కాదు."

రాణా యిరుగ్గా కదిలి డ్రైవర్ సీట్లో కూర్చున్నాడు. సార్జంట్ అతను ఖాళీచేసిన వెనక సీట్లో చేరాడు.

అశ్వత్థామ అన్నాడు.

"మైక్రోప్లాస్మా ప్రభావాన్ని నిరోధించే శక్తి పూర్తిగా ఈ దుస్తులకుందో లేదో నేను చెప్పలేను. ముఖ్యంగా విషమేఘం మధ్య—శక్తివంతమైన మైక్రోప్లాస్మా చేరువలో! అందుకే దాని శాంపిల్ని పరిగ్రహించాల్సిన వ్యక్తి నువ్వొక్కడివే మిస్టర్ రాణా!"

రాణా శరీరం ఒక్కసారి జలదరించింది.

"డోంట్ వర్రీ మై బాయ్" ధైర్యాన్నిస్తూ అన్నాడు అశ్వత్థామ. "మైక్రోప్లాస్మాకి మరీ దగ్గరగా నువ్వు వెళ్ళనక్కర లేదు. మనవద్ద చాలా పొడుగాటి మెటల్ ట్యూబ్ వుంది. నువ్వు చెయ్యవల్సిందల్లా గొట్టాన్ని మాక్లియస్ లోకి డైరక్ట్ చేయడమే. మాలో వొకరు నీతో సాధ్యమైనంత దగ్గరగా వస్తారు. నీకే హాని జరగకుండా వాచ్ చేయడాన్కి."

వాహనం కదిలింది....

రోడ్డుమీద కనబడుతున్న మృతదేహాల్ని తప్పిస్తూ ముందుకు పోనిచ్చాడు వాన్ని—రాణా. బొంబాయి

నగరమంతా మరుభూమిలా కన్పించసాగింది. అందరి మధ్యా నిశ్శబ్దం గూడు కట్టుకోవడంతో, ఆ స్తబ్ద వాతావరణం సహించలేక సంభాషణ ప్రారంభించాడు రాణా.

"ప్రొఫెసర్! మనం విరుగుడు మందు కనుక్కొనే టప్పటికి బొంబాయిలో కేవలం కొన్ని వేలమంది మాత్రమే మిగులుతారేమో? ఈలోగా ఉన్మాదులు వారిలోవారే హత్యలు....మూక ఉమ్మడి ఆత్మహత్యలు...."

"దాన్ని నివారించగలం రాణా!" అశ్వత్థామ అభయ హస్తం రాణా భుజంపై పడింది.

ఆశ్చర్యంగా అడిగాడు రాణా "ఎలా?"

"మొత్తం నగరమంతా మత్తుమందు జల్లబోతున్నాం. స్లీపింగ్ గాస్."

"వ్వాట్?! దట్స్ యింపాసిబుల్!"

"నో, ఇటీజ్ పాసిబుల్" శాంత గంభీరస్వరంతో అన్నాడు అశ్వత్థామ "'బొంబాయి'లో ఈ సంక్షోభం ప్రారంభమైనప్పటినుంచీ విమానాలు, హెలికాప్టర్లు రెండింటిని లోడ్ చేసుకుంటున్నాయ్. మొదటిది కాల్షియం క్లోరైడ్ రెండోది నైట్రస్ ఆక్సైడ్! ఈ గాస్ మనిషిని వెంటనే పడగొడుతుంది. ఈ కార్యక్రమం ముఖ్యోద్దేశం సిటీనంతటికీ నిద్రలోకి పంపడం....నిద్రలో వుంచడం....విరుగుడు మందు కనుక్కొనేంతవరకూ— ఈ విధంగా మనం లెక్కలేనంత మందిని కాపాడవొచ్చు. హత్యాకాండలనీ, ఆత్మహత్యాకాండలనీ సులభంగా ఆపవచ్చు."

రాణా ఉత్సాహంగా, స్పీడ్ పెంచాడు.

నిజమే. స్లీపింగ్ గాస్ ప్లాన్ బాగుంది. త్వరలో విరుగుడు మందు కనుక్కుంటే లక్షలమందిని కాపాడ

వచ్చు.

అందుకే తాము ఈసారి ఆ శాంపిల్ సేకరించడంలో ఖచ్చితంగా సఫలం కావాలి!

ఎన్ని కష్టాలు ఎదురైనాసరే!

మరో అయిదు నిముషాల్లో వారు—రెండు నల్లటి టన్నెల్ ముఖద్వారాల వద్దకి చేరారు.

సైన్యానికి సంబంధించిన యిద్దరు వ్యక్తులు ముందు దిగారు, అప్రమత్తతగా; చేతిలోని రైఫిల్స్ ఏ క్షణంలోనైనా ఉపయోగించడానికి సిధమౌతూ.

ప్రొఫెసర్ అశ్వత్థామ చివరిగా వాన్ దిగి అన్నాడు, "మనం ముందు న్యూక్లియస్ యింకా అక్కడే వున్నదాని నిరాకరించుకోవాలి..." ఆగి ఆశ్చర్యంగా అన్నాడు "యిక్కడ రెండు టన్నెల్స్ ఉన్నాయే?"

రాణా తల పంకించాడు. "అవును. మొదటిది పాత టన్నెల్. కుడివైపు భూగర్భ మార్గం సరికొత్తది. ఉత్తరానికి వెళ్ళే ట్రాఫిక్ మొదటి మార్గంగుండా వెళ్తుంది. దక్షిణానికి వచ్చే ట్రాఫిక్ రెండో టన్నెల్ ఉపయోగిస్తుంది. విషమేఘం గుండెకాయ... న్యూక్లియస్ పాత టన్నెల్‌లో ఉంది." చేత్తో చూపించాడు రాణా "అది ఈపాటికి పారిపోకుండా యింకా అక్కడే ఉందని ఆశిద్దాం."

నలుగురూ ముఖద్వారంవేపు నడిచారు. రాణాకు తప్ప మిగతా ముగ్గురికీ—వెనుక ఆక్సిజన్ టాంకులు ఉన్నాయి.

"రాయి చాల గట్టిగా ఉంది!" వ్యాఖ్యానించాడు కాప్టెన్ నగర్వాలా ముఖద్వారం పైకప్పువేపు తలెత్తి చూస్తూ "రాతి గోడ స్ట్రాంగ్‌గా ఉంది. ముఖద్వారాన్ని

దృఢంగా కప్పేస్తుంది బ్లాస్టింగ్ తర్వాత."

"హే రామ్!" గాభరాగా అర్చాడు సుబేదార్ సైలో అక్కడో యువతి మొండెం నేలమీద పడి ఉంది!"

"దాన్ని గురించి మర్చిపో!" కఠినంగా అన్నాడు రాణా.

అతను ఏడు గజాలు లోపలికి నడిచేడు. అప్పుడు ఆగిపోయి నిలబడిపోయాడు కళ్ళు చీకటికి అలవాటు చేస్తూ.

"అది అక్కడే ఉంది" డిక్లేర్ చేసాడు కొంతసేపు తర్వాత రాణా.

యిద్దరు సైనికులు తిరిగి స్పెషల్ వాన్ వద్దకు నడిచారు.

వాన్ వెనుకభాగంలోంచి ట్రాలీలాంటి ఓ పరికరాన్ని క్రిందికి దింపారు.

ఆ సక్షన్ యంత్రం—రాణా మరాఠా కోటలో ఉపయోగించిన, దానిలాగే ఉంది. కాని యిది యింకా పెద్దది.

ఫైర్ సర్వీసెస్ ఉపయోగించే గొట్టంలాంటి—పొడుగాటి మెత్తటి స్టీల్‌తో చేయబడ్డ ట్యూబ్‌ని, మడతలు పెట్టి భుజానికి తగిలించుకొని సైలో—యంత్రాన్ని టన్నెల్ ముఖద్వారంవైపు నడిపిస్తున్న నగర్వాలాను అనుసరించాడు.

"మిస్టర్ రాణా! దీన్ని మీతో తీసుకెళ్ళండి" కాప్టెన్ అన్నాడు. ఓ చిన్న ఆక్సిజన్ టాంకుని రాణాకు అందిస్తూ, "యూ మే ఫైండ్ ఇట్ నెస్సెసరీ.... ఈ టార్చిలైట్ కూడా."

రాణా అతనికి థాంక్స్ చెప్పి చేతులు చాపి, టాంక్ బెల్టు తగిలించుకున్నాడు. టార్చి వెలిగించి, మరో చేత్తో ట్రాలీ యంత్రం మీద చేయివేసి అన్నాడు "అయామ్ రెడీ ప్రొఫెసర్!"

యిద్దరూ పల్లంగా వున్న టన్నెల్ లోపలి భాగంలోకి నడిచారు.

మొదటి మలుపు తిరగ్గానే అశ్వత్థామ హఠాత్తుగా ఆగిపోయాడు, మొదటిసారిగా ఆ 'వెలుగు' చూస్తూ.

"ఇన్నాళ్ళకి-దాన్ని స్పష్టంగా చూడగలుతున్నాను."

రాణా మాట్లాడలేదు.

ఒక్కో అడుగు ముందుకువేసే కొద్దీ శరీరం వణుకుతోంది.

చెమటతో అతనికి వీపంతా తడిసిపోయింది.

యిద్దరూ ముందుకి నడిచారు.

"మీరిక్కడ ఆగిపోడం మంచిది ప్రొఫెసర్! కాంతి తీవ్రంగా ఉంది" అభ్యర్థించాడు రాణా.

"ఎస్ ... ఎస్ .... ఐ థింగ్ యు ఆర్ రైట్ .... ఈ మాస్క్ వల్ల నేను నీ అంత స్పష్టంగా చూడలేను. కాని మనం మైక్రోప్లాస్మా ప్రధాన భాగాన్ని చేరామనుకుంటాను."

"లేదు ప్రొఫెసర్! అవతలి మలుపులో కాంతి యింకా దారుణంగా ఉంది. నేను ముందుకు వెళ్తున్నాను. మలుపులో సాధ్యమైనంత వరకూ మీకు కనపడేటట్లు నిల్చుంటాను" టన్నెల్ మేఘం దట్టంగానే ఉంది.

ముందుకి నడుస్తూ వంపును చేరుకున్నాడు రాణా, ఓసారి ప్రొఫెసర్ కోసం వెనక్కి తిరిగిచూస్తూ. ఆయనకు దూరంగా పోవడం అతనికి యిష్టంలేదు.

కాంతి జగజ్జేయమానంగా వెలుగుతూ కనబడింది రాణాకి.

బహుశా ఆ కాంతి కూడా దినదినం పెద్దది అవుతుందేమో.

తను మరాఠా దుర్గంలో చూసినపుడు ఆ వెలుగు అంత తీక్షణంగా లేదు.

త్వరత్వరగా లోహపు గొట్టాన్ని — యంత్రానికి అమర్చాడు రాణా.

తను సాధ్యమైనంత త్వరలో పని పూర్తి చేసుకుని బైటపడటం మంచిది.

గొట్టం చివరి భాగాన్ని న్యూక్లియస్ పదార్థంలోకి జొప్పించే ముందు—రాణా ఆక్సిజన్ సిలిండర్‌కి వ్రేలాడుతున్న మౌత్ పీస్‌ని నోటిముందు అమర్చుకున్నాడు— అక్కడి వాసన క్షణక్షణానికి భరించరానిదిగా మారుతుండడంవల్ల.

మెల్లగా మెత్తని స్టీలుగొట్టం మడతలు విప్పి నేల మీద పరిచాడు రాణా.

నేల చదునుగా వుంది.

రాణా గొట్టాన్ని ముందుకు త్రోయసాగాడు.

చివరికి—ట్యూబ్ ముందు భాగం ఆ వెలుగులోకి మాయమైంది, ఏ అడ్డూ లేకుండా....

అదే ఆశ్చర్యపరిచింది రాణాని.

న్యూక్లియస్ గట్టిగా వుండి, దేనినీ ప్రవేశించనీయడాన్కి వీలులేకుండా వుంటుందనుకున్నాడు.

కాని రాణాకి మళ్ళీ నిజం జ్ఞాపకం వచ్చింది. అది— అతి సూక్ష్మమైన లక్షలాది వ్యాధిక్రిముల సముదాయమని గుర్తు చేసుకున్నాడు.

స్టీల్ ట్యూబ్ మరింత ముందుకు తోసి — సక్షన్ యూనిట్ స్విచ్ నొక్కాడు రాణా.

బర్ బర్ మంటూ శబ్దం చేస్తూ పని చేయసాగింది సక్షన్ యంత్రం, అవతలి పదార్థాన్ని అతివేగంగా లోపలికి పీల్చేసుకుంటూ.

ఆ క్రియలో వంపులు తిరిగి వున్న గొట్టం, పైకీ కిందికీ కదిలి నిటారుగా బిగుసుకుంది.

యంత్రంలో ఉన్న కంటైనర్ నిండుకోడానికి మూడు నిముషాలు పడుతుందని అశ్వత్థామ అంతకుముందు రాణాకి చెప్పాడు. రాణా యంత్రాన్ని వదిలేసి, మోకాళ్ళమీద కూర్చున్నాడు ఆ విచిత్రమైన కాంతిని సూటిగా చూస్తూ.

అతను కూర్చుని తదేకంగా చూసిన ఆ మూడు నిముషాల్లో యింకా ముందుకు వెళ్ళాలన్న బలమైన కోరిక రాణాలో చాలాసార్లు కలిగింది.

చివరికి నిట్టూర్పు విడుస్తూ రాణా సక్షన్ యంత్రాన్ని ఆపేశాడు.

పదార్థం చేరుకున్న కంటైనర్ సీలు చేయబడడానికి మరో బటన్ నొక్కాడు.

తర్వాత ట్యూబ్ కనెక్షన్ లాగేసి నేలమీద వదిలేశాడు.

పైకిలేచి మరోసారి చూసాడు రాణా వెలుగువైపు.

బహుశా యింకా దగ్గర్నుంచి చూస్తే మంచిదేమో? మైకో ప్లాస్మా నిర్మాణాన్ని సంబంధించిన ఆధారాలు తనకు దొరికితే అశ్వత్థామకు చెప్పొచ్చు.

ఆ విషయం-ఆయన విరుగుడు మందు పరిశోధనకెంతో ఉపయోగపడొచ్చు.

(ఇంకా వుంది)

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చెరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతి పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 9/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ'

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 108/-లు ముందుగా పంపవచ్చును. ◆



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## అందం వెనుక....?

'మెట్రో'లో 'గృహ ప్రవేశ్' నడుస్తున్నది.

కలకత్తాలో మొదటివారం మామూలుగా టిక్కట్లు దొరకడం అరుదు. ఆశ్చర్యంగా ఆ రోజు ఇంకా టిక్కట్లు దొరుకుతున్నాయి.

ప్రసాద్ గబగబా 4-75 కౌంటర్ దగ్గర నిలుచున్నాడు. 'క్యూ' చిన్నదిగానే వుంది. మెల్లిగా కదులుతోంది.

"ఎక్స్‌క్యూజ్ మీ! కెన్ యు గెట్ మీ ఎ టికెట్ ప్లీజ్!" అంది ఒక అందమైన గొంతు. ఆ అందానికి ముగ్ధుడై తనకి తెలియకుండానే తలాడించాడు ప్రసాద్. చేతిలో 5 రూపాయల నోటుపెట్టి యిప్పుడే వస్తానని వెళ్లిపోయింది.

రెండు టిక్కట్లు తీసుకొని చొక్కా జేబులో పెట్టుకున్నాడు. పై జేబులో నూరు రూపాయల నోటు వుంది.

ఇంతలో ఆ అందం వయ్యారంగా నడుచుకుంటూ వచ్చింది.

టిక్కట్టు, పావలా తీసి ఆమె చేతిలో పెట్టాడు.

ఆ అమ్మడు థాంక్స్ చెప్పలేదు. మింగేసేటట్లు ఉరిమి చూపింది.

"వందరూపాయల నోటు ఇస్తే పావలా ఇస్తారేమిటి? మిగతా డబ్బులు ఏవి?" అని దబాయిస్తోంది. ప్రసాద్ బిక్కచచ్చిపోయాడు. ఎంత చెప్పినా ఆ అందం వినిపించుకోవటంలేదు. పైగా రెచ్చిపోతోంది. బెంగాలీలో అరవడం ప్రారంభించింది.

చిన్న గుంపు చేరింది.

ప్రసాద్ ఇంగ్లీషులో, ఆ అమ్మాయి బెంగాలీలో తమ తమ కథలు ప్రారంభించారు.

ఆ అమ్మాయి దాదాపు బెక్కుతూ, అతని జేబులో నూరురూపాయల నోటు వుంటుంది, వెతకమంది. గుంపులో ఒక పెద్దమనిషి ప్రసాద్ పై జేబులో నుంచి వంద రూపాయల నోటు తీసాడు.

అంతే! ప్రసాద్ చెపుతున్నది యెవరూ వినిపించుకో లేదు.

నోటు అమ్మాయి చేతికి, దెబ్బలు ప్రసాద్ వంటికి రవాణా అయ్యాయి.

దవడలు వాచాయి. కన్ను పొంగింది. పళ్ళు కదిలాయి చొక్కా చిరిగింది. పెదవి చిట్లింది.

పోలీసు వచ్చి ప్రసాద్‌ని విడిపించి, నాలుగు చీవాట్లు పెట్టి టాక్సీ ఎక్కించి ఇంటికి పంపాడు.

అక్కా, బావా ఎంత చెప్పినా వినకుండా ఆ రాత్రే కోరమండల్‌లో విశాఖ వచ్చేసాడు ప్రసాద్.

ఆ తర్వాత ప్రసాద్....

మళ్ళీ కలకత్తా వెళ్ళలేదు.

ఏ అమ్మాయి టిక్కట్టు తియ్యమన్నా తీయలేదు.

—డాక్టర్ ప్రభాకర్, కలకత్తా-73.

